# మాయామయి

## మొదటి అధ్యాయం

### 1

ఇంద్రదేవుడు మహారాజును ఉద్దేశించి "మహాప్రభూ నేటి మీదర్బారు నాటకశాలగా పరిణమించిందంటే ఆశ్చర్యం లేదు. నాటకంద్వారా ప్రేక్షకులలో ఎటువంటి భిన్న భిన్న రసానుభూతులను కలిగిస్తామో అలాగే యీ వేళ యిక్కడ జరగబోయే నాటకం మనలనందరినీ అటువంటి రసావేశంలో ముంచెత్తుతుంది. దురదృష్టవశాత్తు అనేక కష్టాలను సహించిన వారిక్కడ వున్నారు. ఎవరు తమ గోతులను తామే త్రవ్వుకున్నారో అట్టి వాళ్ళూ ఉన్నారు. ఎవరు భగవదేచ్ఛగా ప్రారబ్ధఫలాలను అనుభవించారో వాళ్ళూ ఉన్నారు. ఎవరు శిక్షాస్థలో వారూ బంధీలై వున్నారు. అందుచేతనే మన పెద్దలు శుభాశుభ కర్మఫలం, అవశ్యం అనుభవించవలసిందే అనీ ఒకరిని చెఱచినవారు తాము చెడక తప్పదనీ ఎంతో అనుభవంవల్ల గ్రహించి చెప్పివున్నారు. అందువల్ల ఈజన్మలో సన్మార్గవర్తనులుగా ఉన్నవారు పూర్వజన్మకృత దుష్కృత పరిపాకంవల్ల కష్టాలు అనుభవించటమూ, అదేవిధంగా ప్రస్తుతం దుష్టులుగా ఉన్నవారు ఏ పూర్వపుణ్య లేశంవల్లనో సుఖించ

టమూకూడా చూస్తాం. కొంతమంది ఈ జన్మంలో చేసిన పాపానికి ప్రతిఫలం ఈ జన్మలోనే అనుభవిస్తున్నట్లు కూడా కనబడుతుంది. కొందరు చేసిన పాపాలు చాలాకాలందాకా బయటపడవు. అది వారి వారి జాతకప్రభావం అంటారు. సౌఖ్యం పొందగలిగితే అది తమ ప్రభావమనీ, కష్టం కలిగితే, దైవంవల్ల వచ్చిందనీ అనుకొంటారు. అసలు దైవం మనకు చేకూర్చు సుఖదుఃఖానుభవాలు మనం ఒకప్పుడూ చేతులారా చేసికొన్న పనుల ఫలితాలే – అని ఊహించరు. ఆ విధంగా ఊహించగలిగేవాళ్ళు ఆ కార్యం చెయ్యనే చెయ్యరు. పామరులు అది తెలియక స్వార్థంకోసం ఎంత దుస్సాహసమైనా చేసి పర్యవసానంగా దుఃఖసాగర నిమగ్నులవుతారు. ఇప్పుడు నేను చెప్పినదంతా యదార్థమే అనటానికి ప్రత్యక్ష నిదర్శనాలెన్నో కనబడతాయి. మీవద్ద ఈ అన్నిరకాల మనుష్యులూ ప్రత్యక్షంగా వున్నారు. అంతేకాక కొందరు తమ పూర్వులు చేసిన అపరాధానికి బలి అయినవాళ్ళుకూడా వున్నారు. లక్ష్మీదేవినే చూడండి. ఆమె యెవరికీ ఎలాటి అపకారమూ చేసియెరుగదు. అయినా ఆమె యెన్నో కష్టాలను అనుభవించింది. అలా ఎందుకు జరిగింది? దానికి కారణం గోపాలసింహ మహారాజే. ఆయన దుష్టుల చేతులలో కీలుబొమ్మ అయిపోయాడు. ఆయన తన యింట్లో ఎప్పుడేం జరుగుతోందో ఉద్యోగస్థులు ఎలాటి కుట్రలు పన్నుతున్నారో తెలుసుకోలేక పోయాడు. తన యింటిని చక్కబెట్టుకోలేని రాజు ఎంతమంచి వాడే అయినా తన రాజ్యాన్నిమాత్రం ఏం చక్కబెడతాడు? అటువంటివాడు సంకటపరిస్థితులలో చిక్కుకొనక తప్పదు.

గోపాలసింహుడు చాలా చిక్కులపాలు కావటానికి యింకో కారణంకూడా వున్నది. ఆయన దుర్మార్గురాలైన మాయా రాణికి వ్యామోహంవల్ల సమస్త రహస్యాలనూ విప్పిచెప్పాడు. దానివల్ల ఆయనకు మరీ కీడు జరిగింది. ఏ మనుష్యుడూ కేవలం మంచివాడైనంత మాత్రంచేతనే జీవితయాత్ర సుఖంగా నిర్వహించుకోలేడు. శివదత్తుణ్ణి చూడండి! అతనిని అతని చుట్టూ ఉన్నవాళ్ళందరూ కలిసి పాడుచేశారు. భోగలాలసుడై మేను మరచి శివదత్తుడు తనను తాను నిర్మూలం చేసుకొన్నాడు. ఆతర్వాత వస్తుతః మంచివాడైవుండి కూడా కొన్ని పొరపాట్లవల్ల చిక్కులలో పడిపోయినవారి సంగతి చెబుతాను. నిజానికి భూతనాథుడు చాలా మంచివాడే. అతనివలె చాతుర్యంకల ఐంద్రజాలికులు వ్రేళ్ళమీద లెక్క పెట్టవలసినవారై ఉంటారు. కాని అతడు పేరాసచేత ప్రపంచానికి ముఖాన్ని చూపించలేని పరిస్థితిలో వున్నాడు. అతడే స్వయంకృషి, ఋజువర్తనా ప్రాతిపదికలుగా ధనార్జనానికి పూనుకుంటే ఈ పాటికెంతో సంపాదించేవాడు. అతని కుటుంబము సలక్షణంగా ఉండేది. ఈ విషయాలన్నీ నేను భూతనాథుణ్ణి మరింత బాధించాలని చెప్పటంలేదు. అతనిని భయంకరమైనగత జీవితంలోనుండి విముక్తుణ్ణిచేద్దామనే ఉద్దేశ్యంతో నేనే నీ మాటలు చెబుతున్నాను. అనేక సంవత్సరాలపాటు అతడు పూర్తిగా అవిశ్వాస పాత్రుడయ్యాడు. అయినా నేనతణ్ణి క్షమిస్తున్నాను. ఈ మధ్య అతడు మనందరికీవిశ్వాసపాత్రుడుగా ప్రవర్తించసాగాడు. చాలా సంతోషం. ఇవ్వేళ ఇతడు తన రహస్యాలు బయటపడతాయని భయపడుతున్నాడు.

ఇంకా వాటిని దాచాలని ప్రయత్నం చేస్తున్నాడు. అతడలా చెయ్యకుండా యిప్పటికైనా ఆ రహస్యాలను బయటపెట్టివేసి హాయిగా జీవించటం మంచిది. అతడు చేసిన పనులు కొన్ని మనకు చాలా ఆశ్చర్యాన్ని కలిగిస్తాయి; నిజానికి మనుష్యుడన్నవాడెవడూ అలాటి పనులు చెయ్యడు. ఇప్పటికైనా భూతనాథుడు ఆ విషయాలనన్నీ చెప్పి ఒప్పుకుంటే మంచిది.

భూత:— అవును. మహా పాపాలే చేశాను. అవన్నీ నోటితో చెప్పలేకపోతున్నాను. చేసినవాటికి పశ్చాత్తాపపడుతున్నాను. శేషజీవితం నిర్మలంగా గడపాలని నిశ్చయించుకొన్నాను.

ఇంద్ర:— నీ అభిప్రాయం చాలా మంచిది. నీవు మహారాజాదగ్గర ఇంద్రజాలికుడవుగా ని యుక్తుడవైననాడే నీవు తిరిగి మనుష్యుడవుగా రూపొందావు. పూర్వం నీవెటువంటి ఘోరకృత్యాలు చేసినా, తర్వాత నీవు చేసిన కొన్ని మంచి పనులు నీలోని మార్పును ఋజువు పరుస్తున్నాయి.

భూత:— మీరెంత చెప్పినా నేను చేసిన పాపాలు క్షమించరానివి. నేను నాజీవనచరిత్ర చెప్పటానికి ప్రారంభిస్తున్నాను.

అతడు గట్టిగా నిట్టూర్చి సురేంద్రసింహ మహారాజువైపు చూచాడు.

సురేం:— నీచరిత్ర మాకు కొద్ది కొద్దిగా తెలిసినప్పటికీ నీ నోటిద్వారా పూర్తిగా వినాలనే ఉన్నది. నిస్సంకోచంగా వివరాలతో కూడిన నీ జీవితచరిత్ర చెప్పు. దానివల్ల నీ మనస్సు పరిశుద్ధమై ఇకమీదట, నీవు హాయిగా జీవించగలుగుతావు.

భూతనాథుడు చిత్రం - అని తన కథ ప్రారంభించాడు.

"మొట్టమొదట మీకెవరికీ తెలియని విషయం ఒకటి చెబుతాను. నేను నాగధ నివాసియైన జీవనసింహుని కుమారుణ్ణి. జీవనసింహుడు దేవీసింహునకు పినతండ్రి. నా సవతి తల్లి నన్ను చాలా అసహ్యంగా చూసేది. నా మూలాననే మా తల్లికి గౌరవంకలిగింది. గొడ్రాలయిన నాసవతి తల్లిని ఎవరూ పలకరించేవారు కాదు. అందుచేత నాసవతితల్లి నన్ను చంపాలని చూచింది. ఆ విషయం మా నాన్నకు తెలిసింది. అప్పుడు నాకు ఎనిమిదేండ్ల వయస్సు. నన్ను మా తండ్రి తన స్నేహితుడైన దేవదత్త బ్రహ్మచారికి అప్పగించాడు. ఆయన తేజసింహుని గురువుకూడాను. వీరేంద్రసింహమహారాజు భేదించిన నాగధపు ఇంద్రజాలంలోనేవారు ఉండేవారు. మాతండ్రి వారికేం చెప్పాడోగాని నన్ను వారు తన కుమారునివలె పెంచుతూ విద్యాబుద్ధులు చెప్పించారు. మాయాజాలంకూడా నేర్పారు. ఆ అడవిలో నా ఆకారం చాలా మారిపోయింది. అప్పుడప్పుడు మా తండ్రి నన్ను చూడటానికి వచ్చేవాడు."

సురేం:- అరేరే! నీవు జీవనసింహుని కుమారుడవా? నిన్నేనా మీ నాన్న పెద్దపులి ఎత్తుకుపోయిందని ప్రచారం చేశాడు.

భూత:- చిత్రం.

తేజ:- ఏమిటీ! గురువుగారు 'ఫికరీ' అని పిలిచే కుఱ్ఱవాడవు నీవేనా?

భూత:- అవును.

దేవి:— నేను చాలాకాలంనుండి నిన్ను నా సోదరుడుగా భావించాను. కాని ఈనాడు నువ్వు నిజంగా సోదరుడవే అని తెలిసి చాలా సంతోషిస్తున్నాను. అయితే పేర్‌సింహుడు నీ సోదరుడు కాడా ?

భూత:— కాడు. బ్రహ్మచారిగారి పుత్రుడాయన. మే మిద్దరం ఒకచోటనే పెరిగి పెద్దవారమయ్యాము. అందుచేత అన్నదమ్ములుగానే వ్యవహరించేవాళ్ళం.

తేజ:— ఇప్పుడు పేర్‌సింహుడు ఎక్కడఉన్నాడు ?

భూత:— తెలియదు కాని బహుశః ఆయన మనకింకా కనపడక పోవచ్చు.

వీరేం:— ఎందుచేత ?

భూత:— ఆయనకూడా మాముఠాలో చేరి ఎన్నోతప్పులు చేశాడు.

సురేం:— దానిదేమున్నదిలే ! చెప్పు !

భూత:— చాలాసంవత్సరాలపాటు బ్రహ్మచారిగారివద్ద వున్నాను. నా తండ్రి నేను మాయాజాలంలో ప్రవీణుడ నైనందుకు చాలా సంతోషించాడు. బ్రహ్మచారితో నా మాయాజాలం ఉపయోగపడేటట్టు ఏ రాజ్యంలోనన్నా ఉద్యోగం చూడమనిచెప్పాడు. అందుచేత ఆయన నన్ను గదాధరసింహుడనే పేరుతో రణధీరసింహుల కొలువులో ప్రవేశపెట్టారు. దిగ్విజయసింహ మహారాజువద్ద పేర్‌సింహునికి నౌకరీ కుదిరింది. దీనినిబట్టి మీకు పేర్‌సింహుడూ, గదాధర సింహుడూ ఎలాసోదరులయ్యారో అర్థమైందనుకుంటాను.

"ఆరోజులలో రణధీరసింహుల సంస్థానంలో ఎక్కువగా ప్రమాదాలు జరుగుతుండేవి. చాలామంది ఆయనకు శత్రువులయారు. రణధీరసింహులు మరణించటం ఖాయమే అను కున్నారు అందరూ. ఆయన ఐంద్రజాలికుడైన శ్రీ సింహుడు శత్రువులవల్ల నిహతుడయినాడు. అతడేవిధంగా మరణించాడో ఎవరికీ తెలియలేదు. దానినిబట్టి రణధీరసింహులవద్ద ఆరోజు లలో పనిచెయ్యటం ఎంతకష్టమో మీరే ఊహించుకోండి! అయినా నేను నిర్భయంగా అక్కడే ఉన్నాను. నాయజమానికి నేనంటే చాలాయిష్టం. నాకు కావలసిన అన్నియేర్పాట్లూ ఆయన అతిశ్రద్ధగా చేసేవాడు. దానికికారణం ఆయనకు ఐంద్ర జాలికుడు ఒకడు అవసరంకావటమేగాక మాంత్రికుడికి ఆయనతో స్నేహంగా ఉండేదట! ఆసంగతి నాకు తరువాత తెలిసింది. రణ ధీరసింహుడు నా వివాహంచేశాడు. దానితో నేనొక గృహస్థు డనై చాలాకాలం అక్కడే పనిచేశాను. ఎన్నెన్నో అద్భు తాలుచేసి నా యజమాని మెప్పుపొందాను. దాదాపు శత్రు వులను నిశ్శేషంచేశాను. ఈవిధంగా నా గౌరవప్రతిష్ఠలు దిన దిన ప్రవర్ధమానాలు కావటంతోనే నాలో ఒకవిధమైన నిర్లక్ష్యంవచ్చింది. రణధీరసింహులకు 'దయారాం' అనే దాయాది ఉండేవాడు. అతని తల్లిదండ్రులు చిన్నప్పుడే చని పోయారు. అతడు నాకంటే చిన్నవాడు. మాయిద్దరికీ చాలా స్నేహం. సాధారణంగా అతడు మాయింట్లోనే రాత్రిపూట భోజనాలవీచేసి పడుకుండేవాడు.

"నేనుండే యిల్లు చాలా పెద్దది. అందమైందికూడా. పెరటిలో ఒక ఉద్యానవనమున్నది. ఆ ఉద్యానవనాన్ని

దతూరాం ప్రత్యేకించి పెంచాడు. సాధారణంగా సాయంకాలపు వేళల మే మిద్దరం ఆ తోటలో కూర్చుండే వారము.

"అవి జ్యేష్ఠమాసపురోజులు. విపరీతమైన ఎండలు కాస్తున్నాయి. ప్రొద్దుక్రుంకినా ఇంకా వేడిగానే ఉండేది. అందుచేత మేమిద్దరం ఆతోటలోనే మంచాలు వేసుకొని పడుకునేవారము. నాకొక మంచి కుక్క ఉన్నది. అదికూడా అక్కడే పడుకొని ఉండేది. ఒకరాత్రి మేమిద్దరం నిద్ర పోయాము. అర్ధరాత్రివేళ కుక్క మొరగటంచేత నేను లేచాను. ఏదో మొరిగిందిలెమ్మనుకొని అంతగా శ్రద్ధ తీసుకోకుండా మళ్ళీ కళ్ళుమూసుకొని పడుకొన్నాను. అప్పుడు కుక్క చాలాదూరంగా తోట చివరన ఉన్నది. అది పరుగెత్తుకుని వచ్చి నా మంచం దగ్గర మొరగటం ప్రారంభించింది. నేను లేచాను. కుక్క ఎగరొప్పుతోంది. ముందరికాళ్ళతో భూమిని గీరుతోంది. నాకు నా కుక్క అలవాటేమిటో తెలుసు. అందుచేత అనుమానంతో లేచాను. నా స్నేహితుడనుకూడా లేపుదామని అతని మంచం దగ్గరకు వెళ్ళాను. మంచంపైన అతడు లేడు. నాకు ఆశ్చర్యం కలిగింది. వెంటనే కత్తి తీసుకొన్నాను. నాకుక్క నన్ను తోట చివరిభాగంలోకి తీసుకు వెళ్ళింది. అలా వెళ్ళుతున్నప్పుడు కుక్కకు తగిలిన గాయం కూడా చూచాను. అది కుంటుతోంది. అక్కడ అంతా చీకటి. కుక్క ఒకచోట ఆగి తోక ఆడించటం ప్రారంభించింది. అప్పుడక్కడ చెట్లపొదలలోనుంచి ముగ్గురుమనుష్యులు ఉరుకులు పరుగులతో బయటికివచ్చి గోడదాటి పోవటం కనబడింది. వాళ్ళలో ఒకనిచేతిలో ఉన్న మూటజారి తోటలో

పడింది. అతడు తిరిగి రాలేదు. నేను వాళ్ళను వెంబడించా లని గోడను సమీపించాను. కుక్క నన్ను వెళ్ళనివకుండా ధోవతిపట్టుకొని పొదలోనికి తీసుకువెళ్ళింది. ఆ పొదలో ఎవరో ఉన్నట్లు నాకు అలికిడైంది. అతడూ గోడదాటి పారి పోతాడేమోఅనుకొన్నాను. నేను గోడను సమీపించి అతనిని పట్టుకోటానికి సిద్ధంగా వున్నాను. అప్పుడిద్దరు మనుష్యులు బయటికివచ్చి నాతో యుద్ధానికి దిగారు. వాళ్ళ దృష్టి అక్క డున్న మూటమీద ఉన్నది. దానిని తీసుకోవాలని వాళ్ళు పయత్నించటం గమనించాను. ఇంతలో మా మనుష్యులు దీపాలు పుచ్చుకొని రావటం కన్పించింది. నేను కొద్దిగా మైమరచి నా మనుష్యులవైపు చూచేసరికి నా నెత్తిన మోపైన దెబ్బ పడింది. నేను స్పృహతప్పి పడిపోయాను.

## 2

"నాకు తెలివి వచ్చేసరికి మా మనుష్యులు నన్ను చుట్టిఉండటం చూచాను. వాళ్ళ చేతులలో దీపాలున్నాయి. వాళ్ళు చెప్పిన మాటలనుబట్టి నేనొక అరగంటసేపుమాత్రమే తెలివి లేకుండా పడిఉన్నానని తెలిసింది. శత్రువు లేమయ్యా రని అడిగితే పారిపోయారని వారు చెప్పారు. ఐతే వాళ్లు నా మనుష్యు లక్కడికివచ్చి చేరుకోవటం చేత మూటను మాత్రం తీసుకొని వెళ్ళలేకపోయారు. దెబ్బలుతిన్న నేను అప్పుడు వాళ్ళను వెంబడించేశక్తిని కోల్పోయి ఉన్నాను. చేసేదేమీ లేక మూటను తీసుకొని నా యిల్లు చేరాను. మనస్సులో ఒక వైపున స్నేహితుడిని గురించిన ఆలోచన దుఃఖాన్ని కలి

గిస్తోంది. రకరకాల అనుమానాలు పెనుగొన్నాయి. తలుపులు వేసుకొని మూటను విప్పాను. అందులో రెండుజతల బట్టలున్నాయి. అవి విడిచిన బట్టలలాగా ఉన్నాయి. ఒక కాగితాలకట్ట దొరికింది. వాటిని చూడగానే అవి రణధీరసింహులని పెట్టెలోనివని గ్రహించాను. ఆ తర్వాత ఆ మూటలోనే బాగా గుడ్డలు చుట్టివున్న మైనంముద్ద కన్పించింది. దానిమీద రణధీరసింహులని మొహరు ముద్రించిఉన్నది. ఇంకా ముత్యాలహార మొకటీ, మూడుఉంగరాలూ, ఒక కంటె ఉన్నాయి. ఆ వస్తువులన్నీ నా మిత్రుడైన దయారాం సింహులనివి. నాతో కలిసి శయనించి ఉన్నప్పుడు అతడవన్నీ ధరించేఉన్నాడు. ఆ వస్తువులన్నీ చూచి నేను చాలాసేపు ఆలోచించాను. అప్పుడు కమల తల్లియైన నా భార్య నా వద్దకు వచ్చింది. ఆ రోజులలో ఆమె పిల్లతల్లి. శిశువు చంకలోనే ఉన్నది. ఆమె చాలా తెలివి కలది. అనేక సందర్భాలలో నాకు మంచిమంచి సలహాల నిస్తుండేది. ఆమెను చూస్తే నాకు ఆమె భయపడినట్లుగా కన్పించింది. ఆమెతో సంగతి సందర్భాలన్నీ చెప్పాను. స్నేహితుడిని వెదకటానికి బయలు దేరుతున్నానని కూడా అన్నాను. ఆమె నన్ను ముందుగా రణధీరసింహులను కలుసుకొమ్మని సలహా యిచ్చింది. ఆ ప్రకారం రణధీరసింహుల వద్దకు బయలుదేరాను. త్రోవలో శత్రుభయం లేకుండా ఉండటానికి ఇద్దరు సైనికులను వెంటబెట్టుకున్నాను కూడా. రణధీరసింహులు మంచి నిద్రలో ఉన్నారు. ఆయనను లేపాను. ఆయన లేవగానే నన్నుచూచి "ఏమిటిప్పుడు వచ్చావు! దయారాం క్షేమంగా ఉన్నాడా?" అని ప్రశ్నించాడు. నాముఖ

వైఖరి చూడగానే ఆయన దయారాంను గురించి ప్రశ్నించటం నా కాశ్చర్యం కలిగించింది. జరిగిన సంగతంతా ఆయనవద్ద కూర్చుండి చెప్పాను. ఆయన చాలా దుఃఖించాడు. ఒక్కగాను ఒక్క దాయాదినీ కూడా కోల్పోయానని విలపించాడు. శత్రువులనుగురించి నాటివరకూ నిశ్చింతగా ఉన్న ఆయన మనస్సులో జాగ్రత్త పడాలనే భావం కలిగింది. నేను రణధీరసింహులను ఓదార్చి తిరిగి ఇంటికి వచ్చాను. నా భార్యకు విషయాలన్నీ చెప్పి నా సహచరులను వెంటపెట్టుకొని ఆ క్షణమే యిల్లు వదలాను. నాటినుంచీ నా జీవితములో దుర్దశ ప్రారంభమైంది." ఆ తర్వాత భూతనాథుడు వినత వదనుడై మౌనం వహించాడు. అతడిని చూస్తే తరువాతకథ చెప్పలేని పరిస్థితిలో ఉన్నాడని అక్కడున్న వారందరికీ అర్థమైంది. ఆ సమయంలో ఇద్దరు మనుష్యులు ఆ గదిలోనికివచ్చి సురేంద్రసింహ మహారాజుకు నమస్కరించి నిలబడ్డారు. ఆ వ్యక్తులను చూచిన భూతనాథుడు భయకంపితుడై వణకిపోసాగాడు. వాళ్ళు భూతనాథునితో తమపేర్లు దిలీప్‌షా అని చెప్పిన వ్యక్తులే. ఇంద్రదేవుని ఆజ్ఞానుసారం ఆ వ్యక్తులిద్దరూ భూతనాథుని సమీపాన కూర్చున్నారు.

## 3

బహుశః పాఠకులు ఇద్దరు వ్యక్తులు భూతనాథునితో తమ నామధేయాలుదిలీప్‌షా అని చెప్పిన సంగతి మఱచిపోలేదనుకొంటాను. ఇప్పుడు మనం వాళ్ళిద్దరినీ ఒకటవ దిలీప్, రెండవ దిలీప్ అని వ్యవహరిద్దాం.

భూతనాథునికి తరువాత తన జీవితగాథ చెప్పాలావద్దా అనే అనుమానం కలిగింది. నూతనాగంతకులను చూచి అతడు మరీ నిశ్చేష్టుడైపోయాడు. అతనికి మాట్లాడే శక్తికూడా లేక పోయింది. ఇంద్రదేవుడు భూతనాథుణ్ణి "మౌనం దాల్చావెందు" కని ప్రశ్నించాడు. దానికి సమాధానంగా భూతనాథుడు తలవంచటం తప్ప ఏమీ చెయ్యలేదు. అప్పుడు మొదట దిలీప్ మహారాజుకు నమస్కరించి "మహాప్రభూ భూతనాథునికి తనసంగతి చెప్పటం చాలా కష్టంగా ఉన్నది. వాస్తవానికి అతని జీవిత చరిత్రకూడా అటువంటిదే. మంచి స్వభావంగల వ్యక్తి తన నేరాలను స్వయంగా ఏనాటికీ చెప్పలేడు. అనుమతిస్తే నేను భూతనాథుని వృత్తాంతాన్ని తెలియ చెప్పతాను. అతనికథ అతనికెంత వివరంగా తెలుసో నాకూ అంత బాగా తెలుసు. ఇంతవరకూ అతడు చెప్పింది నేను బయటఉండి విన్నాను. భూతనాథుడు మౌనందాల్చి క్షణం నుంచీ ఇకపై అతడు మాట్లాడలేడని గమనించి లోనికివచ్చాను. (భూతనాథుణ్ణి చూచి)

"భూతనాథా! నన్ను నీవు శత్రువుగా భావించవద్దు. నీ కప్పగించిన పనిని నేను అనాయాసంగా నెరవేర్చగలుగుతాను."

ఆ వ్యక్తులిద్దరినీ సభాస్థలిలో ఉన్న వారందరూ ఆశ్చర్యంగా చూస్తున్నారు. ఐతే వాళ్ళెవరో కొంతసేపు ఆగిన తర్వాత తెలుస్తుందనే ఉద్దేశంతో వివరాల జోలికి పోలేదు. మహారాజు కింకర్తవ్యతా మూఢుడై ఇంద్రజీతసింహుని వైపు చూచాడు. అతడేదో తాతగారికి చెప్పాడు. మొదటి దిలీప్‌షా

చెప్పినమాటలు విని ఇంద్రదేవుడు మహారాజుతో "మహా రాజా! ఇతడు చెప్పినదంతా నిజమే. భూతనాథుని వృత్తాంతాన్ని ఇతని నోటినుంచీ విన్నా అభ్యంతరం లేదు." అన్నాడు. దానిమీదట మహారాజు అనుమతి సూచకంగా శిరఃకంపం చేశాడు. అప్పుడు ఇంద్రదేవుడు భూతనాథుణ్ణి "నీకేమైన అభ్యంతరం ఉన్నదా?" అని అడిగాడు.

భూత :- ప్రభువులవారు ఎలా యిష్టపడితే అలాగే కానివ్వండి! వ్యతిరేకించే శక్తి నాకులేదు. క్షమాభిక్ష పొందిన తర్వాతకూడా నేనటువంటిరోజులు చూస్తాననుకోలేదు. ఏది ఏమైనా నా రహస్యాలు ఇక దాగబోవని నాకు తెలుసు. ఐనా నేనుచేసిన తప్పులను నా నోటితోనే చెప్పటానికి నా కెందుకో సిగ్గుగావున్నది. హృదయాన్ని దిట్టపరచుకొని దిలీప్‌షా చెప్పే మాటలను వింటాను. ఈ మహానుభావుడు ఇంకా ఏమైన కల్పించి చెబుతాడో ఏమో చూస్తాను.

మొదటి దిలీప్ "అబ్బెబ్బే! ఏమైనా సరే! అబద్ధాలు చెప్పను. నీవు నిశ్చింతగా ఉండు ప్రారంభిస్తున్నాను.

"మహారాజా! మాయాజాలంలో భూతనాథుడు అగ్రశ్రేణికి చెందినవాడనటంలో సందేహంలేదు. అతడు తన తెలివితేటలను నిరర్థకం చేశాడు. లేకపోతే అతడీనాడు ప్రపంచంలో ఏలాటి గౌరవ ప్రతిష్ఠలను సంపాదించేవాడో చెప్ప నలవికాదు. నన్ను చూచి యితడు భయపడుతున్నాడు. అలా భయపటటానికికూడా మంచి కారణమే ఉన్నది. ఐతే నేనిప్పుడు ఇతనిపట్ల అపకారం చెయ్యదలంచలేదు. అలా చెయ్యనని యువరాజువద్ద ప్రతిజ్ఞ చేశాను. యువరాజుగారు

మాకు చేసిన సహాయాన్ని తలచుకొంటే ప్రతిజ్ఞాభంగానికి నేనేమాత్రం ప్రయత్నించలేను. భూతనాథా! నిజానికి నేను దిలీప్‌ను. ఆనాడు నీవు నన్ను గుర్తించలేక పోవడంలో నీ తప్పేమీలేదు. సంవత్సరాల తరబడి కారాగారంలో మగ్గిపోయిన నా రూపురేఖలు అలా నిన్ను గుర్తించ లేకుండా చేశాయి. నీవు నన్ను చంపివేసినట్లనుకొన్నావు. నన్నెప్పటికీ కలుసుకోలేననుకొన్నావు. ఐనా ఆ దేవుని దయవల్ల సజీవంగానే యివ్వేళ నీ కళ్లెదుట నిలబడగలిగాను. నేను ఖైదీగా లేకున్నట్లయితే నీమీద తప్పకుండా పగ సాధించుకొనేవాడినే. నీరోజులు బాగుండి నేను ఖైదులో చిక్కిపోయాను. చెఱనుండి బయటికి రావటంకూడా నిన్ను అభిమానించే యువరాజుగారి కృపవల్లనే. ఇంద్రదేవుణ్ణిగురించి నీవేమీ అపోహపడవద్దు. అతను ఇదంతా చెయ్యటం నిన్ను దుఃఖ పెట్టాలనికాదు. నీ వ్యవహారమందరికీ తెలుసు. అయినా తెలియనట్లుగానే ఎవరికివారు మౌనం దాల్చటంవల్ల, నీ జీవితంలో శాంతిఅనేది లేకపోవటంవల్ల క్షణమొక యుగంగా గడపవలసి వస్తుందని భావించి నీ చిత్తశాంతికోసం నీ జీవిత వృత్తాంతాన్ని బహిరంగ పరచటం జరుగుతోంది. ఇవ్వేళ నీ శత్రువులు మిత్రులైనారు. నీ శత్రువులకుకూడా వాళ్ళ రహస్యాలు బట్టబయలైపోవటంచేత నీతో మైత్రినికోరుతున్నారు. లేకపోతే నీవింకావాళ్ళను సాధిద్దామనే ప్రయత్నిస్తుంటావు. వాళ్ళు నీవేమీ చెయ్యవులే అని నిశ్చింతగా వుంటారు. అలాజరగకుండా ఉండటానికే ఈప్రయత్నమంతా. (జీతసింహుడిని చూచి) ఇక నేను భూతనాథుని వృత్తాంతాన్ని చెబుతాను.

"దయారాం అదృశ్యుడైన రోజుల్లోనే కాశీపట్టణంలో నాగర్ ప్రసిద్ధ వేశ్యగా ఉండేది. ఆమె సౌందర్యం చాలామంది పురుషులను ఉన్మత్తులను చేసింది. మనోరమకూడా ఆ వృత్తిలోనే ఉన్నది. ఐతే మనోరమ నాగర్ వంటి అందకత్తె కాదు. కాని చాలా తెలివికలది. డబ్బుకూడా బాగానే గడించింది. చాలామంది మోస్తరుగానే భూతనాథుడూ, దయారాం నాగర్‌ను ప్రేమించారు. భూతనాథునికి తాను గొప్ప ఇంద్రజాలికుడననే గర్వమున్నది. నాగర్‌కుకూడా తాను చాలా తెలివైనదాననననే నమ్మకమున్నది. భూతనాథుడు నాగర్‌ను వశపఱచుకోవాలనుకొన్నాడు. ఆమెకూడా ఈ పురుషుల నిద్దరినీ వశంచేసుకొని వాళ్ళ సంపదను దోచుకోవాలని కూర్చున్నది.

దయారాంను వెదకటానికి బయలుదేఱిన భూతనాథుడు తిన్నగా కాశీమార్గం పట్టాడు. అతిత్వరిగానే నాగర్ ఇల్లు చేరాడు. అమె భూతనాథుణ్ణి గౌరవించి వచ్చిన కారణం అడిగింది. భూతనాథుడు తాను వచ్చిన పని చెప్పలేదు. నాగర్ అతనిని అనుమానించింది. భూతనాథుడుకూడా దయారాం కనిపించకుండా పోవటంలో నాగర్‌పాత్ర ఉన్నదని తెలుసుకొన్నాడు. ఒకవేళ నాగర్ ఆ పని చేయించకపోయినా దయారాంను దొంగిలించిన వ్యక్తులైనా నాగర్‌కు తెలిసిఉంటారనుకొన్నాడు. మొత్తానికి భూతనాథునికి కాశీనగరంమీదనే అనుమానమున్నది. అందుచేత అతడు అక్కడే మకాంవేసి దయారాంను అన్వేషించటం ఆరంభించాడు. రోజులు గడచినకొద్దీ నాగర్‌పై అనుమానం హెచ్చింది. ఆరోజులలోనే భూత-

నాథుడు కాశీలో ఒక స్త్రీని పెండ్లాడాడనీ ఆమెకే నానక్ పుట్టాడనీ వార్తలు పొక్కాయి.

"వేశ్యావృత్తిలో ఉన్నవాళ్ళు కేవలం డబ్బుమాత్రమే కోరుతారు. నాగర్‌ను మోహించిన దయారాం ఎంత డబ్బిస్తున్నప్పటికీ అతణ్ని చంపి మొత్తం ధనం కాజేయాలని నాగర్ చూచింది. ఆమె దయారాంను వెదకటానికి భూతనాథుడు కాశీ వచ్చాడని పసికట్టింది. అందుచేత నాగర్ కాశీ వదలి జమానియా చేరుకొంది. భూతనాథుడుకూడా జమానియాలో మకాం వేశాడు. ఈ పరిశోధనలో చాలా యేండ్లు గడిచాయి. కాని దయారాం జాడ తెలియలేదు. భూతనాథుడు తన స్నేహితుడైన ఇంద్రదేవుని సహాయం కోరాడు. అతడూ సహాయం చేశాడుగాని లాభంలేకపోయింది. ఇంద్రదేవుడు చెప్పటంవల్ల నేనూ భూతనాథునికి సహాయపడ్డాను. ఈ సందర్భంలోనే రణధీరసింహునియొక్క బంధువులనుగురించి జమానియా రాజగృహం మొదలైనవానినిగూర్చికూడా చాలా చెప్పవలసి ఉన్నది. కాని వాటి నన్నిటినీ విడిచిపెట్టి కేవలం భూతనాథుని కథమాత్రమే చెబుతాను.

"భూతనాథుని అదృష్టంలో ఏదో లోపం ఉండటంవల్ల మేము చేసే సహాయాలన్నీ నిరర్థకాలవుతూ వచ్చాయి. ఒకనాడు భూతనాథుణ్ణి కలుసుకొనటానికి అతనియింటికి వెళ్ళాను. అతడెందుచేతనో హఠాత్తుగా నాతో 'చూడు దిల్‌ప్‌షా నిన్ను చాలామంచివాడనుకొన్నాను. కాని నీవు చాలామోసగాడవు. దయారాంను గురించి నీకు తెలుసుననీ నీవే శత్రువులకు సహాయపడుతున్నావనీ తెలిసింది. దయారాం ఇప్పు డెక్కడున్నాడో

నీకు తెలుసు. అతనిసంగతి యిప్పుడు చెపుతావా లేకపోతే నీ ప్రాణం తియ్యమంటావా?' అన్నాడు. నాకప్పుడు చాలాకోప మొచ్చింది. నేను ఇక క్షణంకూడా ఆగకుండా అక్కడనుంచి వచ్చేవేశాను. తిన్నగా ఇంద్రదేవుణ్ణి కలుసుకొన్నాను. జరిగిందంతా చెప్పాను. యింద్రదేవుడుకూడా చాలాబాధ పడ్డాడు. నాతో 'భూతనాథుడు ఇలా ఎందుకుమారిఉంటాడు? ఎవరో భూతనాథునికి నీమీద అనుమానం కలిగించిఉంటారు. చివరకతణ్ణే పశ్చాత్తాపపడవలసివస్తుంది. నీవు భూతనాథుణ్ణి కలుసుకోకుండానే దయారాం జాడతియ్యి. నాకూ రణధీర సింహునికీ చాలా మేలుచేసినవాడవౌతావు' అన్నాడు. మొత్తం మీద ఇంద్రదేవుడు నాకోపాన్ని చల్లార్చాడు. రెండుమూడు రోజులతర్వాత నేను తిరిగి ప్రయాణమయ్యాను. అప్పుడు ఇంద్రదేవుని సహోదరుడొకడువచ్చి 'ఇవ్వేళరాత్రి పన్నెండు గంటలకు మీర్జాపూర్ జమీందారైన రాజసింహుని ఇంటికి దయారాం వస్తాడు. ఈసంగతి మా తమ్ముడు చెప్పాడు. నాగో కూడా యిప్పుడు అక్కడే ఉంటుందట' అన్నాడు. ఇంద్రదేవుడు "మీతమ్ముడే తిన్నగా నాదగ్గరికెందుకురాలేదు?' అని అడిగాడు. అప్పుడు యింద్రదేవుని సహోదరుడు "అతడు మీదగ్గరికే రావాలని వస్తున్నాడు. త్రోవలో నాకు కలిసినప్పుడు నేనతనితో దయారాంను వెదకటానికి వెళ్ళుతున్నానని చెప్పాను. అతడు 'దయారాం సంగతి తెలిసింది. ఆసంగతి యింద్రదేవునితో చెప్పటానికి వెళ్ళుతున్నాను. నీవు ఎట్లాగో కలిసికొన్నావు గనుక నేను వెళ్ళనవసరంలేకుండానే యింద్రదేవు

నితో ఈవిషయం చెప్పు. ఆయన ఏం చెయ్యమంటాడో ఆ ప్రకారం చెయ్యటానికి నీవు వచ్చి నన్ను కలిసికో! నే నిప్పుడు అక్కడికి వెళతాను. అక్కడ ఎవరూ లేకపోతే దయారాంను యింకెక్కడికైనా తీసుకుపోవచ్చు' అన్నా"నని చెప్పాడు. ఇంద్రదేవుడన్నాడు 'సరే ఐతే మంచిపనే జరిగింది.' అన్నాడు. అతని అనుయాయి భూతనాథునికికూడా ఈ సంగతి చెప్తానంటే యింద్రదేవుడు వద్దన్నాడు. యింద్రదేవుడు తన సహచరుడు వెళ్ళినతరువాత నన్ను మీర్జాపూర్ వెళ్ళవలసిందని కోరాడు. నేను భూతనాథునికి సహాయం చెయ్యటానికి యిష్టపడలేదు. కాని యింద్రదేవుడు ఎలాగో నన్ను ఒప్పించాడు. నేను యింద్రదేవుని వర్తమానం తెచ్చిన శంభుని వెంటపెట్టుకొని మీర్జాపురానికి బయలుదేరాను. మరునాటికి మీర్జాపురానికి వెళ్ళి శంభుని సోదరుణ్ణి కలుసుకొన్నాను. దయారాం మీర్జాపూర్‌లోనే ఉన్నాడని తెలిసింది. అక్కడ మేము వేషాలు మార్చుకున్నాం. ఎన్నెన్నో అవస్థలుపడి చివరకు ఎలాగైతేనేం దయారాంనూ రాజసింహుణ్ణి తీసుకొనివచ్చాం. ఐతే భూతనాథుడు మేముచేసిన కృషినంతటినీ నిష్ప్రయోజనంచేశాడు. అనవసరంగా అప్రతిష్ఠపాలయాడు. 'దయారాం చాలా బలహీనంగా ఉన్నాడు. అతనికి కొంతవిశ్రాంతి అవసరము'నిమేము అతనిని వెంటనే యింద్రదేవునివద్దకు తీసుకువెళ్ళలేదు. అతన్ని ఒకచోట పరుండబెట్టి ఆయుధాలు వేషాలువిప్పి రాజసింహునికి స్పృహ తెప్పించాము. అతడు మా మీదకు ఎదురు తిరుగుతాడని మేము అనుకోలేదు.

"అది రాత్రి సమయం. ఆ యింటి మూడవ అంతస్తులో మేము కూర్చుండి ఉన్నాము. దీపం సన్నగా వెలుగుతోంది. మా వెనుక దయారాం మంచం ఉన్నది. రాజసింహుడు లేచి మమ్ములను ఆశ్చర్యంగా చూడసాగాడు. ఆ సమయంలో నే భూతనాథుడు మరి యిద్దరిని వెంటబెట్టుకొని మా దగ్గఱకు వచ్చాడు. భూతనాథుడు నన్ను చూడగానే 'ఏమిరా ధూర్తుడా! చివరకు నేను చెప్పిందే నిజమైంది చూచావా! రాజసింహునితో చేతులుకలిపి నాతో విరోధం తలపెట్టావా? చూడు నిన్నేంచేస్తానో" అని నామీదకు కత్తితో దూకాడు. నేనూ, అతనితో పోట్లాటకుదిగాను. భూతనాథుడు రాజసింహుణ్ణి చంపివేశాడు. నాకూ బాగా దెబ్బలు తగిలాయి. నేను పడి పోయాను. అప్పుడు దయారాం మంచంమీద పండుకొని ఉండి అన్నీ చూస్తున్నాడు. అతడూ ఉండబట్టలేక భూత నాథుణ్ణి ఎదుర్కోటానికి వచ్చాడు. భూతనాథుడు అతని వక్షస్థలాన ఖడ్గం దించివేశాడు. దయారాం నేలమీద పడి పోయాడు.

## 4

"భూతనాథుడు అలా ఎందుకు చేశాడో నాకేం తెలియదు. దయారాం పడిపోగానే నేను కెవ్వున కేకవేసి భూతనాథునితో 'ఏరా మూర్ఖుడా! ఎంతో కష్టపడి తెచ్చిన దయారాంను చంపివేశావు కదరా!' అన్నాను. ఆ మాటలు విని భూతనాథుడు నిశ్చేష్టుడై పోయాడు. అతని అనుయాయు లిద్దరూ పారిపోయారు. భూతనాథుడు దయారాం చెంత

కూర్చుండి అతనిముఖం చూడసాగాడు. అప్పుడే దయారాం చివరి శ్వాసకూడా విడిచాడు. భూతనాథుడు చాలాసేపటి వరకూ ఆ శవంమీదపడి యేడ్చాడు. భూతనాథుని అను చరులు పారిపోవటం, మాకు కొద్దిగా లేచేశక్తి యేర్పడటం తటస్థించటంవల్ల ఒంటరిగాఉన్న భూతనాథునిపై మళ్ళా మే ముగ్గురం లేచి పడ్డాం. భూతనాథుణ్ని శవం మీదనుంచి ఇవ తలకు లాగి ఎందుకోయ్ నీ దొంగ యేడుపు? అంత ప్రేమ ఉన్నవాడవు ఎందుకు పొడిచావు? పొడిచి యింకా ఆడ దానిలాగా ఏడుస్తావేం?" అన్నాను.

భూత :- నేనేమైనా తెలిసి చంపానా? అన్నాడు.

నేను :- అలాగే ఇక్కడికి రాగానే అతణ్ణి మంచం మీద పడివుంటం చూడలా.

భూత :- చూచాను. కాని అతడు దయారాం అని నాకేం తెలుసు. అంతలావుగా వుండేవాడు ఇంత సన్నపడి పోతాడని నేనేమైనా కలగన్నానా?

నేను :- బలేవాడివే. రణధీరసింహుడుగాని దీనిసంగతి చెప్పకు. మగతనంవుంటే మమ్మల్ని ఎదుర్కో!

భూత :- నాకిప్పుడు పోట్లాడాలని లేదు. ఎవనికోసం నేను కత్తిపెుత్తానో అతడే లేనినాడు నా కెందు కిదంతా? దయారాం నీతోనే ఉన్నాడని తెలిసింది. కళ్ళారా చూచాను కూడా. కాని అనవసరంగా నీమూలాననే మరణించాడు. ఈ పాపమంతా నీది.

"నీవు ఎన్నివిధాల నానెత్తికి ఈ నేరాన్ని చుట్టదలచినా నీవుమాత్రం తప్పించుకుపోలేవు. దయారాంను వెదకి పట్టుకొని

రావటంలో నాకు ఇంద్రదేవుని ఆజ్ఞ ఉన్నది. యిందులో నా గొప్పతనమేమీ లేదు. అవసరమైనప్పుడు నేనీవిషయం ఇంద్ర దేవునియొద్ద ఋజువుచేస్తాను. నీవూ నీ నిర్దోషిత్వాన్ని నిరూపించుకోటానికి నాగరునుప్రవేశపెట్టుదువుగాని. దానిమాటలు వినే నీవు నాపై శత్రుత్వాన్ని తలపెట్టావు.' అన్నాను.

"భూతనాథుడు స్తబ్ధుడైపోయాడు. అతడు నావంక తిరిగిచూచి 'అవునవును! నన్ను నిజంగానే ఆ పాపాత్మురాలు మోసంచేసింది. ఇక నేనూ ఇతనితో పాటే చావటం మంచిది' అని కత్తితీసుకొని పొడుచుకోబోయాడు. కాని అతడు చావ లేక పోయాడు. మహాప్రభూ! వీరులైనవారికి తమ ప్రాణాలు అంత లెక్కలోనివి కావుగదా! ప్రాణాలపై తీపిగలవాడు ఈ ప్రపంచంలో ఏమీ చెయ్యలేడు. ఎవడు మృత్యువును అర చేతిలో పెట్టుకొని సాహసికుడై ప్రవర్తిస్తాడో అతడేదైనా సాధించగలడు. భూతనాథుడు మహావీరుడు. కాని అతనికి ప్రాణాలమీద చాలా మమకారం ఉన్నది. దానికి కారణం అతని మోహావేశమే. మోహావేశుడైన మానవుడు యెన్ని అయినా తప్పులుచేస్తాడు. అతనిద్వారా సత్కార్యం జరగదు. అందుచేతనే భూతనాథుడు తనను తాను చంపుకోలేకపోయాడు. నాతో 'నాకింకా బ్రతికిఉండాలని ఉన్నది. దానికి కారణం ఏమంటే శత్రువులు చుట్టిముట్టి ఉన్న రణధీరసింహులను కాపాడే బాధ్యత నాకున్నది. కనుక నీవు నన్ను క్షమించి రెండు సంవత్సరాలపాటు ప్రాణాలతో ఉండేటట్లు చెయ్యి!' అన్నాడు.

"నేను 'కేవలం రెండేండ్లే కాదు. నిన్ను జీవితపర్యంతం విడిచివేస్తున్నాను. నామీద ఎదురుతిరగనవ్వుడు నాకు నిన్ను చంపవలసిన అవసరంకూడా లేదు. పోగా నామీద నీవు తల పెట్టిన శత్రుత్వానికి ప్రతిఫలాన్ని నీవే ఒకనాటికి అనుభవిస్తావు. ఆ అనుభవం భూతనాధుడు నిరపరాధియైన దయారాంను చంపాడని లోకమంతా అనుకున్నప్పుడే నీకు తెలిసివస్తుంది' అన్నాను.

భూత:- నేను కోరేది నన్ను నీవు ఆ అపవాదునుంచి రక్షించాలనే.

నేను:- నావల్ల ఏమౌతుంది?

భూత:- నీవు తలచుకుంటే తప్పకుండా ఔతుంది.

"ఇలా చెబుతూ భూతనాధుడు నాకాళ్ళమీదపడ్డాడు. ఎలాగైనా రక్షించమని ప్రార్ధించాడు. నేను చేసేదిలేక అలాగే నని చెప్పి నా సహచరులతో ఇవతలికి వచ్చాను. ఆ తరువాత భూతనాధుడు ఆ శవాల నేంచేశాడో నాకు తెలియదు."

భూతనాధుని వృత్తాంతాన్ని ఇంతవరకూ చెబుతూ వచ్చి దిలీప్‌షా యిక్కడ ఆగిపోయాడు. భూతనాధునివంక దృష్టిని మరల్చాము. అతని కంటివెంట కన్నీరు ప్రవహిస్తున్నది. వెక్కి వెక్కి ఏడుస్తున్నాడుకూడా. అతి కష్టంమీద భూతనాధుడు కన్నీరు ఒత్తుకొని మాట్లాడసాగాడు. "అవును. దిలీప్‌షా చెప్పినదంతా వాస్తవమే ప్రమాణపూర్వకంగా నేను దయారాంని చంపాలని చంపలేదు. రామసింహుడు అక్కడ ఉండటంచూచి నాకేమీ తెలియకుండా పోయింది. మంచం మీదవున్న వ్యక్తికూడా దిలీప్‌షా అనుయాయి అనే అను

కొన్నాను. నా కవ్వుడు దిలీప్‌షా దయారాంను దొంగిలించిన వారితో చేతులు కలిపాడనే అనుమానం గట్టిగా ఉన్నది. దిలీప్‌షాయే దయారాంను అక్కడికి తెచ్చి బంధించాడను కొన్నాను. అదైనా చచ్చిపోయిం తర్వాత దయారాంను నేను గుర్తించినప్పుడే మొదట నాకు నాసర్ మీద అనుమానం వున్నది. కాని అది నన్ను వలలో వేసుకొని నాకు దిలీప్‌షా మీద అనుమానం కలిగేటట్లు చేసింది. అందుకే నేను దిలీప్‌షా మీద శత్రుత్వం తలపెట్టాను. ఐతే దయారాంను నేను చంపిన సంగతి దిలీప్‌షా దాచివుంచుతానని చెప్పినప్పటికీ అతడు నన్ను అంత తేలికగా విడిచిపెట్టలేదు. అతడు నన్ను తమపూ పత్రం ఒకటి వ్రాసియిస్తేనే అరహాస్యాన్ని దాస్తానని చెప్పాడు. నేనావిధంగా వ్రాసియిచ్చి శాశ్వతంగా దిలీప్‌షాచేతిలో చిక్కుకొని పోయాను.”

దిలీప్ షా :- అవును! ఆ విధంగా చెయ్యకపోతే ఇతడే కొన్నాళ్ళతర్వాత నేనే దయారాంను చంపానని ప్రచారం చేస్తే నేనేం చేయగలను? తర్వాత ఇంకా కొన్ని సంగతులు చెబుతాను. ఆ సంగతులు మా యిద్దరికీ తప్ప ఇతరుల కెవ్వరికీ తెలియవు. అక్కడనుంచీ నేను ఇంద్రదేవుని వద్దకు వెళ్ళాను. క్రోధ పొడుగునా నాకు నేనేం చెయ్యాలా అనే ఆలోచనే పట్టుకొన్నది. ఎలాగైనా భూతనాథునికిచేసిన వాగ్దాన ప్రకారం ఇంద్రదేవునికికూడా ఈ సంగతి చెప్పకూడ దనుకొన్నాను. ఇంద్రదేవుడు నన్నుమళ్ళీ చూడగానే దయారాం సంగతి అడిగాడు. నేను ‘రాజసింహుని యింట్లో దయారాం ఉండటమైతేఉన్నాడు. గాని అతణ్ణి ఒకను హత్యా

చెయ్యటం జరిగింద'ని చెప్పాను. ఇంద్రదేవుడు ఆశ్చర్యపోయాడు. నేనప్పుడు ఇంద్రదేవునితో 'ఈసంగతి భూతనాథునికికూడా తెలుసు. మాకంటే ముందుగానే భూతనాథుడు రాజసింహుని యింటికి చేరుకొన్నాడు. అతడూ రాజసింహుని చేత నిహతుడైన దయారాంను చూచాడు. ఆ వెంటనే రాజసింహుని తలను భూతనాథుడు నరికివేశాడు. అంతకుమించి అతడుమాత్రం ఏం చెయ్యగలుగుతాడు. ఆ తరువాత మేము వెళ్ళి ఆ రెండు శవాలనూ భూతనాథుణ్ణి చూచాము. అయ్యో! పాపం! అని తిరిగి వచ్చివేశాం!' అని చెప్పాను. భూతనాథుని నేరాన్ని దాచటానికి నేను అతని యిష్టప్రకారమే ప్రయత్నం చేశాను. భూతనాథుడుకూడా దయారాం మరణాన్నిగురించి యీ విధంగానె ప్రచారంచేశాడు.

అప్పుడు తేజసింహుడు దిలీప్‌షాతో "భూతనాథునికి వాగ్దానం చేశావుగనుక అతడు చేసిన నేరాన్ని దాచావు. బాగానే వున్నది. కాని ఇంద్రదేవుని అనుయాయులైన శంభుడూ అతని సోదరుడూ యజమానికెందుకు చెప్పకుండా ఉన్నారు."

దిలీప్‌షా:- మీారనేదీ నిజమే! కానీ డబ్బు ఏ పనైనా చేయిస్తుంది. అందుచేతే వాళ్ళ నోళ్ళుకూడా మూతపడి పోయాయి.

తేజ :- అలాగా! అయితే ఇంకా భూతనాథుని కథ చెప్పేదేమైనా ఉన్నదా?

దిలీప్‌షా :- ఇంకా చాలా ఉన్నది. భూతనాథుడు దీనికంటేకూడా మరొక గొప్ప నేరంచేశాడు.

తేజః-ఏమిటది?

దిలీప్:- చాలాసంవత్సరాల వరకూ నేను భూతనాథుణ్ణి గురించి నిశ్చింతుణ్ణయి ఉన్నాను. కాని అతడు నన్ను గురించి నిశ్చింతగా లేడని తెలిసింది. అదను చూచి శాశ్వతంగా, నన్ను లోకంనుండి సాగనంపాలనే ప్రయత్నంలో ఉన్నాడు. అందు చేత నేను అతిజాగ్రత్తగా నన్ను సంరక్షించుకొనే ప్రయత్నంలో నిమగ్నుణ్ణయ్యాను. (భూతనాథుని చూచి) 'భూతనాథ్! ఒకసారి నీవు నన్ను బంధించి ఒక విచిత్ర పర్వతం మాటుకు తీసికొని వెళ్ళావు. గుర్తున్నదా? అప్పుడు నీవు మాటల సందర్భంలో దిలీప్‌షా అన్న వ్యక్తి ఆకారమైనా నేను చూడలేదన్నావు. ఇప్పుడుకూడా...'

భూత:- ఇంత జరిగినప్పుడుకూడా ఇంకా దిలీప్‌షాను ఎరుగనని నేనెట్లా చెప్పుతాను. ఆనాడు నీ వెవరవో గుర్తించక నిన్ను మోసం చేద్దామని అలా మాట్లాడాను. నీవు దిలీప్‌షావు కాకపోతే ఏదైనా మాట్లాడతావేమో రహస్యాలు తెలుసుకోవచ్చుననుకున్నాను. సరే అయిందేదో అయింది. ఇప్పుడు నీవు నిజంగానే ఆ కథంతా చెప్పదలచుకొన్నావా?

దిలీప్:- తప్పకుండా చెపుతాను.

భూత:- కాని ఆ సంఘటననుగూర్చి చెప్పటంవల్ల ఎవరికీ లాభముండదు సరిగదా, చివరకు నేర్చుకొనేదికూడా యేమీ వుండదు. కనుక విరమించటం మంచిది.

దిలీప్:- అబ్బే! ఆ సంఘటననుగూర్చి తెలియజెప్పటం చాలా అవుసరంగా కనిపిస్తోంది. అంతేగాక నీ భార్య ప్రత్యేకించి ఆ విషయమే వినటానికి వచ్చిందని నీకు తెలయదా?

భూత:- సరే కానీ, నా నోసట ఎలా వ్రాసిఉంటే అలా జరగకుండా ఉంటుందా? చెప్పు?

ఇంద్రదేవుడు:- భూతనాథ్! ఈ విషయంలో దిలీప్‌షా కట్టుకథలల్లి యేదైనా చెప్తాడనే అనుమానమున్నా-లేక ఆ విషయం శ్రోతల మనస్సుమీద నిన్నుగురించి చెడ్డగా పని చేస్తుందనుకొన్నా, దానికథ వదిలివేద్దాం. అంతగా అయితే ఈ పెట్టెలో పెట్టిఉన్న నీ జీవితకథను-అదీ నీ చేత్తోనే వ్రాసింది గనుక ఎవరిచేతికైనా ఇచ్చి చదివిద్దాం.

ఇలా చెప్పి ఇంద్రదేవుడు భూతనాథునికి దర్శనమాత్రాననే భయకారణమవుతున్న పెట్టెను తీశాడు.

ఆ పెట్టెనుచూచి భూతనాథుడు కంగారుపడి చివరకు ఎలాగో నిలద్రొక్కుకొని ఇంద్రదేవునితో—

"చూడండి! ఆ పెట్టెను దయచేసి నాకిచ్చివేయండి. అందులో నా వస్తువు లున్నాయిగనుక దానిని తీసుకొనే అధికారం నాకుఉన్నది. ఒకవేళ మీరు ఆ పెట్టెను నా కివ్వనని వ్యతిరేకిస్తే దేవీసింహుడైనా ఆ బాధ్యతను స్వీకరించకతప్పదు. ఎందుచేతనంటే అతనొకప్పుడు ఈ పెట్టెను ఎవరూ తెలియకుండా నా చేతి కందిస్తానని వాగ్దానం చేశాడు. అతనివాగ్దానం వృధాకాదని భావిస్తాకూడా." అని దేవీసింహునివైపు చూచాడు.

దేవీ:- మహారాజా 'నిజంగా నే నాలాటి వాగ్దానం లోగడ చేసే ఉన్నాను.

మహా:- అలాగైతే నీప్రతిజ్ఞాభంగాన్ని కావించటం మా కేమాత్రం యిష్టంలేదు. నీవు నీవాగ్దానాన్ని నెరవేర్చుకో వచ్చు.

ఆమాటలువిని చేపసింహుడు వెంటనేలేచి యింద్ర దేవుని సహాపానగలపెట్టెను చేతితోపుచ్చుకొని భూతనాథుని వద్దకు వచ్చాడు. "ఇదిగో! నాప్రతిజ్ఞాపాలన నెరవేరింది. ఈ విధంగా మన ఉభయుల గౌరవాలను నిలబెట్టిన మహారాజులుం గారికి జోహారులర్పిద్దాం" అని పెట్టెను భూతనాథునిచేతి కిచ్చాడు.

భూతనాథుడు మహారాజుకు చేయెత్తి నమస్కరిస్తూ "మీదయవల్ల నేను పునరుజ్జీవితుడనైనాను" అన్నాడు.

తేజ:- భూతనాథా! ఈపెట్టె ఇంతవరకూ తెరవలేదు అలా తెరవక పోవటానికి ఇదంత తేలికగా రాకపోవడం కూడా కారణమే.

భూత:- అవును. నేనుతప్ప దీని నెవరూ పగులగొట్టకుండా తెరవలేరు. ఈపెట్టెనిండా నానేరాలు నిండిఉన్నాయి. ఒక మోస్తరుగా దీనిని నా రహస్యాల కోశాగారం అనవచ్చు. దానాపుగా దీనిలోని అన్ని రహస్యాలూ బయటపడ్డాయి. యిప్పుడింకా బయటపడుతున్నాయి. పోనుపోను బయట పడొచ్చుకూడా. అయినా యింతవరకూ ఈ పెట్టె యథా తథంగానే బంధించిఉండటంచూచి నాకు తిరిగి ప్రాణంపోసి నట్లయింది. అందుకు మహారాజుకు నా మనఃపూర్వకాభివంద నాలు అర్పిస్తున్నాను. యిప్పుడు నేను మనసారా ఏవిధమైన సంశయాలకు లోనుగాకుండా నా జీవితచరిత్ర చెప్పటానికి

సంసిద్ధుడనయ్యాను. నానోటినుండివచ్చే ప్రత్యుత్తరంలోనూ ఏవిధమైన కల్పనా ఉండదు.

భూతనాథుడు ఇలా చెప్పి ఆ పెట్టెను తన మాయా జాలం సంచిలో వేసుకొన్నాడు. తిరిగి మహారాజుకు చేతులెత్తి నమస్కరిస్తూ "మహారాజా! నాజీవితగాథను సంకోచంలేకుండా చెబుతున్నాను. అది చాలా విస్తృతమైంది. అనేక భయంకర సంఘటనలతోనూ విషాద సన్నివేశాలతోనూ నిండినట్టిది. నా అపరాధాలను క్షమించిన ప్రియమిత్రుడైన ఇంద్రదేవుడు నా జీవితగాథవల్ల ప్రజానీకానికి ఉపకారం జరుగుతుందంటు న్నాడు. అందులో వాస్తవం లేకపోలేదు. ఐతే అనేక కారణాల వల్ల మహారాజుగారిని ఒక నెలరోజులపాటు నాకు వ్యవధి యిప్పించవలసినదిగా కోరుతున్నాను. ఈ మధ్యకాలంలో నేను నా జీవితంయొక్క సంపూర్ణ కథను గ్రంథరూపంలో తయారు జేసి ప్రభువులకు నివేదిస్తాను. బహుశః ఆ గ్రంథాన్ని మహా రాజు కనుక చదివితే స్మృతిచిహ్నంగా దానిని భద్రపరుస్తా రనడంలో ఏలాటి సందేహంలేదు. ఈ నెలరోజులకాలంలో నా కనేక విషయాలు గుర్తుకు తెచ్చుకొని వ్రాయటానికి వీలు కలుగుతుంది. అంతేకాక చనిపోయిందనుకున్న నాభార్య ఇవ్వేళ సాక్షాత్కరించింది గనుక ఆ నిరపరాధిని కలుసుకొని నే నెన్నో విషయాలు మాట్లాడవలసి ఉంది. ఈ అన్నిటికీమించి యింతవరకూ నేను శత్రువులుగా భావిస్తున్న చాలామంది ఇవ్వేళ రాజుగారి కృపవల్ల నాకు మిత్రులయ్యారు. వాళ్ళతో ఎన్నో విషయాలు మాట్లాడుకోవలసినపని ఉన్నది. ఇన్నిటివల్ల

నాజీవితకథ సర్వసమృద్ధంగానూ సమగ్రంగానూ తయారవు తుంది.

మహా:- ఏం పరవాలేదు. నీవు చెప్పినట్లుగా చెయ్యి. ఈలోగా మేమూ చాలాపనులు నెరవేర్చుకోవలసి వున్నది.

మిగతావారందరూ కూడా ఈ విషయంలో తమ అంగీకారాన్ని తెలియజేశారు. దిలీప్‌షాను ఇంద్రదేవుడు అతని అభిప్రాయమేమిటో తెలియజేయమని అడగగా అతడు 'నాకూ యేమీ అభ్యంతరంలేదు. ఎందుచేతనంటే భూతనాథుడు మాకు ఎక్కడ హానికలిగిస్తాడో అనే సందేహం నశించి పోయింది. భూతనాథునిజీవితకథ బయటపడిన తర్వాత మేమూ మాజీవితవృత్తాంతాన్ని తెలియచెప్పుతాము' అన్నాడు.

మహా:- అవును. మాకూ మీ కథ వినాలని చాలా అభిలాషగా వున్నది. వీలుంటే భూతనాథునికంటే ముందుగానే మీరు చెప్పేది వినే యేర్పాట్లు చేశాను. ఏదియేమైనా భూత నాథుడు మాకెంతో ఉపకారం చేశాడనటంలో మీరుకూడా మాతో ఏకీభవిస్తారనుకొంటున్నాను.

దిలీప్‌షా "తప్పకుండా మీతో మేము ఏకీభవిసాము. అతడు మీకు చేసిన ఉపకారం యువరాజుద్వారా మాకు తెలిసింది. అందుచేతనె మేము మనఃపూర్వకంగా భూతనా థుణ్ణి క్షమించాము. ఇక మాకు అతనిపై ఎటువంటి ద్వేష భావమూ ఉండబోదు.

మహా:- "చాలామంచిది. ఇప్పుడు భూతనాథుడు మా ఇంద్రజాలికులలో ఒకడు. అతనిని ఆ విధంగానే యికమీదట చూడండి. (అర్జునసింహుణ్ణే దిలీప్‌షాయొక్క రెండో అనుయా

యినీ చూచి) మీరు ఈ విషయంలో మా అందరితోనూ ఏకీ
భవిస్తారను కొంటున్నాను"

దిలీప్‌షా అనుయాయి :- మేము నిరంతరం భూతనాథుని పట్ల మా హృదయంలో ఇంతవరకూ నాటుకొని ఉన్న శత్రుభావాన్ని తొలగించి దానిస్థానంలో మిత్రత్వాన్ని పెంపొందించ వలసిందిగా మనఃపూర్వకంగా భగవంతుణ్ణి ప్రార్థిస్తున్నాము.

మహా:- శహబాష్.

"రాజా కలలోనయినా భూతనాథునివట్ల నాకు శత్రుభావం పొడచూపితే నన్ను నేను ద్రోహిగా ప్రకటించుకొంటానని మీ యెదుట శపథం తీసుకొంటున్నాను." అని అర్జునుడు తనచేతిలో ఉన్న పటాన్ని ముక్కలు ముక్కలుగా చించి భూతనాథుని యెదుట పారవేశాడు. భూతనాథుడు, అర్జునుడు గాఢాలింగనం కావించుకొన్నారు. తరువాత ఆ యిద్దరు దిలీప్‌షాలుకూడా భూతనాథుణ్ణి కౌగిలించుకొని తమ గాఢ మైత్రిని ప్రకటించారు.

భూత:- (రెండో దిలీప్‌సింహుణ్ణీ, అర్జునుణ్ణీ చూచి) ఇప్పటికైనా దయచేసి మీ యిద్దరిలో నిజమైన అర్జునసింహుడెవరో తెలియజెయ్యండి! నాడు నేను దిలీప్‌షాను మూర్ఛిల్లజేసి, ఆ పర్వతంమీదకు తీసుకొని పోయినప్పుడు మీ యిద్దరిలో ఎవరువచ్చి ఇంకొక దిలీప్‌షాగా మారటానికి సంసిద్ధులయారు?" రెండో దిలీప్‌షా నవ్వి "ఆ నాడు నేనే నీవద్దకు వచ్చాను. ఆ నాడెందుకో నేను అర్జునసింహుని వేషంలో బయట తిరుగుతున్నాను. నీవు దిలీప్‌షాను ఎత్తుకొని పోతున్న

ప్పుడు నేను చూచి వెంబడించాను. ఇవ్వేళ నిన్ను మోసం చేయటానికి అర్జునసింహుడుండగా కూడా ఇంకొక అర్జున సింహుని వేషంలో దీప్షా వెంటవచ్చాను.” అని చెప్పి తన వేషాన్ని కడిగివేసుకొన్నాడు. అతని నిజరూపాన్ని చూచి గోపాలసింహుడు ఆశ్చర్య చకితుడై “అరే! నీవు భరతసింహుడివా? నీ విషయమేనా ఇంద్రజీతుడు ముసుగు వేషంలో చెప్పింది అని ప్రశ్నించాడు.”

భరతసింహుడు “అవు”నని చెప్పగానే గోపాలసింహుడతన్ని కౌగలించుకున్నాడు.

మహారాజుతో “ఇతణ్ణికలుసుకొనటంవల్ల నాకుచాలా సంతోషంగా ఉన్నది. చాలాసేపటినుంచి ఇతణ్ణిగురించి యువరాజును అడుగుదామనుకొంటున్నాను.”

మహా:— బహుశః ఇతడుకూడా వృద్ధ సాధువువల్ల నానా యాతనలూ పడ్డాడనుకొంటాను.

భరత:— చిత్తం.

ఇంద్రజి:— మహారాజా! ఇంద్రజాలంలో నాకు దొరికిన ఐదుగురిలో వీళ్ళు ముగ్గురూ వున్నారు. మిగతా ఇద్దరినీ యిక్కడికి తీసుకురాలేదు. వీళ్ళ ఐదుగురి వృత్తాంతం వినటం వల్ల మనకు మాయారాణి ముఠావాళ్ళ విశేషాలు కొన్ని తెలుస్తాయి. విచారణ సందర్భంలో మన ఖైదీలు వీళ్ళ ఐదుగురినీ చూచి ఎట్టి మార్పులు పొందుతారో మీరే చూద్దురు గాని.

మహా:— మిగతా ఇద్దరెక్కడ ఉన్నారు?

ఇంద్ర:- నాలుగైదు రోజులలో వస్తామని సెలవు తీసుకొని యిండ్లకు వెళ్ళారు.

భూత:- ఇంద్రదేవా! యింతకీ కమలతల్లి మీకెక్కడ దొరికింది?

ఇంద్ర:- ఆ విషయం ఆమె నోటిమీదగానే వినటం మంచిది. ఆమె దాపరిక మేమీ లేకుండా చెబుతుందిలే.

భూత:- మరి నాకు తల్లి, దేవిసింహుని భార్యాకూడా ఇప్పటివరకూ చేసిన అద్భుతాలు ఎలా తెలుస్తాయి.

ఇంద్ర :- అదికూడా అప్పుడే తెలుస్తుంది. (నవ్వి) ఐనా నీవూ దేవిసింహుడూ ముసుగుమనుష్యుల వెంటపడి అనవసరంగా అనుమానాలను కొనితెచ్చుకున్నారు. అలా మీకు కూపీ తియ్యటానికి ప్రయత్నించక పోయినట్లయితే ఆ తర్వాత మీ స్త్రీలుకూడా చాలా గొప్పపనులు చేశారని తెలుసుకొని సంతోషించేవాళ్ళు. ఇప్పటికైనా సంతోషం కలగకపోదుగాని మొత్తంమీద కొన్నాళ్ళు అనుమానాలతో బాధపడ్డారు కదా?

అందరూ ఆ మాటలువిని నవ్వుకొన్నారు.

తేజసింహుడు నవ్వుతూనే దేవిసింహునితో "ఇప్పటికైనా తమకు మీ పుత్రరత్నమైన తారాసింహుడు మీతో కొన్ని రహస్యాలు ఎందుకు చెప్పకున్నాడో తెలిసిందా?"

దేవి :- చిత్తం. అంతా తెలిసింది. రాజపుత్రులు ముసుగు వేషంలో వుంటూనే తారాసింహుడినీ, భైరవసింహునినీ తమ అనుయాయులుగా వేసుకొని తిరుగుతున్నప్పుడు మాకు కలిగిన ఆశ్చర్యానికి అంతులేదు.

అతని మాటలు విని అక్కడివారందరూ చిరునవ్వులను చిలకబోశారు. అంతవరకూ విషాదమేఘాచ్ఛాదితమైన ఆ సభాస్థలి ఆనంద చంద్రికా విలసితమైంది.

తేజ :- భూతనాథా! ఇవ్వేళ నీకు చాలా శుభదినం. అన్నిటికంటేనూ మించి నీ సహధర్మచారిణిని నీవు కలుసుకో గలిగావు. నీ కుమారుడు హారనామసింహుడు అనేక సంవత్సరాల తర్వాత తిరిగి నీ సముఖానికి వచ్చాడు. అతనికోసం కమల పడిన దుఃఖానికి మేర లేదు. కమలకూడా హారనామసింహుణ్ణి చూచి యెంతగానో ఆనందిస్తుంది.

భూత :- అవును! ఐనా హారనామసింహునివద్ద గల ఇంకొక పెట్టెను చూచి నాకింకా భయంగానే వున్నది. అందులో నన్నుగురించిన రహస్యాలు ఏమున్నాయో అర్థం కావటంలేదు.

ఇంద్ర:- భూతనాథా! అనవసరంగా అనుమానాలెందుకు పెంచుకొంటావు? ఐనదేదో అయింది. ఇక మీదట నీ కెవరూ అపకారాన్ని తలపెట్టరు. అందులోనూ నీ కుమారుడైన హారనామసింహుని విషయంలో నీవు భయపడవలసిన అవసరంలేదు.

ఆసమయంలో సురేంద్రసింహుడు జీతసింహుణ్ణిచూచి ఏదో సంజ్ఞచేశాడు. దానినిగ్రహించి జీతసింహుడు యింద్రదేవునితో "భూతనాథుణ్ణిగురించిన ప్రశ్న యిక లేనేలేదు. అతడెలాగో తన జీవితచరిత్రను వ్రాసుకొనివచ్చి మహారాజాగారికిస్తాడు. ఇక మిగిలింది దిలీప్‌షా, అర్జునసింహ, భరతసింహుల

విషయమూ కసులతల్లి విషయమూమాత్రమే తెలిసికోవలసి నవి. వీరందరూ ఎటువంటికష్టాలను అనుభవించారో మహారాజు తప్పకుండా తెలుసుకొంటారు. కాని యివ్వాళ కాదు. చాలా ఆలస్యమైంది. రాజుగారికి విశ్రాంతి అవసరం. కనుక దర్బారు నేటికి ముగుస్తుంది" అన్నాడు.

నాటికి దర్బారుముగిసింది. మహారాజు జీతసింహుని వెంట ఒక గదిలోనికి వెళ్ళాడు. ఇంద్రదేవుడు ఏర్పాటుచేసిన ప్రకారం అందరూ తమతమ విడుదులలోనికి వెళ్ళారు. కొందరు తోటలో విహరించటంకోసం వెళ్ళారు.

# 5

ఒక బంగారు పట్టెమంచంమీద సురేంద్రసింహమహారాజు పరుండిఉన్నాడు. ఐంద్రజాలిక పూజ్యపాదుడైన జీతసింహుడు మంచంప్రక్కగా తివాచీమీద కూర్చుండి ఆయనతో నెమ్మదిగా మాట్లాడుతున్నాడు.

రాజు:— ఇంద్రదేవుని నివాసం చాలా అందంగా ఉన్నది. నాకు ఇచ్చటినుండి కదల బుద్ధికావటంలేదు.

జీత:— అవును. ఈప్రదేశమెంత నిర్మలంగానూ ప్రశాంతంగానూ ఉన్నదో ఇంద్రదేవుని స్వభావంకూడా అంతనిర్మలమూ ప్రశాంతమూ ఐనదే. ఐనా మనం ఇక్కడినుంచి సాధ్యమైనంత త్వరగా వెళ్ళిపోవటం మంచిది.

రాజు:— నేనూ అదే అనుకొంటున్నాను. వీళ్ళ జీవిత గాథలు సంవత్సరాల తరబడి వింటూకూర్చున్నా తరిగేవికావు. కనుక ముందుగామనం చిరంజీవుల వివాహాలుపూర్తిచెయ్యటం

మంచిది. ఆలస్యంచేస్తే ఎప్పుడు ఏమి విఘ్నాలువస్తాయో ఊహించలేముగదా?

జీత:- అందుకే త్వరగా బయలుదేరండం టున్నాను. భరతసింహుడూ మొదలైనవాళ్ళ విషయాలు అక్కడే వినవచ్చు. లేకపోతే వివాహాలు పూర్తిఅయినమీాదట బంధుమిత్రాదులతో కలసి యిక్కడికేవద్దాం. ఈ ప్రదేశాన్ని మనవాళ్ళంతా చూచినట్లు ఉంటుంది.

రాజు:- సరే! అలాగేచేద్దాం. కాని, లాడిలీ కమలినులవిషయమై నీవేమైనా ఆలోచించావా?

జీత:- వాళ్ళనుగురించి మీారనుకున్నదే నేనూ అనుకొంటున్నాను. వాళ్ళనుకూడా చిరంజీవులకిచ్చి వివాహాలు చెయ్యవలసిందేకదా! కాని కిశోరీ కామినులను చేపట్టినతర్వాతనే చిరంజీవులు లాడిలీ కమలినులను చేపట్టవలసిఉంటుంది. ఎందుచేతనంటే కిశోరి రాజపుత్రిక. అందుచేత ఆమెకు పుట్టినబిడ్డడే యీా సింహాసనానికి అధికారికావాలి.

రాజు :- అవుననుకో. అలాగే జరుగుతుంది కూడా. దానితోపాటే కమలను భైరవసింహునికీ, ఇందిరను తారాసింహునికీ ఇచ్చి చెయ్యటం మంచిది.

జీత :- సరే. అలాగే చేద్దాం.

రాజు :- ఐతే దిలీప్‌షా, భరతసింహులయొక్క జీవితకథలు ఇంటికి వెళ్ళినతర్వాతనే విందాం.

జీత :- అవును. అదేమంచిది కూడా. ఎందుచేతనంటే వీళ్ళ జీవితకథకూ, సాధువు మొదలైన ఖైదీలకు మిక్కిలి దగ్గర

సంబంధం ఉంటుంది. అప్పుడు మనం ఖైదీలను గురించి న్యాయ విచారణలో తొందరగా ఒక నిర్ణయానికి రాగలుగుతాము.

రాజు :— నీవు చెప్పింది చాలా సమంజసంగా ఉన్నది. వాళ్ళు మన చిరంజీవుల వివాహాలకు చాలా ఆటంకాలు కలిగించారు. ఇప్పుడు పిల్లల వివాహాలను వాళ్ళ కనులముందే చేసి ఆ తర్వాత వాళ్ళను శిక్షించటం బాగుంటుంది. కాని మాయారాణీ, మాధవీ జమానియాలోనే నివాతలు కావటం కొంత వెల్తిగా కన్పిస్తోంది.

జీత :— ఏం చేస్తాం! వాళ్ళకు అలా వ్రాసిపెట్టి ఉంటే!

రాజు :— సరే! ఇంక మనం భూతనాథునికి అతనికి సంబంధించిన వాళ్ళతో కలుసుకొనే అవకాశం యివ్వటం మంచిది.

"సరే" నని చెప్పి జీతసింహుడు అక్కడనుండి లేచి తన బంగళాకు వెళ్ళిపోయాడు.

## 6

స్వర్గలోకాన్ని మరిపిస్తున్న ఆ యింద్రదేవుని నివాసం బంగళాకు కొద్దిగా దూరంగా తోటయొక్క దక్షిణ దిశను ఒక జామిచెట్టు ఉన్నది. ఆ చెట్టును అనేక లతలు అల్లిబిల్లిగా అల్లుకొని ఉన్నాయి. అది చూడటానికి ఒక పొదరిల్లుగా కన్పిస్తోంది. దాని సమీపాన ఒకకాలువ ప్రవహిస్తోంది. ఆ పొదరింటిలో ఇద్దరుముగ్గురు మనుష్యులు ఇతరులకు కన్పించకుండా దాగి ఉండవచ్చును. ఆ సమయంలో భూతనాథుడు తన మొదటిభార్యతో కలిసి అక్కడ కూర్చుండి రహస్యంగా

మాట్లాడుతున్నాడు. సాయంకాలం కావస్తోంది. నలుదిక్కుల నుండీ తమగూళ్ళకు చేరుకొనే పక్షిజాతుల కిలాకిలార్భటులు దిక్కులు పిక్కటిల్ల జేస్తున్నాయి. ఆ దంపతులిద్దరూ అనేక సంవత్సరాలపాటు వియోగభారాన్ని అనుభవించి ఉన్నారు. ఆ స్త్రీ హృదయంలో ఎన్నో విషయాలు తన భర్తను కలుసుకొని అడగవలసినవి సందడిచేయ నారంభించినవి.

భూత :- శాంతా! ఇవ్వేళ నిన్ను నేను కలుసుకొనగలిగినందుకు చాలా సంతోషిస్తున్నాను.

శాంత :- ఎందుకబ్బా అంత సంతోషం! ఏదైనా వస్తువు తనకు తెలియకుండానే జారవిడుచుకొని దానిని తిరిగి సంపాదించుకొంటే సంతోషించాలి గాని, కావాలని పారవేసుకొన్న వస్తువు దొరికినప్పుడు సంతోష మెందుకు కలగాలి?

భూత :-అజ్ఞానవశంవల్ల తనకుదొరికినవస్తువును గాజుముక్కనిపారవేసుకొని ఆ తర్వాత అది వజ్రపు తునక అని తెలుసుకొని అటువంటిదాన్ని తిరిగి సంప్రాప్తింపజేసుకొంటే ఎవనికి మాత్రం ఆనందం కలగదా?

శాంత :- ఆ వ్యక్తి మీరన్నట్లు వజ్రపుతునకను గాజుముక్క అనుకొని పారవేసుకొని తెలిసినతర్వాత ఆ వస్తువుని తిరిగి పొందాలని అతడు పారవేసిన చోటుకి వెదుకులాడి అవస్థపడి తిరిగి పొందితేకదా అతనికి సంతోషం కలిగేది?

భూత :- అవునుగాని, అతడా వస్తువు పారవేసిన చోటికి వెదుకుత్తుకొని వెళ్ళేది అక్కడ ఆ వస్తువు దొరుకుతుందనే విశ్వాసముంటేగా? అంతేగాక ఆ ప్రదేశానికి ఆతురతతో వెళ్ళితే ఆ వస్తువు దొరకదు సరిగదా అతని ప్రాణా

లకు సంయోగం ముప్పై వాటిల్లుతుందని తెలిసినప్పుడు అతడక్కడికి వెళ్ళటం భావ్యంకాదు గదా?

శాంత :- మీరన్నట్లు ఆ వ్యక్తి అటువంటి పరిస్థితులలో తనను తాను ఆ ప్రదేశంలోనికి వెళ్ళలేకుండా చేసుకోవటం క్షమించలేము. కాని తన పరిస్థితి నిజంగా తనచేయి జారిపోతే అవ్విషతకు తాను పారవేసుకున్న వస్తువు వజ్రపు తునుకను అని గుర్తించాడనుకోవచ్చు.

భూత:- అతడిని గురించి మనం అలా అనుకొనేది అతడా ప్రదేశంలోకి వెళ్ళటానికి శక్తివంచనలేని కృషి చెయ్యనప్పుడు కదా ?

శాంత:- అవునుగాని ఆ పారవేయబడిన వజ్రము తన అధికారి వేరొక మాణిక్యాన్ని తెచ్చుకొని హృదయానికి చేర్చుకోవటం చూచింది. అతడు కావాలనుకుంటె ఆవజ్రాన్ని కూడా తన హృదయానికి చేర్చుకోవచ్చు. కాని అతడు ఆ వజ్రం సంగతి ధ్యానంలోనే ఉంచుకోలేదు. వజ్రం మాత్రం అధికారిదగ్గరకు చేరాలని విపరీతమైన ప్రయత్నం చేస్తోంది. ఐనా అతడు దానిని దగ్గరకు చేరనివ్వటంలేదు. అలాంటప్పుడు ఆ వజ్రం తన యజమానిపై దోషారోపణం చెయ్యకుండా ఎలా ఉంటుంది ?

భూత:- కాని అదృష్టమనేదికూడా ఒకటి ఉన్నదిగా. దానిని ప్రారబ్ధం అనికూడా అనవచ్చు.

శాంత:- మీరనేది వేరే విషయం. చర్చను వేరొక దిక్కుగా మరల్చటంవల్ల మీరు నిరుత్తరులయారనే అనుకోవలసివస్తుంది. అయినా దానిసంగతి వదలిపెడదాం. మిమ్మల్ని

పరాభూతులుగా చెయ్యాలని నా ఉద్దేశం కాదు. ఏదో మాటలసందర్భంలో నా మనస్సులోనిది చెప్పివేశాను.

భూత:- నేను దోషిని. ఇందులో ఏమీ సందేహం లేదు. కాని నిన్ను సజీవంగా ఈ ప్రపంచంలో తిరిగి చూస్తా నని నేనెన్నడూ అనుకోలేదు.

శాంత:- నిజంగా మీకోరిక అలాంటిదైతే మిమ్మల్ని మీరు మరణించారనే వర్తమానాన్ని నాదాకా ఎందుకు తీసుకొనివచ్చే ప్రయత్నం చేశారు?

భూత:- చాలు! నామీద దయవుంచి యీ రకంగా మాట్లాడటం ఆపివెయ్యి. ఎవని కృపాభిక్షవలననో యీ శుభ దినాన్ని చూచే అవకాశం కలిగింది. ఇటువంటి దినాన్ని కాస్తా నీవు ఎత్తిపొడుపు మాటలతో నిరర్థకం చెయ్యకు. ఇంతకూ నీ విన్నాళ్ళవరకు ఎక్కడున్నావో చెప్పు. కను లకుకూడా తెలియకుండా నీవామెను ఎలా విడిచిపెట్టివెళ్ళావు?

ఆ సమయంలో సుందరతరమైన శాంత ముఖాన ముసుగు లేదు. ఎన్నో సంవత్సరాలనుంచి కారాగారక్లేశాన్ని అనుభవించటంవల్ల ఆమె చాలా చిక్కిపోయి ఉన్నది. అయినా తిరిగి తన భర్తను కలుసుకోజాలినందుకు నేడామె సంతోష పారవశ్యంచేత అత్యంత సౌందర్యవతిగా కన్పిస్తోంది. భూత నాథునియొక్క రెండవభార్యయైన శ్యామదేవికంటేకూడా ఆమె ఎంతో అందగత్తె. భూతనాథు డామెవంక చూడసాగాడు. భూతనాథునియొక్క చివరి ప్రశ్నవల్ల శాంత కన్నీరుపెట్టుకొని పైటకొంగుతో కన్నులు తుడుచుకొంటూ ఈ విధంగా మాట్లాడసాగింది.

"రణధీరసింహుని నగరంనుండి నేను ఇతరులకు ముఖం చూపించగలిగే పరిస్థితులలో ఉంటే పారిపోయేదాన్ని కాను. మా తల్లి మీరు మరణించారని చెప్పింది. ఆ విషయం నమ్మేట్లుగా ఎన్నో ఉదాహరణా లిచ్చింది. అయినా నాకు విశ్వాసం కలగలేదు. ఆ విచారంలో నేను జబ్బుపడ్డాను. రోజు రోజుకూ నా అనారోగ్యం పెరుగుతూ వచ్చింది. ఆరోజులలో దిలీప్‌సింహుని భార్య నన్ను చూడటానికి వచ్చింది. ఆమెకు నా విషయం అంతా చెప్పాను. ఆమెతో నా భర్త క్షేమంగా ఉండికూడా ఏవిధంగా మరణించానని చెప్పుకుంటున్నాడో ఆవిధంగానే నీవు నన్నెక్కడైనా దాచిఉంచి నేను చచ్చిపోయానని లోకానికి చాటించమని చెప్పాను. అలాచేస్తే నేను నాభర్తను వెదకి పట్టుకోగలుగుతాను అన్నాను. ఆమె నా మాటలన్నీ విన్నది. నన్ను రణధీరసింహుని అనుమతి ప్రకారం తనయింటికి తీసుకుపోయింది. కమలను నేను కిశోరికి అప్పగించాను. నా వెంట పాలుత్రాగే పిల్లవాణ్ణిమాత్రమే తీసుకువెళ్ళాను. అక్కడ నాకు ఆరోగ్యం కుదురుకొన్నది. ఆ భయంకరమైన అర్ధరాత్రివేళ మీ రొకసారి దిలీప్‌షా ఇంటికి వచ్చారు. అప్పుడు మీరు పిచ్చివాడులాగా కన్పించారు. మీరు అనవసరపు అనుమానాలలో బడి మీకు ప్రాణసమానుడైన చిన్నకొడుకును మీ చేతులతోనే చంపుకొన్నారు.

శాంతకు దుఃఖం పొర్లుకొనివచ్చింది. భూతనాథుడు కూడా అదే అవస్థలో ఉన్నాడు. అంతకంటే ఎక్కువగా ఆ విషయాన్ని భూతనాథుడు వినలేకపోతున్నాడు. శాంతను ఆ విషయాన్ని గూర్చి చెప్పవద్దని ప్రార్థించాడు. శాంత పాదా

లపై పడాలని ప్రయత్నం చేస్తోండగా ఆమె భూతనాథుని శిరస్సును తన కౌగిలిలోనికి చేర్చుకొని "ఏమిటి మీరు చేస్తున్నది? ఇంకా నా నెత్తిన పాపాలను నింపదలచుకున్నారా? మీరా పిల్లవానిని గుర్తించలేదని నాకు తెలుసు. అతన్ని దిలీప్‌షా కొడుకనుకున్నారు. అయినా మీరా పిల్లవానిని చంపవలసింది కాదు. ఏమైనా ఇక ఆసంగతి విడిచిపెట్టివేయండి."

శాంత దుఃఖాన్ని మ్రింగుకొని తిరిగి మాట్లాడసాగింది.

"భరించలేని దుఃఖంతో నేను తిరిగి జబ్బుపడ్డాను. చివరకు నాలో కలిగిన ఆశాభావం నన్ను కోలుకునేటట్లు చేసింది. ఏనాటికైనా తిరిగి మిమ్మల్ని కలుసుకోగలనని హృదయపూర్వకంగా నమ్మాను. ఆ పిల్లవానిని చంపటంవల్ల దిలీప్ కూడా మీకు శత్రువయ్యాడు. చివరి కతడు వృద్ధ సాధువు చేతిలో చిక్కుకొనిపోయాడు."

భూత :- ఏమిటిదంతా? నీ సంగతే నిన్ను చెప్పమని నేను ప్రార్థిస్తున్నాను.

శాంత:- నా సంగతికే వస్తున్నా. ఆ సంఘటన జరిగిన తర్వాత నా యిష్టప్రకారం దిలీప్‌షా మా తల్లి బిడ్డలిద్దరూ మరణించారనిలోకానికి చాటాడు. ఆవర్తమానాన్ని విని హారనామసింహుడూ కమలాకూడా నావిషయమై తిలోదకాలిచ్చుకొన్నారు. దిలీప్‌షా కూడా వృద్ధసాధువువల్ల బందీ అయి కూర్చున్న తర్వాత నేను చాలా కష్టాలకు గురికావలసి వచ్చింది. ఇంట్లో నేనూ, దిలీప్‌షా భార్యా, అతని చిన్న కొడుకూ మాత్రమే ఉన్నాము. ఆమెను నేనెంతో ఓదార్చాను. భర్తృవియోగంవల్ల ఆమె మరణానికి సంసిద్ధురాలైంది.

నేను దిలీప్‌షాను వెదకి పట్టుకొని వస్తానని ఆమెకు వాగ్దానం చేశాను. అందుకు మేమూ యిల్లు విడిచిపెట్టవలసివచ్చింది. ఆ ప్రకారంగానే బయలుదేరివచ్చి కాశీలో నివాసము ఏర్పరచుకొన్నాము. అక్కడే దిలీప్‌షాను గురించి వెదకే ప్రయత్నం చేశాము. ఆ రోజులలో నేను మారువేషంలో తిరుగుతుండేదాన్ని. హారనామసింహునికి నా గుట్టు తెలియనీయకుండానే అతని సహాయాన్ని పొందాలనుకొన్నాను. దేవునిదయవల్ల నాకాలాంటి అవకాశం కలిగింది. ఒకసారి ఇంద్రజీతసింహుణ్ణి మాధవి బంధించి తీసుకుపోయింది. ఆ తర్వాత ఆమె కిశోరిని కూడా బంధించింది. అప్పుడు కిశోరిని వెదకటానికి హారనామసింహుడూ, కమలా బయలుదేరి వేరుమార్గాల వెళ్ళారు. హారనామసింహుడు కాశీనగరంలో వీధులవెంట తిరుగుతున్నాడు. అతడిని నేను చూచాను. పిల్చి పరిచయం చేసుకొన్నాను. నన్ను కలుసుకోవటం అతడెంతో సంతోషించాడు. ఇంటికి తీసుకొని వెళ్ళి విషయాలన్నీ అతనికి చెప్పి నేను చేయదలచుకొన్న కార్యక్రమంలో అతని సాహాయ్యాన్ని అర్థించాను. అతడంగీకరించాడు. అప్పుడు నేను కావాలనుకుంటే కమలనుకూడా దగ్గరకు చేర్చుకునేదాన్ని. కాని ఆమెను కిశోరికి అండగా విడిచిపెట్టివేశాను. హారమసింహుడు చాలా రోజులపాటు దిలీప్‌షాను వెదకాలనే ప్రయత్నంలో చాలా కష్టపడ్డాడు. నాదగ్గరకువచ్చి అనేక విషయాలు చెప్పాడు. మీరు కమలకి సహాయంగా ఉండి తిరుగుతున్నప్పుడు హారనామసింహుడు మిమ్మల్ని ఒక్కసారి చూచి వచ్చి నాతో చెప్పాడు. ఇంకా కొన్నాళ్ళతర్వాత మీరు ప్రపంచంలో

గౌరవప్రతిష్ఠలు కలవారుగా బయటపడి జీవించాలని అభిలాష పడుతున్నట్లుగాకూడా అతడే చెప్పాడు. నాకు చాలాసంతోష మైంది. హారనామసింహుణ్ణి ఏదో ఒకవిధంగా వీరేంద్రసింహుని ఐంద్రజాలికవర్గంలో చేరిపొమ్మని చెప్పాను. ఆప్రకారంగానే వాడు తారాసింహుణ్ణి కలుసుకొని అతిశీఘ్రకాలంలోనే అత నికి నమ్మినబంటుగా అయినాడు. తన వృత్తాంతాన్నంతా తారాసింహునితో చెప్పాడు. తారాసింహుడుకూడా హారనామ సింహుని రహస్యాలన్నీ బయటకు పొక్కకుండా దాచాడు. మారువేషంలో హారనామసింహుడు తారాసింహుని పనిపాట లలో ఉంటూనే అప్పుడప్పుడు నావద్దకువచ్చి మీవిషయాలు చెప్పిపోతుండేవాడు. బహుశః మీకు తారాసింహునితల్లియైన చంపకకూ నాకూ అక్కచెల్లెండ్ర చుట్టరికమున్నదని తెలియ దనుకొంటాను. చంప తన కొడుకుద్వారా హారనామసింహుని వృత్తాంతంవిని అతన్ని చాలా ప్రేమించింది. వాణ్ని తనకుమా రునితో సమానంగానే చూచుకొన్నది.

"జమానియా యింద్రజాలం భేదించటంపూర్తి అయింది. ఖైదీలను తీసుకొని రాకుమారులు ఆగుహలో ఉన్న ఇంద్రజాల భవనంలోనికి చేరుకొన్నారు. అక్కడకు భైరవసింహుణ్ణి, తారాసింహుణ్ణీ రావించి ఇంద్రజాలంయొక్క పూర్తివృత్తాం తాన్ని చెప్పి వాళ్ళనిద్దరినీ తమవద్దనే ఉంచుకొన్నారు. తారా సింహునిద్వారా దిలీప్‌షా తన భార్యాపిల్లలు క్షేమంగాఉన్నా రని తెలుసుకొని చాలా సంతోషించాడు. నావిషయంకూడా దిలీప్‌షాకు తెలిసింది. తారాసింహుడు రాకుమారుల అను మతితో హారనామసింహునికి ఆ భవనంలో దిలీప్‌షాతో సమా

వేశం కలిగించాడు. జిలీప్‌షా హరనామసింహుణ్ణి వెంటపెట్టు కొని శాశీకివచ్చాడు. అక్కడనుండీ నన్నూ తనభార్యనూ పిల్లవాడినీ తీసుకొని రాకుమారులవద్దకు వచ్చాడు. చంప కూడా నన్ను కలుసుకోటానికి ఆ భవనంలోనికి వచ్చింది."

భూత:- ముసుగువేషంలో రాకుమారులు భైరవ సింహుణ్ణీ తారాసింహుణ్ణీ ఆ భవనంలోనికి తీసుకొనిరావటానికి పూర్వం తారాసింహుడు ఒంటరిగా అక్కడికి రాలేదుకదా?

శాంత:- కాదు. అంతకుముందునుంచీ వాళ్ళు అక్కడకు వచ్చిపోయేవారు. రాకుమారులవెంటవచ్చినప్పుడు నిజరూపాల తోనే వచ్చారు

భూత:- అలాగా? అందుకే నాకూ దేవీసింహునికీ అనుమానం వచ్చింది.

శాంత:- ఇప్పుడు మీకు చంప అక్కడకు ఎందుకు వచ్చిందో తెలిసిందా?

భూత:- ఆ రహస్యం తెలిసింది కానీ, నానకూ అతని తల్లీ అక్కడికి ఎలా వచ్చారో తెలియటంలేదు.

శాంత:- ఆ సంగతి వారినే అడిగి తెలుసుకోండి.

భూత - ఎందుచేత?

శాంత:- వారినిగురించి నేనేమీ చెప్పదలచుకోలేదు. దానికి కారణం ఆమెనెవరూ గౌరవంగా చూడకపోవటమే.

భూత:- అవును. మొట్టమొదట ఆమెను నేను చాలా ప్రేమించేవాడిని. కాని ఆమెమూలాననే నేను నకిలీబలభద్రుని వశమైపోయానని తెలుసుకొన్నప్పటినుంచీ నాకామె అంటే అనిష్టమేర్పడింది.

శాంత:- ఎందుచేత?

భూత:- ఆమెకు బేగం స్నేహితురాలైన జన్‌హాకు చాలా స్నేహమున్నది. అందుచేతనే నా మేలుకోసం నేను తయారుచేసుకున్న కాగితాలన్నీ అదృశ్యమైపోయాయి. ఆ కాగితాలు నకిలీ బలభద్రుని చేజిక్కటంవల్ల నాకు చాలా నష్టం కలిగింది.

శాంత:- అవునట! నాకూ ఈ విషయం దిలీప్ షా చెప్పాడు.

భూత: తప్పాడా మెను నేను నాభార్యగా తలంచటం లేదు. నన్‌హాతో నేగాక ఆమె గౌహర్‌తో కూడా స్నేహం చేసింది. ఆ స్నేహం పవిత్రమైనది కాదు. అందుచేతనే ఆమె కడుపున నానక్ వంటి కొడుకు పుట్టాడు.

శాంత: అందుకు మీరింత వ్యసనపడటమెందుకు?

భూత :- ఆమెనుగురించి నాఆందోళన అంతా ఆమెపై నాకు గల ప్రేమవల్ల కాదు. కేవలం ఇంకా ఏమేమి అనర్థాలు నా నెత్తిమీదకు తెస్తుందోనన్న భయంచేతమాత్రమే. ఈమధ్యలోనే అడవిత్రోవలో నాకామె కనిపించి మోసం చేసింది. నన్ను బంధించి తీసుకుపోయింది.

శాంత:- ఆ పనిచేసింది ఇంద్రదేవుడుకాని ఆమెకాదు. ఆనాడడవిలో గుఱ్ఱంమీద మీభార్యారూపాన కన్పించినవ్యక్తి ఇంద్రదేవుని ఐంద్రజాలికుడు. ఈవిషయం నాకు ఇంద్రదేవుడే చెప్పాడు. ఐతే ఆ భవనంలో మీరుచూచిన స్త్రీమాత్రం నానక్ తల్లి. ఆమె అక్కడ ఖైదీగా ఉన్నది. రాకుమారు లిద్దరూ ఆమెను బయటపడకుండానే దాచారు. చివరకు మీరు

నానక్ తల్లినిగురించి అడిగాడు. నేనామెనుగురించి ఏమీ చెప్ప దలచుకోలేదు.

భూత:- ఇంతదాకా చెప్పినదానివు పూర్తిగా ఆమె సంగతి చెప్పితే వచ్చేనష్టమేమున్నది? ఎందుచేతనంటే ఆమె విషయాన్ని నేను ఆమెనోటిద్వారా వినాలని ఇష్టపడటంలేదు. ఇంతకూ ఆ విశ్వాస ఘాతకురాలిని ఇక్కడికి ఎందుకు తెచ్చారు?

శాంత:- ఆమెను నన్హాలో యింట బంధించారు. ఆ సమయంలో అక్కడ నానకుకూడా ఉన్నాడు.

భూత:- మళ్ళా నన్హాలో యింటికి వెళ్ళిందా?

శాంత :- చిత్తం. ఆ విషయాలన్నీ మీకు ఇంద్ర దేవుడు చెబుతాడు.

భూత.- సరే అలాగైతే. కాని ఒక్కవిషయం. ఇవ్వేళ జరిగిన దర్బారులో హారనామ సింహాసనివద్ద ఒక పెట్టెను చూచాను. అదెక్కడిది? అందులో ఏమున్నది?

శాంత:- ఆ పెట్టెలో వృద్ధసాధువు వ్రాసిన లేఖలున్నాయి. ఆ లేఖలవల్ల మీరు అనవసరంగా దిలీప్‌షాతో విరోధం పెట్టుకొన్నారని ఋజువౌతుంది. సాధువు మొదట దిలీప్‌షాకు డబ్బిస్తానని ఆశపెట్టి మిమ్మల్ని బంధించమని అతనికి ఉత్తరం వ్రాశాడు. వాటికి సమాధానంగా దిలీప్‌షా సాధువు కుట్రలు తెలుసుకోవాలనే ఉద్దేశంతో మిమ్మల్ని బంధించటానికి ఇష్టపడుతున్న వాడివలె నటించి ఉత్తర ప్రత్యుత్తరాలు నడిపాడు. ఆ లేఖలలో సాధువు రహస్యాలు బయటపడిన తర్వాత దిలీప్‌షా చివరకు తన నిశ్చితాభిప్రాయాన్ని తెలియ

చేశాడు. అప్పుడు సాధువు దిలీప్‌షా తన రహస్యాలు ఎక్కడ బయటపెడతాడో అని భయపడ్డాడు. అందుచేత అతడు దిలీప్‌షాను బంధించాలని నిశ్చయించుకొన్నాడు. ఆ ఉద్దేశం తోనే సాధువు మిమ్మలిని కలుసుకొని మొట్టమొదట దిలీప్‌షా వ్రాసిన ఉత్తరాలను మీకు చూపి మిమ్మల్ని దిలీప్‌షాకు విరోధిగా చేశాడు. మీరు దిలీప్‌షాను బంధించటంలో సాధువుకు తోడ్పడ్డారు.

భూత:- అవును. నేను చాలా పొరపాటు చేశాను.

శాంత:- కాని సాధువుకు దిలీప్‌షాకు తాను వ్రాసిన ఉత్తరాలు మాత్రం దొరకలేదు. ఆ ఉత్తరాలు దిలీప్‌షా భార్యవద్ద ఉండిపోయాయి. వాటిని మేమిప్పుడు వెంటతీసుకొని వచ్చాం. రేపు జరగబోయే విచారణలో సాధువుకు వ్యతి రేకంగా వాటిని బయటపెడతాము.

భూత :- అలాగా, అయితే నాకిప్పుడు హరనామ సింహునిపట్లగల అనుమానం తొలగిపోయింది.

ఆ సమయంలో అక్కడికెవరో వస్తున్నచప్పుడు వినిపిం చింది. నానక్ వచ్చాడు.

భూత:- ఏం కావాలి?

నానక్ :- మా అమ్మ మిమ్మల్ని కలుసుకోవాలని కోరుతోంది.

భూత :- అయితే ఇక్కడికే ఎందుకు రాలేదు? ఇక్కడ క్రొత్తవాళ్ళెవరున్నారు గనుక. పోయి తీసుకురా.

నానక్ "చిత్తం" అని వెళ్ళాడు.

శాంత :- బహుశః ఆమె నేనుండగా మీతో మాట్లాడలేదేమో ? మీ రంగీకరిస్తే నేను వెళ్ళిపోతాను.

భూత :- అబ్బే! నీకెందుకు నీవిక్కడే ఉండు! ఆమె చెప్పేదేమిటో చెప్పుతుంది.

శాంత :- బహుశః నేనిక్కడ ఉంటే ఆమె రాకపోవచ్చు. నా యెదుట మీ రామెను ఏమన్నా అంటారేమోనని సిగ్గు పడుతుందేమో ?

భూత :- అలాగా. అయితే నీవు వెళ్ళు.

శాంత వెళ్ళిపోయింది. సూర్యాస్తమానం కావటం వల్ల నలువైపులా చీకట్లు క్రమ్ముకొంటున్నాయి.

## 7

ఇంద్రదేవునియొక్క ఆ ప్రదేశం చాలా విశాలమైంది. అందుచేత ఈ సమయంలో అచ్చట ఎంతోమంది ఉన్నప్పటికీ ఎవరికీ ఏమీ ఇబ్బంది జరగటంలేదు. అతను స్త్రీలకు ప్రత్యేక గృహాలు ఏర్పాటుచేశాడు. అతని అనుచరులు రామదేవుని గురించి ప్రత్యేకమైన శ్రద్ధ తీసుకొన్నారు. ఎవరూ ఎవరివల్లా శత్రుభావంతో ఏమీ చెయ్యటానికీ అక్కడవీలులేదు. సురేంద్ర సింహ మహారాజూ, వీరేంద్రసింహుడూ రాకుమారులూ నివసిస్తున్న గృహానికి గట్టి పహరా ఉన్నది. ఇంద్రజాలికులు అత్యంత జాగరూకులై ఉన్నారు.

భూతనాథుడు ఏకాంతంగా తన భార్యతో సంభాషిస్తూ ఉండటం, దేవీసింహునికీ ఇంద్రదేవునికీ తెలుసు. వాళ్ళు ఉద్యానవనంలో పచార్లు చేస్తున్నారు. వాళ్ళిద్దరినీ చూస్తూనే

నానక్ భూతనాథునివద్దకు వెళ్ళి తిరిగివచ్చాడు. ఆ తర్వాత శాంత తన విడిదిని చేరుకొంది. ఆ వెనువెంటనే రామదేవి భూతనాథుని దగ్గఱకు వెళ్ళటం కన్పించింది. అదిచూచి ఇంద్రదేవుడు దేవీసింహునితో "దేవీసింహా! భూతనాథుడు తన మొదటిభార్యతో మాట్లాడటం ముగించి ఇప్పుడు నానక్ తల్లిని తనవద్దకు పిలిపించుకున్నాడు. శాంత ద్వారా అతనికి రామదేవి సంగతులు తెలిసిఉంటాయి. అందుచేత భూతనాథుడు కోపంతో రామదేవి కాళ్ళూ చేతులూ విరిచిపారవేసినా పారవేస్తాడు.

దేవీ :- అవును. ఆమెచేసిన నేరాలు అంతకు తక్కువైనవి కావుగా?

ఇంద్ర దే :- కాని యీ సమయంలో ఆమెను రక్షించాలి.

దేవీ :- ఐతే వెళ్ళండి! చాటుమాటుల దాగి అలాటి పరిస్థితులు వచ్చినప్పుడు రామదేవిని రక్షించండి. అగ్ని రగిల్చేవారూ మీరే; దానిని ఆర్పేవారూ మీరేగా;

ఇంద్ర :- ఏమిటయ్యా నీ వేళాకోళం.

దేవీ :- ఇందులో వేళాకోళమేముంది? ఆమెను మీరే పట్టితెచ్చారు. బంధించి తెచ్చినవారు ఏమి బహుమానమివ్వదలిచారో?

ఇంద్ర దే :- ఇంతకూ ఇప్పుడే ఆమెకు శిక్ష జరగాలంటావు.

దేవీ:- అవును. తమాషా చూడాలంటే వెళ్ళండి! నేనూ మీ వెంట వస్తాను.

ఇంద:- అబ్బే! వద్దు. భూతనాథుడు నీ స్నేహితుడే గాక బంధువుకూడా. కావాలంటే నువ్వే అతని యెదుటికి వెళ్ళు.

దేవీ:- భూతనాథునివల్ల నాకుకూడా రెండు గుద్దులు వడేట్లుచూడాలనుకొన్నారా? సరే! నాయనా! వెళతాను.

చెట్లచాటున బడి దేవీసింహుడు భూతనాథుని వద్దకు వెళ్ళాడు. అక్కడ వాళ్ళిద్దరి సంభాషణలూ వింటున్నాడు.

భూత:- ఇక్కడిదాకా నీవు రావటంనుంచి దేలయింది. నేను లామాఘాటికి వెళ్ళేవని తప్పించావు. కాని నీస్నేహితురాలైన నన్హేనుకూడా తీసుకురాలేదేం? నాకూ ఆమెను చాలారోజులనుంచి కలుసుకోవాలని ఉన్నది.

రామ:- నన్హేఅంటే మీ కెందుకు కోపం? ఆమె మీ కేం అపకారం చేసింది? ఆమె యిక్కడికి రావటానికి మీదాసీ మాత్రం కాదు.

భూత:- అవునులే. ఆమె మనదాసీ యెందుకౌతుంది. నీవే ఆమెకు దాసీవి. అందుకే నీవామె యింటికి వెళ్ళావు.

రామ:- ఆమె యింటికి వెళ్ళటంవల్ల నేనేమి పాపం చేశాను? ముందుగానే నేను నానక్ ను ఆమె యింటికిపంపించి సకలసందర్భాలు తెలుసుకొని ఆ తర్వాత వెళదామనుకొన్నాను. కాని అతడు వినకపోయాడు. చివరకు నేనకున్నట్లే జరిగింది. నేనక్కడుండగానే కొందరు ప్రవేశించి ఆమెనూ నన్నూ అవమానించారు. నన్ను ఇక్కడిదాకా లాగుకొని

వచ్చారు. అనవసరంగా ఆమెను బేగం స్నేహితురాలు అని నేరం ఆరోపించారు.

రామదేవి ఇలా చెప్పి దుఃఖాన్ని నటించింది.

భూత:– ఇంతకుముందు నీవెప్పుడైనా ఆమెను గురించి నాకు చెప్పావా? నన్నడిగి ఆమె యింటికి వెళ్ళావా?

రామ:– ఒకసారి వెళ్ళినందుకే ఇంతపని జరిగింది. చాలదూ?

భూత:– ఇక్కడికి నిన్ను తెచ్చినవాళ్ళు చెడ్డవాళ్ళా?

రామ:– చెడ్డవాళ్ళని నేనెట్లా అంటాను? చెడ్డవాళ్ళ నెత్తిన ఏమన్నా కొమ్ములుంటాయూ? మిమ్మల్ని అవమానించి నానా అవస్థలు పెట్టినవాళ్ళకే మీరు బుద్ధిలేకుండా ప్రాణాలు అర్పిస్తున్నారు.

భూత:– అవును! ఈ విషయం తెలుసుకోందామనే నిన్ను పిలిపించాను. నీవు అనుమతించావంటే వీళ్ళనందరినీ ఒక్క నిమిషంలో సర్వ నాశనం చెయ్యనూ. నేనేమీ బల హీనుడిని కాదు.

రామ:– తప్పకుండా వీళ్ళనందరినీ సర్వనాశనం చెయ్యవలసిందే. మీరా విధంగా చెయ్యకపోతే నీకంటే నీచుడు మరొకడు ఉండకపోడు.

భూతనాధునికి ఆమె మాటలవల్ల చాలాకోపంవచ్చింది. అయినా అణుచుకొని "తప్పకుండా అలాగేచేస్తాగాని ఇంతకీ పులిపిల్లలాంటి గౌహర్‌కూ నీకూ ఏమిటీ చుట్టరికం." అని ప్రశ్నించాడు.

రామ:- ఆ తురకదానితో నాకేమి చుట్టరికం. దాని ముఖం నేను చూడనన్నా చూడలేదు.

భూత:- చాలామంది నీవామె యింటికి వెళ్ళుతుండే దానివనీ, నా రహస్యాలు ఆమెకు చెబుతుండేదానివని అంటు న్నారులే.

రామ:- అంతా అబద్ధం. ఆచాడీకోరులకి బుద్ధిలేక పోతే నీకైనా ఉండవద్దూ.

భూతనాధుని కోపం కట్లు తెంచుకొన్నది. అతడు బలంకొలదీ రామదేవి మెడమీద ఒక్కగుద్దు గుద్దాడు. ఆమె మెలికలు తిరుగుతూ నేల కరచింది. కాని ఏడవలేదు. కొంతసేపటికి లేచి నిలబడి భూతనాధుని ముఖం చూడసాగింది.

భూత:- పాపాత్మురాలా! ఎవరికోసం నేను నా సర్వ స్వాన్ని అర్పింపదలచానో వారిని నోటికొచ్చినట్లు మాట్లాడు తావా? నీవు ఆ వెన్నెలరాత్రి గౌహర్‌ను కలుసుకోవాలని వన్‌హాకు వ్రాసినఉత్తరం నాకు దొరికింది. ఆ లేఖద్వారా నీ కథఅంతా బయటపడింది. ఇంకా దొంగయేడుపులు ఏడిచి నన్ను నమ్మించాలని ప్రయత్నించకు. నీవా ధూర్తురాలైన గౌహర్ కంటేకూడా నాకు యెన్నోరెట్లు ఎక్కువ అపకారం చేశావు. నీవొక విషభుజంగానివి. ఇన్నాళ్ళుదాకా నేను నీపై అనవసరంగా వ్యామోహపడినందుకు చింతిస్తున్నాను. ఆ వ్యామోహమే నన్ను సర్వనాశనంచేసింది. నీ చర్మాన్ని ఒలిచి చెప్పులుగా కుట్టించి నామొదటిభార్యకు తొడిగిద్దామంటేకూడా నాకు ఇష్టంలేకుండాపోయింది. ఏదోపాపం! అనిచెప్పి నిన్ను మాయారాణిదగ్గరనుంచికూడా విడిపించాలని పిచ్చిప్రయత్నం

చేశాను. ఆ దేవుని దయవల్ల అటువంటిపని జరగలేదు. ఈ మాటలు నీకేకాదు. నీకొడుకు నానక్ కుకూడా వర్తిస్తాయి. మీరు ఇప్పటినుంచీ నాముఖంచూడవద్దు.

రామదేవి యేమీ మాట్లాడలేదు. తాను వ్రాసిన ఉత్తరంసంగతి ఎత్తేసరికే ఆమె వణికిపోయింది. భూతనాథుడు అక్కడనుంచీ లేచి వెళ్ళిపోయాడు. దోవలో దేవీసింహుడు భూతనాథుణ్ణి కలసికొని "సెబాస్ భూతనాథా! నీ విప్పుడు మహావీరులు చేసేపని చేశావు. సరేవెళ్ళు! నేను యింద్రదేవుని వద్దకు వెళతాను" అని చెప్పాడు.

# 8

ఒకజాము రాత్రి గడచింది. అందంగా అలంకరించిన ఒక గదిలో గోపాలసింహుడూ ఇంద్రదేవుడూ కూర్చొనిఉన్నారు. వారికి ఎదురుగా నానక్ చేతులుకట్టుకొని కూర్చున్నాడు.

గోపా:- సరే. నీవు చెప్పినమాటలవల్ల నేను భూతనాథుణ్ణి దోషిగా భావించటంలేదు. నీ తల్లిపట్ల అతని ప్రవర్తన సమంజసంగానే ఉన్నది. నీమాటలువిని నేను భూతనాథుణ్ణి ఏమీ అనను. ఎంతమృదువుగా చెప్పినా నీవు మారకపోవటం నాకు చాలావిచారంగా ఉన్నది. మీ తల్లితోపాటు నీవు హోనన్ యింట బంధితుడవైఉండకపోయినట్లయితే ఇవ్వేళ నేను నీ చెప్పుడుమాటలవల్ల పొరపాటుచేసే ఉండేవాడిని. కాని ఇప్పుడు నేను అటువంటిమోసంలో పడబోను.

నానక్:- కాని మీరు నన్ను క్షమించారు.

ఇంద్రదే:- క్షమించినప్పుడు నీవు తిరిగి ప్రాతర్లోవనే యెందుకు వెళ్ళావు ?

గోపా - నా నోటితో క్షమించాననేమాట వచ్చింది గనుక నిన్నిప్పుడు నేనేమీ యిబ్బంది పెట్టను. కాని భూతనాథుని వలె నిన్ను చూడలేను. యింద్రదేవుడు చెప్పినట్లుగా నీవిక్కడి నుంచి వెళ్ళిపో! లేకపోతే నిన్ను ఆజన్మాంతఖైదులో పడవేయ వలసివస్తుంది.

నానక్ :- చిత్తం, పోసీ! మా అమ్మకు మా నాన్న ద్వారా భరణం ఇప్పించండి.

ఇంద్ర దేవుడు:- ఓరి దౌర్భాగ్యుడా! ఈ మాట అడగ టానికి నీకు సిగ్గెక్కడ లేదురా. దున్నపోతులాగా పెరిగావు. తల్లికి ఆ మాత్రం కూడు పెట్టలేవా? నీవు మా దగ్గఱనుండి యేమీ ఆశించక మీ అమ్మను తీసుకొని ఇక్కడనుంచి తొందరగా వెళ్ళిపో! భూతనాథుడుకూడా నాకిదే చెప్పాడు. అని చప్పట్లు కొట్టాడు.

వెంటనే అతని ఇంద్రజాలికుడైన సూర్యసింహుడు వచ్చాడు. అతడిని "భూతనాథు డెక్కడకి?" అని ఇంద్రదేవుడు ప్రశ్నించాడు.

సూర్య:- ఐదో సంఖ్యగల గదిలో దేవీసింహునితో మాట్లాడుతున్నాడు. వారు ఇద్దరూ ఇక్కడికి వచ్చారుకాని నానక్ ఇక్కడ ఉండటం చూచి వెళ్ళిపోయారు.

ఇంద్ర:- అలాగా! నీవు వెళ్ళి వాళ్ళను తీసుకురా!

సూర్య:- చిత్తం. కాని నానక్ ఇక్కడఉండగా వాళ్ళు రాకపోవచ్చును.

ఇంద్ర:— సరే నేనే వెళతాను.

గోపా:— మీరు వెళ్ళటమే మంచిది. దేవీసింహుణ్ణి కూడా తీసుకురండి.

ఇంద్రదేవుడు వెళ్ళి భూతనాథ దేవీ సింహుడితో వచ్చాడు.

గోపా:— ఏమయ్యా! ఇక్కడిదాకా వచ్చి తిరిగిపోయావట!

భూత:— ఆఁ! ఏమీ లేదు. మీరు ప్రత్యేకించి ఏమైనా మాట్లాడుకొంటున్నారేమోనని.

"సరే కూర్చో ఒక విషయమడుగుతాను."

"అడగండి."

"రామదేవినీ నానక్‌నూ ఏమి చెయ్యమంటావు?"

"మహారాజు ఏం చెయ్యమన్నారు?"

"నీవు ఏం చెబితే అది చెయ్యమన్నారు."

"నా ఉద్దేశమేమిటో ఇతని తల్లితో నేను చెప్పివేశాను. ఆ తర్వాత మీ ఇష్టం"

"ఇంతకూ వీళ్ళుచేసిన నేరాలు నీకు తెలుసుగదా"

"ఇంతకుముందు చేసినవి తెలుసు. కొత్తగా వీళ్ళిద్దరూ వన్‌మహోయింట ఉన్నారనికూడా విన్నాను."

"ఇంకొకటి ఉన్నది."

"ఏమిటది ?"

"వీళ్ళిద్దరి చేతులలో ఆయుధాలేవీ లేవుగాని, ఉంటే శాంతను చంపివేసేవారు."

నానక్ :- అయ్యే! మీ గూఢచారులు అనవసరంగా మామీద నేరం ఆరోపించారు.

భూత:- అలాగైతే వీళ్ళ చేతులకూ కాళ్ళకూ సంకె లలు ఎందుకు వెయ్యలేదు?

ఇంద్ర:-ఇంతమందిమి మనముండగా వీళ్ళు ఏంచేస్తారులే?

భూత:- సరే! ఇప్పుడు మీరే ఏం చేస్తారో చెయ్యండి? నాకేవిధమైన చింతాలేదు. చివరకి వీళ్ళు ఇక్కడికి రావటమే మంచిదైంది. లేకపోతే వీళ్ళనుగురించి నాకేమీ తెలియక ఆవేదనగా ఉండేది. ఇవ్వేళ నాకు వీళ్లు నాగుబాములుకంటె కూడా చెడ్డవాళ్ళని తేలింది. వీళ్ళను వదలించుకున్నందుకు నాతలపై బరువు దించినట్లున్నది.

ఇంద్ర:- మరి వీళ్ళను ఇట్లాగే విడిచిపెట్టివేస్తే లామా ఘాట్‌నంతా పాడుచెయ్యరూ?

భూత "అక్కడ ఉన్న నగలేవో తెప్పించుకున్నాను. ఇక వీళ్ళు చేసే దేమిటి?" ఇంద్రదేవుడు సూర్యసింహుణ్ని పిలిచి నానక్‌ను బైటికి పంపించివేశాడు. ఆ తర్వాత నలుగురు కూర్చొండి రామదేవికీ, నానక్‌కూ రాజ్య బహిష్కార శిక్ష విధించాలని నిర్ణయించుకొన్నారు. ఆ తర్వాత రామదేవినీ నానక్‌నూ పిలిచి తమ నిర్ణయాన్ని విన్పించారు. వాళ్ళిద్దరూ కొంతసేవు ఏడ్చారు. ఆ తర్వాత కొంతమంది భటులతో ఇంద్రదేవుని ఆజ్ఞచేత ఆ తల్లి కొడుకులను వీరేంద్ర మహారాజు రాజ్య సరిహద్దులను దాటించి వచ్చారు.

భూత:- అమ్మయ్య! పెద్ద బరువుదిగింది ఇంకా రేపేం చేద్దాం.

గోపా:- రేపు ఇక్కడనుంచి చునారగఢానికి ప్రయాణమవుదామని రాజుగారు ఆనతిచ్చారు. చంపా శాంతా దిలీప్‌షా భరతసింహ హారనామసింహులను బయటమార్గంగుండా పంపుతాము. మిగతావాళ్ళం ఇంద్రజాలాన్ని చూస్తూ సారంగపు మార్గాన చునారగఢానికి వెళదాం.

భూత:- సరేకాని దర్బారులోనికి వచ్చినపుడు నానక్ చేతిలో ఒక పటముండిగదా; ఇప్పుడది యెక్కడ ఉన్నది?

ఇంద్ర:- నా దగ్గరనే ఉన్నది. చూపిస్తాలే. అది చిత్ర పటమేమీ కాదు. ఒక పెద్ద మహాజరు వ్రాసిన కాగితం.

భూత:- ఏమి వ్రాశాడో?

ఇంద్ర:- ఏముంటుంది? అతణ్ని బంధించి తీసుకొనివచ్చిన వారిమీద అభియోగం ఆరోపించటం మాత్రమే. ముఖ్యంగా ఆ దరఖాస్తులో కమలయొక్క నిజమైన తల్లి చచ్చిపోయిందనీ మీరు శాంతగా అనుకుంటున్న స్త్రీ మోసగత్తె అని వ్రాశాడు.

భూత:- ఓరి దౌర్భాగ్యుడా! ఎంతపని చేశావు. సరే కాని, మరి ఆ దరఖాస్తు మహారాజు చేతికిచ్చాడా?

ఇంద్ర:- ఇచ్చాడు. రాజుగారు నన్నే పిలిపించి చదివించారు. రాజుగారు నవ్వుకొని వాడిని బయటకు గెంటివెయ్యమన్నారు. అంతకుముందే నేను శాంత హారనామసింహుల వృత్తాంతాన్ని మహారాజుకు చెప్పే ఉన్నాను.

భూత :- నాకుకూడా ఆ దరఖాస్తును చూపించండి.

ఇంద్ర :- అటకమీద పడేశాము, చూచుకోండి !

భూతనాథుడు దరఖాస్తును క్రిందకుదించి చదువు కొన్నాడు.

# 9

ఉషఃకాలపు కాంతిరేఖలు అన్నిచోట్లా ఒకేరకంగా ప్రభావితంగావు. గృహాలకున్న కిటికీలగుండా వాటిఅందం ఒక రకంగా కన్పిస్తోంది. మరి ఉద్యానవనాలలోనూ పర్వతాగ్రాల పైనా ఉషఃకాలపు సౌందర్యాతిశయం వేరువేరు రీతులలో విభ్రాంతిని కొల్పుతుంది. ఇవ్వేళ ఇంద్రదేవుని నివాస ప్రదేశానికి ప్రభాతిక ద్యుతులు ప్రత్యేక శోభను చేకూరుస్తున్నాయి. కొండ కోనలలో చొరబారుతూ, సాంద్రారణ్యాలలో సందులు వెదకుతూ, సద్యోవికసిత కుసుమలతా తరుసంతానాలమీద చవుకళిస్తూ భవనాలపై పరుగులు వారుతూ ఆ వెలుగురేకలు ఒక్కొక్కచోట ఒక్కొక్క అందాన్ని సృష్టిస్తున్నాయి. ప్రకృతికాంత లావణ్యానికి మెరుగులు సంతరించే ఆ ప్రాతర్వేళ సురేంద్రసింహ మహారాజు సపరివారంగా ఉద్యానవన శోభా దిదృక్షువై ఉన్నాడు. నాడే ఆయన అక్కడనుండి బయలు దేఱవలసి ఉన్నది.

జీత :- ఇంద్రదేవా! భరతసింహుడూ మొదలైనవారినీ స్త్రీ జనాన్నీ మీరు చునారగఢానికి పంపించివేశారా?

ఇంద్ర :- చిత్తం. బాగా తెల్లవారుజామునవే వారి నందరినీ బయటిమార్గంగుండా పంపించివేశాను. స్త్రీలకు వాహనాలతోపాటు పది పది హేనుమంది రక్షకులనుకూడా ఏర్పరచాను.

జీత :- ఐతే మనంకూడా భోజనాలుచేసి బయలు దేరుదాం.

ఇంద్ర :- చిత్తం.

జీత :- మీవెంట వచ్చిన భైరవసింహుడూ, తారా సింహుడూ ఎక్కడికి వెళ్ళారు ?

ఇంద్ర :- ఇప్పుడుకూడా వాళ్ళను నాతో తీసుకుపోవా లనుకొంటున్నా. వీళ్ళతో నాకు పనివున్నది.

జీత :- ఐతే నీవు మా వెంట రావా ?

ఇంద్ర :- మిమ్మల్ని ఇక్కడికి తీసుకొనివచ్చిన తోట వరకూ వస్తాను. అటుపిమ్మట రహస్యంగా ఉంటాను. మీకు ఇంద్రజాలవిశేషాలు చూపించటంతోపాటు మీరు చునారగధా నికి చేర్పించమన్న వస్తువులను ఇంద్రజాలంనుండి పంపించాలి కదా ?

సురేం :- రహస్యంగా నీవీపనులు చేయవద్దు. మాతోనె ఉండిఇక్కడివిశేషాలన్నీ చూపించు ఆవస్తువులను రెండురోజుల మీదట పంపినా ఇబ్బందిలేదు.

'చిత్తం' అనిచెప్పి ఇంద్రదేవుడు ఎక్కడికోవెళ్ళి భైరవ సింహుణ్ణి, తారాసింహుణ్ణీ వెంటపెట్టుకొనివచ్చి "భోజనాలు సిద్ధమయ్యాయి" అన్నాడు. భోజనాలపిదప అందరూ ఇంద్ర జాలాభిముఖంగా ప్రయాణమయారు. రాజపరివారం మొదట ఇంద్రదేవుణ్ణి కలుసుకొన్న తోటలోనికి చేరుకొన్నారు. తాము విశ్రాంతితీసుకొన్న భవనానికి చేరుకొనేసరికి ఇంకా ఒకజాము ప్రొద్దున్నది. జీతసింహుడు "ఇప్పుడేంచేద్దాం?" అన్నాడు.

ఇంద్ర:- ఈరాత్రి యిక్కడే గడపదలచుకుంటే, వేరొక తోటలోనికి వెళ్ళి అక్కడి విశేషాలు చూద్దాం.

"సరే పద" అన్నాడు జీతసింహుడు.

ఇంద్రదేవుడు ఆ భవనంలోని ఒకానొక అలమర తెర చాడు. తాను లోనికి ప్రవేశిస్తూ అందరినీ తన వెంటరండన్నాడు. ఆ యిరుకుమార్గంగుండా అందరూ ముందుకు సాగుతున్నారు. ఎదురుగా కన్పించిన వాకిలి ఇంద్రదేవుడు తెరచినమీదట అందరూ ఒకతోటలో ప్రవేశించారు. ఆతోట నిర్మాణం అతి విచిత్రంగా ఉన్నది. చుట్టూ ప్రాకారం తప్ప భవనాలేమీ లేవు. మధ్యగా ఒక వేదిక ఉన్నది. ఆ వేదికపైన పన్నెండు స్తంభాల మీద ఒక కప్పు ఉన్నది. వేదికమీదకు ఎక్కటానికి మెట్లున్నాయి. ఆ వేదిక దాదాపు నలభైగజాల వెడల్పూ అంతే పొడవూ ఉన్నది. ఆ వేదిక మీద ఇనుపగొట్టాలు వలపలె అమర్చిఉన్నాయి. దానిమీద నలుగురుమనుష్యులు కూర్చోటానికి వీలుగా నాలుగుకాళ్ళమీద ఒక నల్లరాయి అమర్చి వున్నది.

ఇంద్ర:- ఈ యింద్రజాలనిర్మాత యీతోటను కేవలం వినోదంకోసం ఏర్పాటుచేశాడు. దీని విశేషాలు నేను మీతో పాటుగానే ఉండి చెప్పలేను. దయచేసి మీరు నాకు కొద్దిసేపు సెలవు ఇప్పిస్తే..."

ఇంద్రదేవుని కోరికప్రకారం మహారాజు అతనికి శెలవిచ్చాడు. అతడు అందరు చూస్తుండగానే ఆ నల్లరాతిమీదకు వెళ్ళాడు. ఆ వెనువెంటనే ఆ రాయి కదలి యింద్రదేవునితో పాటు భూమిలోకి దిగబడిపోయింది. కొద్దిసేపటికి ఆ రాయి

తిరిగి పైకివచ్చింది. కాని దానిమీద ఇంద్రదేవుడు లేడు. ఇంద్ర దేవుడు వెళ్ళిపోయినమీదట మిగతావాళ్ళు ఆ వేదికమీద ఉన్నారు. అప్పుడా వేదిక నెమ్మదినెమ్మదిగా వేడెక్కసాగింది. రాజపరివారం అక్కడ నిలబడలేక తోటలోనికి వచ్చారు. ఇంకా ఒకగంట ప్రొద్దుమాత్రమే ఉన్నది. అందరూ కలసి తూర్పుదిక్కునగల ప్రాకారం దగ్గరకు వచ్చారు. ఆ తర్వాత అదేవిధంగా ఉత్తరానా పడమరనూ కల గోడలనుకూడా చూస్తూ దక్షిణంవైపుకు వచ్చారు.

ఆ గోడ కాంచ నిర్మితమైనది. దానిలో మహాభారతం ఘట్టాలు ప్రదర్శించే చిత్రాలున్నాయి. అవి లోగడ ఒకసారి చూచిన చలన చిత్రాలవలె ఉన్నాయి. ఆ చిత్రాలు మహా భారతకథలను కళ్ళెదుట సాక్షాత్కరింపజేస్తున్నాయి. ఇరు వైపులా కౌరవపాండవుల సేనా వాహినులు రథ, గజ, తురగ పదాదిదళాలచే క్రిక్కిరిసి ఉన్నాయి. ఇంతలో ప్రొద్దుక్రుంకింది. ఆ గాజుగోడ ప్రకాశించసాగింది. చిత్రాలు నడకసాగించాయి. కాని కొద్దిసేపట్లోనే ఆ చిత్రాలు అంతర్థానమై గోడలోని వెలుతురుపోయింది. అప్పుడు వేదికదిక్కుగా వెలుతురు కన్పిం చింది. అందరూ వేదిక సమీపించారు. ఆ వేదిక కప్పుమీద గల పదిపన్నెండు గాజుబుడ్లు దేదీప్యమానంగా వెలుగ సాగాయి. ఆ వెలుతురు తోటనంతటినీ ఆవరించింది. ఆ తరు గాత పందలకొలది విగ్రహాలు ఆవేదికమీద అటూ ఇటూ తిరగటం ప్రారంభించాయి. అవి ఆ గాజుగోడలో చూచిన బొమ్మలే.

ఆ సమయంలో ఆ వేదికపై కనిపించే ఆ చిత్రాలు అభిమన్యుని యుద్ధాన్ని చూపిస్తున్నాయి. సాక్షాత్తు మహాభారతం లోని అభిమన్యుని పాత్ర కండ్లకు కట్టినట్లు కన్పిస్తోంది. పద్మవ్యూహంలో చిక్కుకొని అభిమన్యుడు చూపించిన యుద్ధకౌశలమూ అతనిని అధర్మమార్గంలో హత్యగావించిన సంఘటనా నాటక రూపంలో రాజపరివారం చూచి చాలా ఆనందించారు. ఆ ప్రకారంగా అక్కడ వైచిత్ర్యాన్ని చూస్తూ చూస్తూ రాజపరివారం రాత్రంతా గడిపింది. తెల్లవారే ముందు వేదికంతా చీకటైపోయింది. చీకట్లో బొమ్మలుకూడా అంతర్ధానమైపోయాయి. వెలుతురు వచ్చేసరికి ఆ వేదికమీద గల నల్లని రాతిమీద ఇంద్రదేవుడు ఉన్నాడు. ఇంద్రదేవుడు వేదిక దిగివచ్చి మహారాజునకు నమస్కరించి "రాత్రి తమరు ఆనందంగా గడపారా?" అని ప్రశ్నించాడు.

మహా:- తప్పకుండానూ. ఇంకా ఏమైనా విశేషాలు ఇక్కడ ఉన్నాయా?

ఇంద్ర:- చిత్తం. ఇక్కడ తమరు మహాభారతకథ యావత్తూ చూడగలరు? అయితే పూర్తిగా చూడటానికి కొన్ని మాసాలు పడుతుంది.

మహా:- అలాగా! అయితే మరెప్పుడన్నా చూద్దాంలే. ఇంతకూ నీవెక్కడికి వెళ్ళావు? ఏమిచేసి యీ చిత్రాలను చూపగలిగావు?

ఇంద్ర:- ఇక్కడ యిటువంటి విచిత్రాలెన్నో ఉన్నాయి. మీరు వాటినన్నింటినీ సందర్శించటానికి సంవత్సరాలు గడపవలసి ఉంటుంది. అంతేగాక యిక్కడగల ధనాన్ని సంవత్స

గుండా నడిచాము. ఎప్పుడు ప్రొద్దు క్రుంకిందో ఎంతరాత్రిగడచిందో తెలియదు. చాలాదూరం నడిచినతర్వాత ఒక వాకిలిని ఇంద్ర జీతుడు తెరిచాడు. అదిఒకవిశాలమైనగది. ఆ వాకిలిగాకమిగతా మూడుగోడలకూ మూడువాకిళ్ళున్నాయి. ఇంద్రజీతసింహుడు "ఇప్పుడు మనం వేదికగల ఇంద్రజాలండున్న దిగువభాగాన ఉన్నాము. ఈచోట ఒకబావిప్రక్క మరొకటి చొప్పున వందల కొలది గదులున్నాయి. ఈగదులల్లో చిక్కుకొనిపోతే బయట పడటం చాలాకష్టం. మొదట మా సోదరులిద్దరూ ఇక్కడికి వచ్చినప్పుడు ఈ వాకిళ్ళన్నీ బంధించి ఉన్నాయి. ఇంద్రజాల గ్రంథాన్ని చదివి ఈ వాకిళ్ళు తెరిచేమార్గం తెలుసుకొన్నాం. మీకూ ఆ గ్రంథాలు చదివితే ఈ విషయాలు తెలుస్తాయి. కాని యీ వాకిళ్ళు తెరవటానికి ఎన్నో దినాలు చాలా ప్రయాసపడ్డాము. ఈ గదులమధ్య ఒక చతురస్రాకారపు గదిని చూస్తాం. ఆగది సరిగ్గా పైనగల వేదికక్రింద ఉన్నది. అక్కడ నుండే మనం బయటకు వెళ్ళేమార్గం చూస్తాం. మిగతా గదు లన్నింటా ధనరాసులు గుప్తంగా ఉన్నాయి. కప్పు మీదుగానే ఒక మార్గం ఉన్నది. ఆ మార్గం వేదికగుండా బయటికి రావ టానికి ఏర్పాటు ఉన్నది. మాకీసంగతి మొట్టమొదట తెలి యదు. మేమిద్దఱమూ ఆ వేదికలోని మార్గంగుండా బయటు దేఱినప్పుడు మాకీవిషయం తెలిసింది."

ఇంద్ర:- అవును. వేరొకమార్గం ఉన్నమాట నిజమే. కాని ఆమార్గం ఈ యింద్రజాల ప్రధానసంరక్షకునికై ఏర్పా టైనది. దానిని ఇంద్రజాలం భేదించేవారు ఉపయోగించుకో రాదు.

గోపా:- నాకూ ఆమార్గంసంగతి ఇంద్రదేవునివల్ల తెలిసింది. అప్పటివరకూ నాకు ఈయింద్రజాలానికి ఇంద్రదేవుడు ప్రధాన సంరక్షకుడనికూడా తెలియదు.

ఇంద్రజీతసింహుడు అందరినీ ఆగదులన్నీ త్రిప్పిచూపించాడు. వారు వాటి నిర్మాణంకొరకు జరిగిన శ్రమనూ వ్యయపడ్డ ధనాన్నీ ఊహించి ఆశ్చర్యపోయారు. అయితే ఆ గదులన్నింటా అగణితమైన సంపద గుప్తమై ఉన్నది.

ఆప్రకారం తిరుగుతూ తిరుగుతూ అందరూ మధ్యగల గదిలోనికివచ్చారు. ఆగదిఅంతా రకరకాల యంత్రాలతో నిండి ఉన్నది. భూమికీ కప్పుకీ అనుసంధానంగా అల్లినచాలాతీగలు ఉన్నాయి. ఆగదిగోడ లోపలనుంచీ పైకెక్కడానికి మెట్లున్నాయి. రాజపుత్రులిద్దరూ సురేంద్రసింహ మహారాజుకు ఆ యింద్రజాలం భేదించటానికి పూర్వం ఆ యంత్రాలెలా అమర్చి ఉన్నాయో తెలియజేశారు. తర్వాత యువరాజు మెట్లను చూపిస్తూ "ఇప్పటికీ మనం ఈ మెట్లు ఎక్కలేము" అన్నారు.

వీరేం:- ఇంతకు ఈ యింద్రజాలంయొక్క పునాదులు ఆ చలన చిత్రాలుగల భవనమేన నుకొంటాను.

సురేం:- అందులో అనుమాన మెందుకు? ఆ గది లోనే జమానియా, రోహితగఢం మొదలైన యింద్రజాలాల వరకున్నాయి. అక్కడ నివసించేవాడు రకరకాల చిత్ర విచిత్రాలను చూపించగలడు. తాను చూచి ఆనందించగలడు కూడా.

జీత:- అక్కడి వైచిత్ర్యాన్ని మనమింకా పూర్తిగా చూడనే లేదు.

ఇంద్రదే:- రెండుమూడు రోజులలో పూర్తిగా ఎక్కడ చూడగలం? మీరు అందులో పదహారోవంతుకూడా చూడలేదు నాకే యింకా చూడవలసినవి యెన్నో ఉన్నాయి.

సురేం:- అవతల పని ఉండటంవల్ల ఏదో కొద్దిగా చూచామనుకో. పెండ్లిండ్ల వ్యవహారాలు పూర్తిఅయితే తీరుబడిగా అక్కడి విశేషాలు చూద్దాం. అక్కడినుంచే రోహితగఢపు ఇంద్రజాలానికి వెళదాము.

ఇంద్రజిత్తుడు అక్కడినుంచి ముందుకు దారితీశాడు. ఐదేసి మెట్లకూ ఒక యినుప వాకిలి కనిపించింది. అతడా వాకిళ్ళను వజ్రఖచితమైన ఇంద్రజాలపు తాళంచెవితో తెరిచాడు. అందరూ ఆ మార్గంగుండా ఐంద్రజాలవేదిక బయటికి వచ్చారు. అప్పటికి తెల్లవారవస్తోంది.

# 11

ఇంద్రజాల విశేషాలను చూచివచ్చి అందరూ తమతమ నిత్యకృత్యాలలో పాల్గొన్నారు. అపరాధుల విచారణలను మరికొన్నాళ్ళు వాయిదావేసి రాకుమారులయొక్క వివాహ ప్రయత్నములలో అందరూ నిమగ్నులయ్యారు. నరేంద్రసింహ మహారాజు ఎవరికి ఏ పనులు అప్పగిస్తే బాగుంటుందో వారికి ఆ పనులు అప్పగించాడు. ఖైదీలను చునారగఢానికి పంపటానికి రాజాజ్ఞ అయింది. రెండుమూడు రోజుల తర్వాత మహారాజు సపరివారంగా చునారగఢానికి చేరు

కొందామనుకున్నారు.

భరతసింహుడూ దిలీప్‌సింహుడూ మొదలైనవారి యొక్క విడిది బలభద్రసింహునియొక్క పోషగున ఏర్పాటు అయింది. వీరి యోగక్షేమాల విచారణ బాధ్యత భూత నాథునికి అప్పగించారు. మొత్తంమీద సంక్షిప్తంగా ఇంద్ర జాలికులకు అప్పగించిన కార్యనిర్వాహణ బాధ్యతలు ఇవి.

1. ఈ యింద్రజాలపు సరిహద్దులలోపల విడిదిచేసిన అతిథులకు ఏవిధమైన లోట్లూ జరగకూడదు. ఇది భూతనా థుని పని.

2. అతిథులందరికీ మిఠాయీలు వుచితంగా కావలసి నంత యివ్వాలి. ఇది రామనారాయణుని పని.

3. చిల్లర వస్తువుల అమ్మకంలో ఎవ్వరూ దగాచేయ కూడదు. ఎక్కడా దొంగతనా లుండకూడదు. ఇది చున్నీ లాల్ పని.

4. ఇంద్రజాలం దగ్గరనుండి చునారగఢ్ వరకూ ఉన్న బాటను చక్కగా అలంకరించేపని పన్నాలాలూ, బదరీ నాధుడూ చూస్తారు.

5. చునారగఢ పట్టణానికి పొరుగూళ్ళనుండి వచ్చిన పండితులకు కావలసిన సౌకర్యాలన్నీ జాగ్రత్తగా జరిపించే భారం జగన్నాథ జ్యోతిషికునిది.

6. నృత్యాలూ, పాటలూ, పెండ్లి ఏర్పాటూ చూచే పని తేజసింహునిది.

7. బాణాసంచాలు కాల్పించేపనీ, విచిత్రశాలలలో అతిథులకు ఆనందాన్ని కలిగించేపనీ ఇంద్రదేవునిది.

8. రణధీరసింహుడూ, కిశోరీ, కామినీ, మొదలైన వారికి వైరులవల్ల ఎట్టికీడూ జరగకుండా దేవీసింహుడూ కని పెట్టుకుని ఉండాలి.

9. ఈ వివాహానికి సంబంధించిన ఖర్చులూ వగైరాలూ వ్రాసేపని గోపాలసింహునిది.

10. రాజపుత్రుల వెంట వుండేపని తారాసింహ, భైరవసింహులది.

"హరనామసింహుణ్ణి వెంటబెట్టుకొని జీతసింహుడు మొత్తం పన్నులన్నింటినీ తనిఖీచేస్తూ ఉండాలి. అంతేగాక ఖైదీలకు ఈ ఆనందోత్సవాలు కనిపించేలాచేసి వాళ్ళు సిగ్గుతో తలవంచుకునేటట్లు చేయాలి.

ఈ ప్రకారంగా ఎక్కడివారక్కడ తమ పనులను జాగ్రత్తగా నిర్వర్తించుకొంటూ పోతున్నారు.

ఈ సందర్భంలో కమలిని ఎవనినో పెండ్లాడిందనుకొని విచారపడుతున్న ఇంద్రజీతసింహుణ్ణిగురించి తెలుసుకుందాము.

రాత్రి బాగా పొద్దుపోయినతరువాత భైరవసింహునితో ఇంద్రజీతుడు తన మనస్తాపాన్ని గూర్చి ప్రసంగిస్తున్నాడు. అక్కడ మూడోవారెవరూ లేరు. తలుపుకూడా వేసేవున్నది.

భైరవః— ఇంతకూ మీరెందుకు అంత విచారంగా ఉన్నారో చెప్పరేమండీ! దేనికోసం ఇన్నాళ్ళు మీరు నానా యాతనలూ పడ్డారో ఆ వివాహం ఇవ్వేళ జరుగబోతూంటే మీరెంతో సంతోషించాలిగదా? కిశోరితో వివాహానికై మీరు ప్రాణాలుసైతం లక్ష్యంచేయకుండా శత్రువులను ఎదు ర్కొన్నారు. ఇవ్వేళ అంతా సుఖాంతం కాబోతోంది.

ఇంద్ర:- నీ వన్నట్లు నా కివ్వేళ చాలా శుభదినమే. నాకు సంతోషంగాకూడా ఉన్నది. కాని కమలినిని గురించిన విచారం నా మనస్సును ఆందోళన పరుస్తోంది.

భైరవ:- అరే! కమలినినిగురించి మీా కెందుకువిచారం? ఆమె మీాకెంతో ఉపకారం చేసిందికూడా ?

ఇంద్ర:- అవును. నాకామె చాలా ఉపకారంచేసింది. ఇప్పటికీ ఆమె హృదయంలో నాపట్ల సదభిప్రాయమే ఉన్నది. కాని నే నిప్పుడు లోగడవలె ఆమెను భావించలేకపోతున్నాను.

భైరవ:- ఎందుకని? ఆమె అత్తగారింటికి వెళ్ళిపోతే మీాకేమీా సహాయపడదనా ?

ఇంద్ర:- అవును.

భైరవ:- ఇక ఇప్పుడు మీాకు ఆమె సహాయంమాత్రం ఏమవసరం ? కాని ఆమె యింద్రజాలగృహాన్నిమాత్రం మీారు ముట్టలేరు.

ఇంద్ర:- అబ్బే! దాని అవసరంకూడా నాకులేదు.

భైరవ:- మరెందుకండీ విచారం? ఆమెపెండ్లికిమిమ్మల్ని పిలువలేదనా? ఈ విషయం గోపాలసింహునితో ఫిర్యాదుచేసి చూడండి.

ఇంద్ర:- అవును. ఆయనను చాలా విషయాలడిగి తెలుసుకోవాలని ఉన్నది. కాని ఎందుకో సిగ్గు కలుగుతున్నది.

భైరవ:- అదేమిటండోయ్. సిగ్గెందుకు? ఒకవేళ మీాకు కమలినిని పెళ్ళిచేసుకోవాలని చెప్పదలచుకుంటే సిగ్గుపడాలి గాని.

ఇంద్ర:- అదేనోయ్ నే నిందాకటినుండీ చెప్పాలను కొనేది!

భైరవ:- అదాసంగతీ! మరి ఇన్నాళ్ళనుండీ నాకు చెప్ప లేదేమి?

ఇంద్ర:- ఈవిధంగా కమలినిపెండ్లి నాకు తెలియకుం డానేఅయిపోతుందని నా కేం తెలుసు.

భైరవ:- సరే. జరిగిందేదో జరిగిపోయింది. ఇంతకూ ఆమెను పెండ్లాడటానికి కిశోరి ఒప్పుకోవద్దూ?

ఇంద్ర: అబ్బే! ఆమె యేమీఅనదు. అయితే నీవు కమలిని భర్తను చూచావా?

భైరవ:- ఓ, చాలాసార్లు చూశాను. మాట్లాడాను కూడా.

ఇంద్ర:- ఎట్లా ఉంటాడు?

భైరవ:- భలేవాడులెండి! బాగా చదువుకొన్నాడు. అందగాడు. మీాపెళ్ళికివస్తాడు చూద్దురుగాని. మరి ఈవిష యాన్ని కమిలినిని అడగలేదా?

ఇంద్ర:- ఆమె ఇంద్రజాలాన్ని చూడటానికి ముందు కన్పించింది. ఆమె తనపెండ్లిసంగతి స్వయంగానే చెప్పింది. ఆ సమయంలో నా కామెధోరణి అతి విచిత్రంగా కన్పించింది.

భైరవ:- ఏమిటా విచిత్రం?

ఇంద్ర:- (ఆనాడు జరిగిన సంగతంతా చెప్పాడు) ఆమె ప్రవర్తనపై నీ అభిప్రాయ మేమిటి?

భైరవ:- సముచితంగానే వ్యవహరించింది.

ఆ సమయంలో మొదటిమోస్తరుగానే ప్రక్కనే ఉన్న గది తెలుసుకొని దాసీది వచ్చి "కమలినమ్మగారు మిమ్మల్ని కలుసుకోవాలనుకొంటున్నారు." అన్నది.

ఇంద్ర :- సరే నేను వెడతాను.

భైరవ :- నేనూ వెళ్ళి విశ్రాంతి తీసుకొంటాను.

ఇంద్ర :- రేపు కన్పించు.

దాసి "వారినికూడా రమ్మంటున్నారు." అని చెప్పి వాకిలి మూసింది. అప్పటికి కమలిని అక్కడికివచ్చి భైరవసింహునితో "మీరెక్కడికి వెడతారు? మీతోనే అనేక మాట్లాడవలసిన విషయాలున్నాయి. ఆగదిలోనికి పదండి." అని ఆమె రాకుమారుని చెయ్యిపుచ్చుకొని తనగదిలోనికి తీసుకొని పోయింది. వారివెనుకనే భైరవసింహుడు వెళ్ళాడు. దాసి తలుపుమూసి వెళ్ళిపోయింది.

భైరవసింహునితో కమలిని "మీరందరూ నాకు తెలియకుండానే ఇంద్రజాలాన్ని చూచివచ్చారు కదూ?"

భైరవ :- మహారాజు ఇక్కడ పెండ్లిండ్లయిన తర్వాత స్త్రీలను తీసుకుపోదామన్నారు. అయినా ఒకరు నిన్ను తీసుకొని వెళ్ళేదేమిటి? నీవొక్కదానివే చూచివచ్చినా చూచి రావచ్చు.

కమలిని :- అదంత తేలికపనా నాకు.

భైరవ :- కాదా ఏమిటి?

కమలిని :- తప్పించుకోటానికి ఇదొక ఉపాయం ఇంతకూ మీరక్కడ ఏమేమిచూచారు? భూతనాధుడు చాలా

చిక్కులలో పడ్డాడట! అతని మొదటిభార్యకూడా వచ్చిందటగా?

భైరవ :- అవునవును.

కమలిని :- (ఇంద్రజిత్తునితో) ఏమండీ మీ పెండ్లికి నాకేం బహుమానమిస్తారు?

ఇంద్ర :- ఇట్లు తప్ప నేనివ్వగలిగేవన్నీ నీకు కొరత లేదుగా?

కమలిని భైరవసింహునితో "చూచారా! వారు నాకేం బహుమానమిస్తామంటున్నారో" (రాకుమారునితో) "సరే! జ్ఞాపకముంచుకోండి! దీనికి బదులు నేనెట్లా తీర్చుకొంటానో?"

భైరవ :- ఇప్పటికి తీర్చుకున్న బదులు చాలులేవమ్మా! ఈయనను పెండ్లి చేసుకుంటానని ఊరించి చివరకు మొండిచెయ్యి చూపించావు? అట్లాంటి నీకు రాకుమారుడిచ్చే బహుమానం ఇట్లుకాక యింకేమిటి?

కమలిని :- మీరూ వారిలోనే కలిశారూ?

భైరవ :- కలవక?

కమలిని :- అవునులే. కిశోరికి మీరు చాలా సహాయం చేస్తున్నారు.

భైరవ :- ఆ బాధ్యత రాకుమారునిమీద ఉన్నది.

కమలిని :- అవునండీ. మీ పురుషుల సంగతి నాకు తెలియదూ? నేను ఈ విషయాలన్నీ కిశోరికి చెబుతాను.

భైరవ :- అయితే చాలా మేలుచేయదలచుకొన్నా రన్న మాట.

ఇంద్ర :- ఏమిటోయ్. అనవసరపు మాటలూ మీారున్నూ.

భైరవ :- పెండ్లి రోజులలో యిల్లాటి మాటలేనండీ మాట్లాడేది ?

ఇంద్ర :- నీ తలకాయగాదూ ? కమలినీ ! ఇంతకూ నీవు నన్నెందుకు పిలిపించావు ?

కమలిని :- రామ ! రామ ! నాతో మాట్లాడ్డానికి కూడ మీాకు భారమైపోయిందా ?

ఇంద్ర :- అబ్బే ! అదేంలేదు. అసలు పనియేమిటో తెలుసుకుందామని.

కమలిని :- మా నాన్నగారు ఇక్కడికి వచ్చినప్పటి నుంచీ ఆయన తన భోజనాదుల విషయం తానే స్వయంగా చూచుకొంటున్నాడు. మీాకు తెలుసుగదా?

ఇంద్ర:- తెలుసు.

కమ:- ఇప్పుడు ఆయన ఇక్కడకూడా ఉండనంటు న్నాడు. ఆ స్నేహితుడు వేరే డేరా వేశాడట ! అక్కడుంటా నంటున్నాడు.

ఇంద్ర:- ఆ సంగతీ తెలుసు.

కమ:- మీారు అనుమతించినట్లయితే నేనూ లాడిలీ కూడా అక్కడికే వెళ్ళిఉంటాము.

ఇంద్ర:- ఇక్కడ ఉంటే ఏమిటి అభ్యంతరం ?

కమః— అబ్బే! ఏమీలేదు. మా నాన్నగారితో కలిసి ఉందామని.

ఇంద్రః— నీయిష్టం. నీ ప్రాణేశ్వరుడున్నాడు, నీవున్నావు. మధ్య నాకెందుకు.

కమః— ఇప్పుడాయన యిక్కడలేరు. అందుకని మిమ్మల్ని అడుగుతున్నాను.

ఇంద్రః— మళ్ళా ప్రాతత్రోవనే పడినట్టున్నావే? అయితే నేనంగీకరించను.

కమః— అయితే సరే.

ఇంద్రజీతుడు:— (భైరవసింహునితో) ఈమె ఎలా మాట్లాడుతోందో చూచావా?

భైరవః— పెళ్ళిచేసుకొని కూడా ఈమె మిమ్ములను వదలేటట్లు లేదు.

కమః— ఇంకొక విషయం.

ఇంద్రః— ఏమిటది?

కమః— మీపెండ్లిలో నేను మీతో వేళాకోళం ఆడదలచాను.

ఇంద్రః— ఏమిటా వేళాకోళం?

కమః— చెప్పితే అందులో రసం ఏమున్నది? కోపం తెచ్చుకోకుండా ఉంటానని యిప్పుడు వాగ్దానం చెయ్యండి.

ఇంద్రః— సరే! అలాగే.

ఆ తర్వాత అందరూ తమ తమ నివాసాలకు వెళ్ళి పోయారు.

# 12

వైవాహిక ప్రయత్నాలలో అత్యుల్లాసంగా వారాలు గడచిపోతున్నాయి. ఐతే ఆనందసింహునికీ, ఇంద్రజీతసింహునికిమాత్రం మనోవ్యధ నానాటికీ అధికతరమైపోతోంది. దానికి కారణం లాడిలీ కమలినులే. ఇంద్రజీతసింహుడు కమలినిని స్వయంగా కలుసుకొని ఆమె తన వివాహమై పోయిందని చెప్పగా విని చాలా చింతించాడు. అదేవిధంగా ఆనందసింహుడున్నూ లాడిలిని కలుసుకొని ఆమె వివాహంకూడా అయిందని గ్రహించి విచారపడ్డాడు. ఇంద్రజీతుని కమలిని స్వయంగా తనగదిలోనికి పిల్చింది. లాడిలి అలా చెయ్యలేదు. ఆనందసింహుని గది ప్రక్కగానే లాడిలి గది ఉన్నది. ఇంద్రజీతుడు కమలినిని కలుసుకొన్న నాటిరాత్రే ఆనందసింహుడు కూడా ప్రక్కగదిలోని లాడిలిని చూచాడు. అతడు తన గదిలో తన మంచంమీద పండుకొని ఆలోచిస్తున్నాడు. ఆ సమయంలో ప్రక్కగదిలో ఏదో చప్పుడైంది. ఆనందుడు తటాలున లేచి ఆవైపు చూచాడు. ఆ గది వాకిలి కొద్దిగా తెరుచుకొనిఉన్నది. ఆ గదిలో లాడిలిఉన్న సంగతి అతనికి తెలుసు. అతను లోగడ చాలాసార్లు ఆమెను కలుసుకోవాలని ప్రయత్నంచేశాడుకూడా. కాని గది వాకిలి మూసిఉండటంచే ఆపని సాధ్యపడలేదు. నేడా వాకిలి తెరచిఉండటం గమనించి అతడు మంచంమీదనుంచి లేచాడు. నెమ్మదిగా తలుపు దగ్గరకు వెళ్ళి మరికొంచెం తెరచిచూచాడు. అతనిదృష్టి లాడిలిపై బడింది. ఆమె దీపం దగ్గరకూర్చొని ఏదో వ్రాసుకొంటోంది.

తనను ఇతరులు చూస్తున్నారనే ధ్యాసకూడా ఆమెకు లేదు. ఒంటరిగా ఉండటంగమనించి ఆనందుడు గదిలో ప్రవేశించాడు. అతని పాదాల చప్పుడు విని ఆమె తలయెత్తి చూచింది. లేచి నిలబడి "మీరు వాకిలి ఎలా తెరిచారు?" అని ప్రశ్నించింది.

ఆనం:- ఏదో ఉపాయంచేత?

లాడిలి:- ఇంతకుముందు మీకే ఉపాయం తోచలేదా? బహుశః దాసీది గది ఊడవటానికి తలుపు తెఱచి తిరిగి బంధించటం మరచిపోయిందనుకొంటాను.

ఆనం:- పోనీ! అలానే అనుకుందాం. ఏమైనా అభ్యంతరమా ?

లాడిలి:- అభ్యంతర మేమున్నది? నేనే మిమ్మలను కలుసుకోవాలను కొంటున్నాను. కాని...

ఆనం:- కానీఏమిటీ? ఎవరైనా అభ్యంతర పెట్టారా?

లాడిలి:- అభ్యంతరమనే చెప్పవచ్చు. మా అక్కగారైన కమలిని 'నా యిష్టప్రకారం నీవు పెండ్లి చేసుకోదలచి నట్లయితే నీవు ఇతర పురుషులనెవ్వరినీ కలుసుకోవద్దు' అని చెప్పింది. ఆమె వివాహసమయంలో నా పెండ్లి చెయ్యాలని ఆలోచించారు. నే నందుకు అంగీకరించలేదు. ఈ సందర్భంలోనే నాకూ ఆమెకూ అభిప్రాయ భేదాలు ఏర్పడ్డాయి.

ఆనందుడు:- (ఆశ్చర్యంతో) కమలిని వివాహమైందా?

లాడిలి:- ఐందండీ.

ఆనం:- ఎవరితో?

లాడిలి:- నేనాసంగతి చెప్పను. మీరే తెలుసుకోగలుగుతారు?.

ఆనం:- చాలా చెడ్డపని జరిగింది.

లాడిలి:-నిజంగా చెరుపే జరిగింది. కాని గోపాలసింహుని యిష్టప్రకారం జరగక తప్పలేదు. కిశోరి బలవంతంగా ఆమె వివాహాన్ని చేయించింది. కమలినికి తల ఒగ్గక తప్పలేదు. కాని నేను పూర్తిగా వ్యతిరేకించాను.

"నీవు చాలా మంచిపని చేశావు."

"నే నిలాగే ఉండిపోవాలని ప్రమాణం చేశాను."

"అంటే నీవసలు పెండ్లి చేసుకోవా యేమిటి?"

"అవును లేకపోతే ఏం?"

"అయితే అది అంత మంచిదికాదు."

"ఏదైనా కానియ్యండి. శపథం చేశాను. ఇక్కడనుంచి త్వరలో వెళ్ళిపోతున్నా కూడా. కామిని వివాహం కోసం ఎదురు చూస్తున్నా."

"ఎక్కడికి వెళతావు?"

"మీ దయవల్ల మా తండ్రిగారు కనిపించారుగదా! ఆయన దగ్గఱికే వెళతాను."

"మీ నాన్నగారు నిన్ను తప్పకుండా పెండ్లాడమని ఒత్తిడి చేస్తారు."

"ఇందులో ఆయన ప్రమేయమేమీ ఉండదు."

లాడిలి మాటలు ఆనందుణ్ణి సంభ్రమాశ్చర్యాలలో ముంచెత్తాయి. ఆమె తననింతవరకూ కూర్చుండమనికూడా అనకపోవటం అతనికి మరింతఖేదం కలిగించింది. బహుశః ఆమె తనతో ఎక్కువసేపుమాట్లాడ దలచుకోలేదనుకొని అతడుదుఃఖ

మిశ్రిత క్రోధంతో "సరే. నే నిక్కడనుంచీ వెళ్ళిపోతున్నాను" అని వెళ్ళిపోయాడు.

ఆనందసింహుని ఆవేదనను లాడిలి గ్రహించింది. అతడు తిరిగిపోతున్న సమయంలో ఆమె "ఇన్నాళ్ళనుంచీ నా మీద దయగలవారికి నేడు దయ తొలగిపోజొచ్చింది" అన్నది.

ఆ మాటలు అతనిని చిక్కులలో పెట్టినట్లుకాగా అతడు వెనుదిరిగి "అంటే యేమిటి?" అని ప్రశ్నించాడు.

లాడిలి:— అదంతా నేనే మీ చెప్పలేను. మీవివాహమైనతరువాత చెబుతాను. అప్పుడు మీరు చెప్పినట్లుగాకూడా నడుచుకొంటాను.

లాడిలి మాటలు రాకుమారునికి తిరిగి ఏవో ఆశలను రేకెత్తించ్చాయి. అతడు సరేననుకొంటూ తన గదిని చేరుకున్నాడు.

# 13

పెండ్లి ఏర్పాట్లన్నీ పూర్తి అయ్యాయి. అంత బ్రహ్మాండమైన ఏర్పాట్లు చేసినప్పటికీ ఎవరూ అలసిపోయినట్లు కన్పించటంలేదు. అందరూ సముత్సాహ భరితులై అటూ ఇటూ పరుగులెత్తుతున్నారు. సురేంద్రసింహమహారాజు అందరినీ తీసుకొని చునారగఢానికి వెళ్ళాడు. ఇక ఇక్కడి యింద్రజాల భవనంలో, కావలసిన వస్తుసముదాయము, ఏర్పాట్లు చేసే మనుష్యులూ మిగిలిఉన్నారు. ఆ ప్రదేశంలోనే ఇంద్రదేవుడు నవ్వుతూ నవ్వుతూ క్రిందకు దూకే భవనాన్నికూడా ఒకటి తయారుచేశాడు. ఆ భవనం 20 గజాల పొడవు, అంతే

వెడల్పూవున్నది ఎత్తు దాదాపు ౫0 గజాలున్నది. నలువైపులా గోడలు గచ్చుచేసి ఉన్నాయి. వాకిళ్ళేమీ కనిపించటంలేదు. తూర్పు దిక్కునమాత్రం పైకెక్కటానికి మెట్లున్నాయి. మెట్లకు ప్రక్కగా పట్టుకోటానికి ఇనుప గొట్టాలున్నాయి. ఆ తూర్పుదిక్కు గోడమీదే పెద్ద పెద్ద అక్షరాలలో:

"ఈమెట్లమీదుగా పైకెక్కి లోపలజరుగుతున్నదిచూచి తిరిగి మెట్లమీదుగా వచ్చినవారికి ఒక లక్షరూపాయలు బహుమానం ఇవ్వబడుతుంది." అని వ్రాసి ఉన్నది.

చాలామంది పైకెక్కటానికి కుతూహల పడ్డారు. కావలావాళ్ళెవరినీ ఇంకా ఎక్కనివ్వటంలేదు. పెండ్లినాటినుంచీ పదిహేను రోజులపాటు పోటీ నిర్వహించటం జరుగుతుందని అందరికీ చెబుతున్నారు.

చునారగఢానికి వెళ్ళే మార్గానికి ఇరువైపులా దీపస్తంభాలు ఏర్పాటయినాయి. మధ్యమధ్యలో మంచెలుకట్టి భజంత్రీవాళ్ళు కూర్చున్నారు. ఆ మంచెలకుప్రక్కనే ఇద్దరిద్దరు చొప్పున ఖైదీలను కూర్చోబెట్టే ఏర్పాట్లు జరిగాయి. దీపస్తంభాల నానుకొని వీధిపొడవునా ఉద్యానవనం కల్పించారు. ఆ ఉద్యానవనంలో అక్కడక్కడ చిచ్చుబుడ్లు పెట్టారు. మైలు మైలుకూ నృత్యసంగీత నిపుణులయిన వారకాంత లున్నారు. అవి చీకటిరాత్రులు కనుక రాకుమారులకు దొరకిన ఐంద్రజాల చంద్రుణ్ణి చునారగఢపు దుర్గశిఖరాన కట్టారు. దాని వెలుతురు యిక్కడి యింద్రజాలంవరకూ వచ్చి పడుతోంది.

చునారగఢంనుండి పెండ్లివారు బయలుదేరారు. వివిధ వాద్యఘోషాలు దిక్కులు పిక్కటిల్లజేస్తున్నాయి. రకరకాల

సేనాదళాలు ముందునడుస్తున్నాయి. ఆవాహినులవెనుక ఏనుగు అంబారిమీద రాకుమారులిద్దరూ కూర్చున్నారు. పెళ్ళికుమారులను చుట్టుకొని బంధువులు నడుస్తున్నారు. వారివెనుక గుఱ్ఱాలమీద సర్దారులున్నారు. చివర వారికొంతసైన్యం నడుస్తోంది. ఇంతపెద్ద ఆర్భాటంగా పెళ్ళివారు వివాహమంటపాన్ని చేరుకొన్నారు. శాస్త్రోక్తంగా ఇంద్రజీతసింహునికి కిశోరితోనూ ఆనందునకు కామినితోనూ వివాహాలయ్యాయి. ఆఉత్సవంలో రణధీరసింహుడుకూడా పాల్గొన్నాడు. మరునాడు మహారాజు చునార్ గఢానికి వెళ్ళాడు. లక్షరూపాయల బహుమానం కోసం అనేకులు ఆ భవనం మెట్లెక్కటం ప్రారంభించారు. ఒకొక్కడూ పైకెక్కి చూచినప్పో లోపలికి పడిపోతున్నారు. ఆవిధంగా లోపలికి పడిపోయినవాళ్ళు చాలాసేపైన తర్వాత ప్రధాన ఇంద్రజాలభవనంలోనుండి బయటికి వస్తున్నారు.

## 14

ఇంద్రజీతసింహునికీ ఆనందసింహునికీ ఇవి చాలామధుర క్షణాలుగదా! రాత్రి సగంగడిచింది. చక్కగాఅలంకృతమయిన గదిలో ఎత్తయిన మంచంమీద మెత్తనిపరుపుపై ఇంద్రజీతుడూ కిశోరీ కూర్చుండి మాట్లాడుతున్నారు. కిశోరి లోగడ ఇంద్రజీత సింహునితో పరిచయం కలిగినదైనప్పటికీ ఆసమయంలో లజ్జాభరితవదనయై కూర్చున్నది. ఆమె స్వేచ్ఛగా అతనితోకలసి వ్యవహరించలేకపోతోంది. రాకుమారుడు ఆమెసిగ్గును తొలగించి తన ఉల్లాసంలో పాలుపంచుకొనేటట్లు చేయటానికి చెప్పవలసిన మాటలు చెబుతున్నాడు. కాని ప్రయోజనం లేక

పోతోంది. తన భర్తతో ఆమె గట్టిగా నోరువిప్పి మాట్లాడలేక పోతోంది. రాజకుమారుడు చివరకు ఇది ముగ్ధాసహజమైన ప్రకృతి అనుకొన్నాడు. ఆవిధంగానే సమయంగతించిపోతోంది ఆతర్వాత వారిద్దరూ ఎప్పుడు తాదాత్మ్యంచెందారో తెలి యదు కానీ ప్రభాతకాలపు మేలుకొలుపుపాటలు వారికి మెల కువ కలిగించాయి. కిశోరి త్వరత్వరగా లేచి గదిలోనే అమర్చిన నీటితో ముఖాన్ని కడుగుకొనసాగింది. ఆమెచేతులకు ఏదో రంగంటింది. వెంటనే ఆమె యింద్రజీతసింహుణ్ణి పిలచి "ఏమిటి నాకు రాత్రి రంగు ముఖానికి పులిమారు?" అని అడిగింది.

ఇంద్రజీతుడు ఆమెను సమీపించి "నాకేం తెలుసు" అన్నాడు.

"మీకు తెలియకపోతే ఏమిటి రంగంతా" అని అత నితో వాదించింది.

చివరకామె ముఖాన్ని నీటితో కడిగి రుమాలుతో తుడుచుకొన్నది. అప్పుడామె ముఖాన్ని ఇంద్రజీతుడు ఆశ్చ ర్యంగా చూచి "అరే నీవు ఇప్పుడు కమలినిలాగా కన్పిస్తున్నా వేమిటి ?"

కిశోరి:— నేనసలు కమలినినే. ఇంతకుముందు ఎలా కన్పించాను?

ఇంద్ర:— నువ్వు కిశోరివే అనుకొన్నాను. తక్కువ వెలుతురులో, సిగ్గుతో తలవంచుకొన్న నీముఖాన్ని పరీక్షగా చూడలేకపోయాను. ఐనా అప్పుడప్పుడు రాత్రివేళ నీ

ముఖాన్ని చూచి కిశోరివే అనుకొన్నాను. ఎంత మోసగించావు ?

కమ:- నేనేం మోసం చేశాను? మీరే నన్ను మోసగించారు. నన్ను మీరు కిశోరిగా భావించకపోతే నాతో ఇలా వ్యవహరించేవారు కారా? కిశోరి మీ భార్యగదా?

ఇం:- ఆమె కాకపోతే నీవా నా భార్యవు?

కమ:- మీరు నన్ను కిశోరిగా భావిస్తే నా దగ్గఱనుంచి మీరు వెళ్ళిపోవలసి వచ్చేది. కిశోరి యువరాజును పెండ్లాడి నప్పుడు మీకు ఆమెదగ్గఱ కూర్చుండే హక్కు ఏముంది?

ఇంద్ర:- అయితే నేను ఇంద్రజీతసింహుణ్ణి కానా? నిజానికి నీవే నా దగ్గఱనుంచి వెళ్ళిపోవలసింది. నీకు నేను పరపురుషుణ్ణి కదా?

కమ:- మళ్ళా మీ రదేమాట మాట్లాడుతున్నారు. మొదట మీరు అద్దంలో ముఖాన్ని చూచుకోండి. మీరు కిశోరీపతులో కమలినీపతులో తెలుస్తుంది.

ఆమె అతనికెదురుగా అద్దం తెచ్చిపెట్టింది. అద్దంలో అతనిముఖం వేరుగా కన్పిస్తోంది. అది ఎవనిఆకారమో చెప్పలేము. అటువంటి మనుష్యుణ్ణి అతడు లోగడ ఎప్పుడూ చూడలేదు. అతనికి ఎవరో యీ విధమైన కుట్ర చేశారని నమ్మకం కలిగింది. కమలిని కుట్రేమీ లేదనుకొన్నాడు. అతనికి కావప్పుడు మారిపోయిందీ తెలియదు. కమలిని 'ఎవరు మీర'ని గట్టించింది. అతడు 'ముఖం కడుగుకొని చెబుతాను ఉండు' అన్నాడు. ఆ విధంగా ముఖాన్ని కడుగుకొని కమలినితో 'ఇప్పుడు నే నెవరో చెప్పు' అన్నాడు.

కమ:-అరే! మీరు ఇంద్రజిత్తసింహులే? ఎందుకు మీరిలా చేశారు? ఇప్పుడు నేనేం చేసేది? లోకులకు ఏమని చెప్పుకోను?

ఇంద్ర:- ఇలా మనలనిద్దరినీ వంచించిన వాణ్ణి చంపకుండా విడిచిపెట్టను. ఈ అవమానాన్ని సహించలేను. ఇంతకీ నీకు ఈ గదిలోనికి వచ్చేటప్పుడు అనుమానం కలగలేదా?

కమ:- అనుమానమెందుకు? నన్ను ఈరాత్రే నా భర్తదగ్గరకు పంపే యేర్పాట్లు చేశారు. బహుశః నా వలెనే కిశోరికూడా మోసపోయి ఉంటుంది. ఆమెను నా భర్త గదిలోనికి పంపించారేమో?

ఇంద్రజిత్తు డా మాటలు విని ఆపాదమస్తకం భగ్గుమన్నట్లు అదరిపడ్డాడు. అతని పుండరీక దళాయత నేత్రాలు కోకనదారక్తాలయినాయి. తటాలున ఖడ్గంకోసం చెయ్యి చాచుతూ "అవును! అలాగే జరిగిఉంటుంది. నేను వాళ్ళిద్దరినీ ఇప్పుడే నరికివేస్తాను." అని కత్తి తీసుకొని గది బైటకు వచ్చాడు. కమలిని అతనిని ఆపి "మీరు తప్పు చేశారు. అయినా ఫరవాలేదు. ధర్మశాస్త్రాలలో పురుషుల కెక్కువగా ప్రతిబంధకాలు లేవు. కాని స్త్రీల సంగతి అటూకాదు. మీరు ప్రాయశ్చిత్తం చేసుకోవచ్చు. కాని నాకు అలాంటి అవకాశం లేదు. అయినప్పుడు నేను పతిత నయ్యానన్న విషయంకంటే కిశోరి పరపురుషునితో వెళ్ళిందనే విషయం మీకు ఎందుకు క్రోధకారణం కావాలి? నా భర్తఅంటే మీకంత చులకనా? ఆయనకుగూడా మీవలెనే కోపం రాకూడదా? బహుశః ఆయన మన యిద్దరి తలలూ నరకటానికి బయలుదేరి వస్తున్నా

కేమోతొందర పడనద్దు. ఆయన వస్తూ ఉండవచ్చు. ఆయన మీకంటే ఎక్కువకోపం కలవాడు. నేనే స్వయంగా ఆయన యెదుట తలవంచుతాను”

ఇంద్రజీతుడు వివశుడయాడు. అతడు నిశ్చేష్టుడై “హరి భగవంతుడా ఎందుకు నీవిట్లా చేశావు? నేనేం పాపంచేశానని యీ అశుభాన్ని నెత్తికెత్తావు? నన్ను నేను బలిచేసుకోనా ?” అనుకొంటూ కింకర్తవ్యతా మూఢుడైనాడు. ఇంతలో గది లోనికి కిశోరీ కమలా రావటం కనిపించింది. వాళ్ళిద్దరిముఖాలూ నవ్వుతూఉన్నాయి. రాకుమారునికి ఆశ్చర్యం కలిగింది. కమలినికూడా వాళ్ళనుచూచి నవ్వింది. కిశోరితో “చాల్లీ! యివ్వేళ నీ భర్తను నేను దొంగిలించాను.” అన్నది. దానికి సమాధానంగా కిశోరి “ఈ పని నీవు చాలాకాలం క్రిందటే చేశావు. ఇవ్వేళక్రొత్తయేమీలేదు అన్నది.”

---

# మాయామయి

## రెండవ అధ్యాయం

### 1

ఇక్కడ ఇంద్రజీతసింహ యువరాజు ఆ శోభనపు రాత్రి తికమకలుపడినట్లుగానే ఆనందసింహుడుకూడా అనను భూతాద్భుత సంఘటతో విచలితు డయినాడు.

ఆనందసింహుణ్ణి చేరవచ్చిన కామిని లజ్జాభరితవదనంతో అంటకుండా ముట్టకుండా కూర్చున్నది. ఆ నూతన వధువును రంజింపజేసి ఆమె మృదుభాషణాలు విందామని ఆనంద సింహుడు విశ్వప్రయత్నం చేశాడు. చాలాసేపటికి అతని యత్నం ఫలించింది. ఆమె తన లజ్జకు లజ్జకల్పించి అతనికి ఉల్లాసం కల్పించింది. సుదీర్ఘ వియోగానంతరం అభీష్టవర సంప్రాప్తికలిగిన యువతి ఎంత ముద్దరాలయినా ప్రియుని అను రాగ వాహినిలో తేలిపోక తప్పదుగదా! కనీవినీ యెరుగని హావభావాలూ మధురోక్తి చాతుర్యమూ అప్పటికప్పుడు తియ్యవిల్కాని ఉపదేశంవల్ల ఆమెలో ప్రబద్ధాలయినాయి. తర్వాత ఆ ప్రేయసీ ప్రియులకు రాత్రి ఎలా గడిచిందో చెప్ప వలసిందేమున్నది? "అవిదిత గత మాయూరాత్రి రేవ వ్యరథి సీత్"

వైతాళికుల ప్రాభాతిక మంగళగీతాలకు కామిని ముందుగా మేలుకొన్నది. తెల్లవారిపోయిందే! అని కలవర పడ్డది. ఆ కలవరపాటు తత్పూర్వానుభూత ప్రణయరసంవల్ల ఇంక తనివి తీఱకపోవటంచేతనా ? ఏమో !

దంతక్షతచిహ్నిత కపోల దర్పణా, పరిపీతరసాధరపల్లవా, విగళితకంచుకబంధా, విస్రస్తనీవీ అయిన ఆ లతాంగి గవాక్షం నుంచి తొంగిచూస్తోంది. ప్రణయరసాస్వాదన సంతృప్తుడైన ఆనాదసింహుడు ఆనందముద్రిత వదనంతో ఒడలు తెలియక నిద్రిస్తూ ఉన్నాడు. ఎవరూ మేలుకొల్పకపోయినట్లయితే ఆ రాజకుమారుడు అలాగే కొన్ని గంటలపాటు నిద్రిస్తూ ఉంటా డనటంలో సందేహంలేదు. పాపం! ఆవీరకుమారుడు తత్పూర్వం ఎన్ని సందడికయ్యాలలో, ఎక్కటి పోరాటాలలో పాల్గొన్నా ఇంత అలసట యెఱుగడు. చిగురాకు బాకువానితో పోరాటం సామాన్యమా! నొసట కన్నుగలవాడే ఆ జోదును కాల్చి బూదిచేసికూడా పరాజితుడైనాడుగదా !

ఇక కామిని గంగాభవాని వంక చూస్తున్నది. ఆ ముత్తోవద్రిమ్మరి ప్రశాంతంగా ప్రవహిస్తున్నది. చీకటితెర లింకా సడలలేదేమో; ఆ భాగీరథి కామినికి విస్పష్టంగా కన బడటంలేదు. దానినిబట్టి ఆ సుందరి ప్రొద్దుపొడవటానికింకా చాలా వ్యవధి ఉన్నది గ్రహించింది. ఆసమయంలోనే కోటలో నుండి ఘంటాధ్వానం వినిపించింది. దానినిబట్టి ఇంకా రెండు గంటలకు కాని సూర్యోదయం కాదని కామిని తెలుసుకొన్నది. ఆమె కెమ్మోవిమీద చిరునవ్వు చిందులు తొక్కింది. ఎందుకా మందహాసం ? మేము జవాబు చెప్పలేము. కామినీ హృదయం

అగాధంకదా! అలా నవ్వుకొంటూనే ఆమె ఒక తలుపు తెరచి కూజాతో నీళ్ళుపెట్టిన చోటికి వెళ్ళి ఒక తుండుగుడ్డను తడిపి ముఖమంతా శుభ్రంగా తుడుచుకొన్నది. ఆ తుండుగుడ్డను రెండవసారి తెరచిన కిటికీగుండా బయటకు విసరిపారవేసి ప్రియుడు నిద్రిస్తున్నచోటికి వచ్చి చేరుకొన్నది. ఒక్కసారి అతని ముఖారవిందాన్ని సంతృప్తిగా చూచింది. లావణ్య సర్వస్వం మూర్తీభవించిఉన్న తాను కట్టెదుట నిలిచిఉండగా ఆ పురుషుడు ఎలా నిద్రిస్తున్నాడు! అని ఆమె ఆశ్చర్యపడ్డ దేమో! అతని అవజ్ఞకు కోపగించుకొన్న దేమోకూడా! చేలాంచలం సన్నగా చుట్టి నాసారంధ్రంలో చొప్పించుకొని బలవంతాన తుమ్ము తెప్పించుకొన్నది. ఆమె ఉపాయం ఫలిం చింది. ఆధ్వనికి రాజకుమారుడు తటాలున మేలుకొని కన్నులు తెరచి ఆశ్చర్యంతో "అరె! అలా నిలుచున్నావేం? నిద్రపట్ట లేదా?" అని ప్రశ్నించాడు.

కామిని :- ఏమీలేదు. రాత్రిఅంతా ఏమిటో పిచ్చి పిచ్చి ఆలోచనలతో నిద్రపట్టలేదు.

ఆనందుడు :- (లేచి) ఏమిటా ఆలోచనలు?

కామిని :- ఏమని చెప్పను? చెప్పటానికికూడా సిగ్గు గానే ఉన్నది. అయినా చెబుతాను. మీరుమాత్రం ఏమీ అనుకోకూడదు.

ఆను :- అబ్బే! నేనేమీ అనుకోను చెప్పు!

కామిని:- ఏమీలేదు. రామానంద సింహాలతో కొంతసేపు వేళాకోళం ఆడటం జరిగింది. ఆ వేళాకోళ మేమిటో ఈపాటికి మీకు తెలిసే ఉంటుంది. అందుచేత ఏంచేయాలా

ఆనే ఆలోచనలో పడ్డాను. కామినిని కలుసుకొని ఈ విషయంలో ఆమెకు నచ్చజెబుతామన్నా ఆమె నిప్పుడు కలుసుకోలేను.

ఆనందుడు:- (ఆశ్చర్యంగా) బహుశః నీవింకా కలవరింతలోనే ఉన్నావనుకుంటున్నాను. లేకపోతే నీవు మాట్లాడే దేమిటో నాకు బోధపడటంలేదు.

కామిని:- అబ్బే! ఏమంత గొప్ప విషయం కాదండీ! నాకు కలకూడా ఏమీ రాలేదు. కాని నేను నవ్వుతూ రాకుమారునితో నా పెండ్లి ఇంతవరకూ కాలేదనీ అసలు పెండ్లి చేసుకోననీ చెప్పాను. కాని కామిని చెప్పినట్లుగానే నా వివాహంకూడా ఆమెతోపాటే అయింది. ఈరాత్రే ఆమెతో పాటే అయింది. ఈరాత్రే ఆమె శోభనంకూడా అందుచేత నాకు సిగ్గుగా...

ఆనందుడు:- నీకేమైనా పిచ్చెత్తిందా యేమిటి? ఇంతకూ నీవు మనమిద్దరం ఎవరమనుకొంటున్నావు? ఏదీ నీ ముఖం కనిపించటంలేదు? ముసుగు తియ్యి.

కామిని:- వద్దు. నన్నిట్లా కూర్చోనివ్వండి. ఇందులో నాకు పిచ్చెత్తిం దేమున్నది?

ఆనందుడు:- నువ్వు తప్పకుండా బ్రహ్మాండమైన కలే కన్నావు. లేకపోతే దాని ప్రభావం ఇంతసేపటివరకూ ఎందుకుంటుంది? నిన్ను నీవు లాడిలివని ఎందుకనుకుంటావ్? నీవనే మాటలన్నీ ఆమె నాతో ఒకప్పుడన్నవే!

కామిని:- ఏమిటీ! మీరే కలగంటున్నట్లున్నారే! నాకు చాలా ఆశ్చర్యంగా ఉంది. కలలో మీరు కామిని మీ పక్కలో ఉన్నదనుకొన్నారు కాబోలు! ఇప్పటికీ నన్ను

మీరు కామిని అనే అనుకొంటున్నారు. చిన్నకుమారానంద సింహుణ్ణి విడిచిపెట్టి కామిని మీ దగ్గరకు ఎందుకు వస్తుందండీ? నాతో మీరు వేళాకోళం ఆడటంలేదుగదా!

ఆ కోమలి కోమలతరవాక్కులు ఆ పురుష సింహుని మీద బ్రహ్మాస్త్రంగా పనిచేశాయి. విస్మయ వివృతనేత్రుడై అతడు తటాలున లేచి ఆ సుందరి అవకుంఠనాన్ని తొలగించాడు. ఆ లలన మెల్లగా నవ్వింది. ఆ వీరుడు తెల్లబోయి నిలబడ్డాడు. కొంతసేపటివరకూ అతని నోటివెంట మాట రాలేదు. చివరకు "అరె; ఇదేమిటి? లాడిలి నా దగ్గరకు రావలసిన అవసరం ఏమిటచ్చింది? నువ్వు నిజంగానే లాడిలివి! లేక పోతే రంగేమైనా వేసుకున్నావా? చెప్పు!" అన్నాడు.

కామిని:- (భయం అభినయిస్తూ) "మీరనేమాటలు నాకేమీ అర్థంకావటంలేదు. అసలు కామిని మీ చెంత కెందుకు వస్తుందో ఆలోచించరేం?

ఆనందుడు:- ముందుగా నీవు నీముఖాన్ని కడుక్కొని రా! అప్పుడు నీతో మాట్లాడతాను. నీవు లాడిలి వేషం వేసుకొని నన్ను మోసగించాలని చూస్తున్నావు. ఇప్పటివరకూ నిన్ను నేను కామినివనే అనుకొంటున్నాను. నిజంగా నీవు కామిని వే!

కామిని:- (ఆనందునిరూపాన్ని పరికిస్తూ) భలేవారే! నన్ను కామిని అనుకొని మిమ్మల్ని ఆనందసింహు డనుకొంటున్నారా?

ఆనందుడు:- మరేమనుకోమంటావు?

కామిని:- ఓరిభగవంతుడా, ఈయన మతి ఇట్లా అయిందేమిటి ?

ఆనందుడు:- ఆవేషాలన్నీ కట్టిపెట్టి ముందు ముఖం కడుగుకొని రా.

కామిని:- ఆగండి; నేను బయటికివెళ్ళి ఈసంగతి అందరితోనూ చెబుతాను. మిమ్మల్నిచూస్తే నాకు భయంగాఉన్నది.

ఆనందుడు:- చాలులే నీ వేళాకోళం! ముందు నీళ్ళతో ముఖం కడుగుకొని రమ్మంటే రావేమిటి ?

కామిని:- నాముఖం దేనికి కడుగుకోవాలి? మీరేమీ ముఖం ఎందుకు కడుగుకోరు ? నేను ముఖంకడుగుకొంటే లాడిలిని కాకుండాపోతానా? మీరు కడుగుకొంటే ఆనంద సింహాత్వం పొందుతారా ?

ఆనందుడు:- నోరుమూసికొనీ, ముందుగా నేనుచెప్పినట్లుచెయ్యి లేకపోతే బలవంతంగా ఆపని చెయ్యవలసిఉంటుంది.

"ఇవ్వేళ ప్రొద్దుననే ఇంతకష్టం ఎదురైందేమిటి? ఎవరి ముఖం చూచాను?"

అనుకొంటూ కామిని ముఖం కడుగుకొని రుమాలుతో తుడుచుకొంటూ రాకుమారుని సమీపించి "చూడండి; నేనేమైనా మారిపోయానేమో? అన్నది."

రాజకుమారుడామెను ఆశ్చర్యచకితుడై చూడసాగాడు. అప్పటికి తూరుపు తెలతెలవారుతోంది. వాళ్ళున్నగదిలో కూడా వెలుగురేకలు ప్రసరిస్తున్నాయి.

కామిని:- మాట్లాడరేమండి, నేనేమైనా మారానా ?

ఆనందుడు:— నీ అవకుంఠనం నన్ను మోసంచేసింది. మనమిద్దరమూ కలుసుకోటానికి పూర్వమే నీముఖాన్ని జాగ్రత్తగా చూచి ఉన్నట్లయితే ఇంత అవినీతికి పాల్పడేవాణ్ణికాను.

నిజానికి కామినిరూపంలో ఉన్నజాణ లాడిలి అని పాఠకులు గ్రహించారుగదా! కనుక ఆమెనిక లాడిలి అనే వ్యవహరిద్దాం.

లాడిలి:— ఇంకా మీరు మిమ్మల్ని ఆనందసింహుడుగానే భావించుకొంటున్నారా? ఇంతచేసినా మీరింకా స్వప్నలోకంలోనే ఉండి మాట్లాడుతున్నారు. ఆ కనిపించే అద్దంలో ముందుగా మీ ముఖం చూచుకోండి.

ఆనందుడు అద్దంలో తనముఖం తాను చూచుకొని ఆశ్చర్యపడ సాగాడు. అతనిని లాడిలి సమీపించి "ఎవరండీ మీరు?" అని ప్రశ్నించింది.

ఆనందునికి సిగ్గుతోపాటు కోపంకూడా వచ్చింది. అతడు తన దుస్తులను పరిశీలించుకొన్నాడు. వాటిలో మార్పేమీ లేదు. లాడిలిని చూచి "ఎవరు నా వేషాన్ని మార్చింది?" అని ప్రశ్నించాడు.

లాడిలి:— ఏమిటీ? మీరు మీ వేషం మారిందనుకుంటున్నారా ?

ఆనందుడు:— అవును.

లాడిలి:— అదా సంగతి! అయితే కొంపలు మునిగాయన్నమాటే!

ఆనందుడు త్వరత్వరగా తన ముఖాన్ని కడుగుతొన్నాడు. అతనిముఖం మారిపోయింది. లాడిలి "అవును.

ఈయన మారు వేషంలో ఉన్నాడు. నాకొంప మునిగింది. నే నేముఖం పెట్టుకొని నా భర్తదగ్గరకు వెళ్ళను. లోకం నన్నేమని ఆడిపోస్తుందో? ఆడదానికి ఇంతకంటే మరణం ఇంకొకటి ఉన్నదా? మీరు కావాలనే నన్నెందుకూ పనికి రాకుండా చేశారు. ఇప్పుడు నేనేం చెయ్యను?" అని మెల్లగా రోదనం ప్రారంభించినది. ఆనందసింహుడు అప్రతిభుడై "ఏమ న్నావు? కావాలనే నేనిట్లా చేశానా?" అని ప్రశ్నించాడు.

లాడిలి:- తప్పకుండా.

ఆనందుడు:- అయితే నేను మాత్రం అపవిత్రుణ్ణి కాలేదా?

లాడిలి:- పురుషులకు ఏం బాధ? వాళ్ళు పదిహేను ఇరవై పెండ్లిండ్లు కూడా చేసుకొంటారు. చెడేది స్త్రీలు మాత్రమే. తమరు కావాలనే నన్ను మోసం చేశారు. పురుషు లైన మీరు నాగ్గరకు రావటానికి ఏం అధికారమున్నది?

ఆనం:- ఆఁ! నేను పరకాంతను మోహిస్తానా? నేను మోసపోయాను. కొద్దిగా నీముఖం కనిపించినా నువ్వు కామినివనే అనుకొన్నాను. నిన్ను మోసగించాలని నేను మారువేషం వేసుకోలేదు. అసలు నావేషం మారించన్న సంగతె నాకు తెలియదు.

లాడిలి:- మీరు చెప్పినమాటలే నిజమైతే కామినికి కూడా ఈగతేపట్టిందంటుంది. నన్ను మోసగించి ఈగదిలోనికి పంపించిన వారే ఆమెనుకూడా మోసగించి నాభర్తగదిలోనికి పంపించిఉంటారు.

ఈ మాట వినటంతోనే ఆనందునికి పట్టలేనంత కోపం వచ్చింది. "ఏమన్నావ్! నీ భర్తగదిలో కామిని ఉంటుందా? వాడిలికా..."

లాడిలి :- ఆగండి! ఎందుకు మీకంత కోపం! కామినికి గౌరవహాని జరిగిందని బాధపడే మీకు నా గౌరవాన్ని గురించి కూడ ఆలోచించాలిగదా! మీలాగానే నా భర్త కూడా...! కాని మీరు నాకుపట్టిన దుర్గతిమాట మరచిపోయి కామినిని గురించి మహోగ్రరూపం ధరిస్తున్నారు. ఈ ప్రపంచంలో ఎవరో మహాత్ములకు తప్ప న్యాయవిచక్షణ తెలియదు. ఇతరులకు కలిగిన నష్టాన్ని గుర్తించగలిగేది తనకూ అటువంటి నష్టం సంభవించినప్పుడే! క్షుద్బాధ క్షుధార్తునికీ దాహంబాధ పిపాసాపీడితునికీ మాత్రమే తెలుస్తాయి. జీవితంలో ఎవడు కనీసం ఒక ఉపవాసమైనా చేసి యెరుగడో అతనికి కఱవు కాటకాలను గురించిన భయానక పరిస్థితులు ఎట్లా అర్థమౌతాయి? అతని హృదయంలో దాక్షిణ్యభావం ఎలా ఉద్భవిస్తుంది. అందుకే మన పూర్వులు ఉపవాసాన్నికూడా వ్రతంలో చేర్చారు. దీని అర్థం స్వయంగా ఎవడు ఆకలిని గుర్తిస్తాడో అతడే ఆకొన్నవారిని ఆదుకోగలడని కాబోలు! ఇతరుల గొంతులపైకి కత్తిని ఎత్తేవాడు తనగొంతు మీదికి సూదిమొనను కూడా ఆననివ్వడు. ఇతరుల స్త్రీలను తేలికగా చూచేవాడు తన స్త్రీ సంగతి వచ్చేసరికి మండిపడతాడు. అందుకే నా దుర్గతినిగురించి అంతగా తలపోయని మీరు కామిని విషయం వచ్చేసరికి ఒరలోనుండి కత్తి దూశారు.

ఇదేనా మీ న్యాయం? ఇటువంటి హృదయాన్ని పెట్టుకొనే మీరు రాజపాలనను కొనసాగించదలచారా?

లాడిలియొక్క ఉద్వేగపూర్ణ వాక్యాలను విని ఆనందుడు తగ్గిపోయి వినత వదనుడయ్యాడు. ఆమె మాటలను ఎదిరించే శక్తికూడా అతనికి లేకపోయింది. ఆ సమయంలో నే గదివాకిలి తెరచుకొన్నది. ఇందిరను వెంటపెట్టుకొని కామిని ప్రవేశించింది.

లాడిలి:— ఊఁ. కామినికూడా వచ్చింది. ఆమెకూడా తనకు జరిగిన పరాభవాన్ని చెప్పుతుంది. (కామినితో) నీతో ఇవ్వేళ సరిసమానురాల నైనాను.

కామిని:— సరిసమానురాలవే కాదు. మించిపోయావు కూడా.

## 2

రాత్రి ఒక జాముకంటె ఎక్కువ ప్రొద్దు గడచింది. అంతఃపురములో చక్కగా అలంకరించిన ఒక గదిలో రాణీ చంద్రకాంత, చంపా, చపలలూ కూర్చుండి ఉన్నారు. వారికి కొద్ది దూరంలో వీరేంద్రసింహ మహారాజూ, గోపాలసింహుడూ, భైరవసింహుడూ కూర్చుండి ఉన్నారు. వారు చాలాసేపటినుంచీ ఏదో మాట్లాడుకొంటున్నారు.

చంద్రకాంత వీరేంద్రసింహమహారాజుతో "వాస్తవమైన విషయం తెలియటం అటుంచి, నాకీ విషయంలో ఏమాత్రం అనుమానం కలగలేదు. వధూవరులను పడకటింటికి పంప బోతున్నారని తెలిసి ఇక్కడకు వచ్చాను. పగలంతా అలసి

పోయి ఉండటముచేత ఏమీ చెయ్యలేని స్థితిలో ఉన్నాను. రెండు మూడు గంటలపాటు నిద్రపోవాలనిపించింది. అప్పుడు చపల నా దగ్గరకు వచ్చి ‘ అక్కయ్యా నీకొక విచిత్రమైన విషయం చెపుతాను. విను!’ అన్నది. నా దగ్గరకూర్చుండి చెప్పటం ప్రారంభించినది. ‘లాడిలీ కమలినుల వివాహాలు ఇంద్రజాలములో క్రమంగా ఆనందసింహ ఇంద్రజీతసింహులతో జరిగాయి. ఈ సంగతులు మనకు ఇంతవరకూ తెలియలేదు. ఇపుడు నా కుమారుడైన భైరవసింహుడు చెప్పాడు’ ఆ మాటలు విని నేనాశ్చర్య పడ్డాను. ఈ విషయం ఇంతవరకు అందరూ ఎందుకు దాచిఉంచారో అర్థంకాలేదు.”

భైరవసింహుని సూచిస్తూ చపల “ఎదుర గుండానే కూర్చున్నాడు. అడగండి! తన ఎదుటనే వారిద్దరి వివాహాలు పూర్తి అయినప్పటికీ ఇతడు దాచిఉంచాడు.” అన్నది.

వీరేంద్రుడు:- నాకూ ఈవిషయం ఎవరూ చెప్పలేదు. ఇంతకుముందే గోపాలసింహుడు ఈ విషయం తండ్రిగారికి చెప్తూఉంటే నాకు తెలిసింది.

చంద్రకాంత:- ఆసంగతి తెలిసీ మిమ్మల్ని అడిగి తెలిసికొందామనుకొన్నాను. మీనోటినుంచి విననిదే నాకుసంతృప్తి ఉండదు.

వీరేంద్రుడు:- నీవు విన్నదంతా యథార్థమే.

చంద్రకాంత:- ఆశ్చర్యమేమంటే మనపిల్లలు ఈసంగతి నాతో ఎప్పుడూ మాటమాత్రమైనా చెప్పలేదు.

వీరేంద్రుడు:- మనపిల్లలకే తమ వివాహం కమలినీ, లాడిలులతో జరిగినసంగతి తెలియనపుడు మనకేంచెప్తారు?

చంద్రకాంత:- మీ రేమిటో మరొక ఆశ్చర్యకరమైన విషయం చెప్పుతున్నారు. లోకంలో మానవుడన్నవాడికి తన వివాహం ఎవరితో, ఎప్పుడైందికూడా తెలియకుండా ఉంటుందా? మీ మాటలు నేను నమ్మలేకుండా ఉన్నాను.

వీరేంద్రుడు:- ఇందులో విశ్వసించకుండా ఉండవలసిన పనిలేదు. ఈ వివాహం ఒక కారణాన్ని పురస్కరించుకొని రహస్యంగా ఉంచటం జరిగింది. (గోపాలసింహుని చూపుతూ) ఈయన ఇప్పుడు జరిగినసంగతి అంతా చెప్తుతాడు. నీకప్పుడు విషయాలన్నీ తెలిసివస్తాయి.

గోపాలసింహుడు:- సంగతి సందర్భాలన్నీ మీకు విశదంగా చెపుతాను. మీరు నన్ను క్షమించాలి. నేనే ఈవిధంగా చెయ్యటానికి భాధ్యుణ్ణి. ఆ వివాహాలు నా ద్వారానే జరిగాయి.

చంద్రకాంత:- అల్లాగయితే మీరు దాచవలసిన కారణమేమిటి? మేము ఎప్పుడైనా మిమ్మల్ని కోపగించుకొన్నామా ? అంతేగాక తమరేప్పుడే పనిచేసినా మా క్షేమంకోసమే చేస్తారనే విశ్వాసం మాకు ఉన్నది.

గోపాల:- అవుననుకోండి! కాని ఈ విషయం మీకు తెలియనీయకుండా దాచవలసే వచ్చింది. అదే కారణంవల్ల రాకుమారులకు కూడా తమ వివాహాలు ఎవరితో, ఎప్పుడయినవో కూడా తెలియనీయకుండానే ఉంచాము.

చంద్రకాంత:- ఇంతకూ ఈ విధంగా ఎందుకు చేయవలసి వచ్చిందో చెప్పండి!

గోపాలః— వినండి! ఒకరోజున కమల నా దగ్గఱకువచ్చి అన్నదికదా 'నేను మీకొక అత్యవసరమైన విషయం చెప్పుతాను. ఆ విషయాన్ని గురించి మీరు ఎక్కువ శ్రద్ధ తీసుకోవాలి' అన్నది. అపుడు నేను 'ఏమిటో చెప్పు' అన్నాను. దానిమీదట ఆమె కమలిని మనపట్ల ముఖ్యంగా రాజకుమారులను గూర్చి, కిశోరి, కామినులను గురించీ ఎంతశ్రద్ధ తీసుకొన్నదో మనకందరికీ తెలుసు. కిశోరి కమలిని వల్ల తనకు గలిగిన సాయానికి ఏ విధంగానూ ప్రత్యుపకారం చేయలేనే అని భావిస్తున్నది. అది యదార్థమే. ఒకనాడు కిశోరి తన మనస్సులోనున్న విషయమేమిటో నాతో చెప్పింది. దానిని గురించి ఆమె సంసిద్ధం చేసుకొన్న ప్రణాళికనుకూడా నాకు వివరించింది. వివాహం చేసుకోకుండానే తాను మరణిస్తేకూడా ఫరవాలేదనుకున్నది. అపుడు నేను కిశోరిని ఎన్నోవిధాల చెప్పి ఒప్పించాను అపుడామె 'నా వివాహానికి పూర్వం కమలిని వివాహం ఇంద్రజీతసింహునితో జరిగితే నేను జీవితాన్ని సుఖంగా గడపగలుగుతాను ఆమె నాకుచేసిన సహాయానికి ప్రతిఫలం ముట్టిందికదా అని గుండెలమీది బరువు దించుకొంటాను. కారణమేమంటే ఇంద్రజీతసింహునితో కమలిని వివాహం మొట్టమొదట జరిగితే ఆమె పట్టపురాణి అవుతుంది. ఆమెకు పుట్టినబిడ్డడే ఈ రాజ్యానికి అధికారి అవుతాడు. నేను చిన్నరాణిగా, కమలినికి దాసీగా ఉండి, సంతృప్తి చెందుతాను. ఆనాడే కమలినిపట్ల నాకుగల కృతజ్ఞతా భారం నాపైనుండి దిగిపోతుంది'

చంద్రకాంత :— బాగున్నది.

వీరేం:— అవును. కిశోరి చాలా హుందాగా ప్రవర్తిం చింది. విశాల హృదయంతో ఆలోచించింది.

చపల:— తప్పకుండానూ. ఇదేమన్నా మామూలు విషయమా? విశాల హృదయంగల స్త్రీలు మాత్రమే ఈపని చేయగల్గుతారు. కిశోరి అంతకుమించి చేయగలిగిన త్యాగం కూడా లేదు.

గోపాల:— కమల ద్వారా ఈ విషయం తెలుసుకున్న నేను ఆశ్చర్యచకితుడ నయ్యాను. లోలోన కిశోరిని అభినం దించుకొన్నాను. నాకు నచ్చిందికూడా. అందువలన కమలతో అలాగే జరుగుతుంది అన్నాను. ఐతే ఈపని ఏవిధంగా జరగాలో నాకు దిక్కుతోచలేదు. ఇంద్రజీతసింహుడూ, కమలినీ ఎప్పటికీ ఈ అభిప్రాయాన్ని అంగీకరించరని నాకు తెలును. అంతేగాదు. మహారాజుకూడా ఈ పద్ధతిని అంగీక రించలేరు.

భైరవ:— నిజంగా ఇది చాలా కఠినమైనపని. ఇంద్రజీత సింహుడెప్పటికి అంగీకరించబోడు.

గోపాల:— చాలా రోజులు ఆలోచించినమీదట నేనూ భైరవసింహుడూ కలసి ఏలాగైనా సరే ఈపని చేయాలను కున్నాము. అందుకుగాను లాడిలీ కమలినులకు ఆనంది ఇంద్రాణులుగా మారువేషాలు వేసి ఇంద్రజీతసింహునితోను, ఆనందసింహునితోను వివాహాలు చేయాలి. భగవదనుగ్రహం వల్ల వారు ఇద్దరేకాక, మా మామగారు బలభద్రసింహులు కూడా భూతనాథుని సహాయ్యంతో కారాగారమునుంచి

విముక్తిచెంది ఇక్కడకు వచ్చారు. నేను ఇంద్రజాలము లోపలి భాగముగుండానే ఇక్కడకువచ్చాను. కన్యాదానం చేయటానికి బలభద్రసింహులను ఒప్పించి జమానియాకు తీసుకొని వెళ్ళాను. ఆనాడు భూతనాథుడు చాలా అవస్థలలో ఉన్నాడు. భైరవసింహుడు నావెంటే ఉన్నాడు. మేము ఆ యింటిలో ప్రవేశించి భూతనాథుని బలభద్రసింహులకు వేర్వేరుగా ఒక్కొక్క ఉత్తరంవ్రాసి వారు శయనించినచోట పెట్టి వెళ్ళాము. బలభద్రసింహునికి వ్రాసిన ఉత్తరములో ఒక ఉంగరాన్నికూడా పెట్టాము. ఆ ఉంగరాన్ని ఆయన నాకు వివాహానికి పూర్వం ప్రధానంలో ఇచ్చాడు. ఆ తర్వాత రెండోనాడు తిరిగివచ్చి భూతనాథునికి మమ్మల్ని గురించి పూర్తిగా పరిచయము చేసికొని, బలభద్రసింహులను తీసుకొని వెళ్ళాము. అతనిని ఎందుకుతీసుకొని వెళ్ళుతూఉన్నామో భూతనాథునికి వివరంగా చెప్పి ఎవ్వరికీ ఈవిషయం చెప్పకూడదని హెచ్చరించాము.

గోపాలసింహుడు కొద్దిసేపు ఆగాడు. తిరిగి తన కథనాన్ని కొనసాగించాడు.

"మొట్టమొదట నేను బలభద్రసింహులు మేము చెప్పినట్లుగా వింటారో లేదోనని అనుమానపడ్డాము. కాని ఆయన సంగతి తెలుసుకొని చాలా సంతోషించాడు. కొమార్తెలను కలుసుకొని ఆయన చాలా సంతోషపడ్డారు. మేము అప్పటివరకు అనుభవించిన కష్టాలన్నీ ఆయనకు చెప్పాము. ఆయనకూడా తానుఅనుభవించిన కష్టాలు మాకు తెలియజేసి మేమప్పుడు చేయబోయే పనిలో కలుగజేసుకున్నాడు.

అత్యంత సంతోషంతో ఆయన కొమార్తెలిరువురినీ ఇంద్ర జితానందసింహులకు కన్యాదానంచేశాడు. ఈ వ్యవహారంలో భైరవసింహుడు చాలాకష్టపడవలసి వచ్చింది. చివరకు పెండ్లి కుమారులిరువురు అతనిని కోపగించుకున్నారు. ఎంత బలవంత పెట్టినా అతడు రహస్యాన్ని బయట పెట్టలేదు. వివాహాలు జరిగినతర్వాత వరుల కిద్దరికీ ఈ విచిత్ర వివాహాన్ని గురించిన జ్ఞాపకంలేకుండాఉండే ఏర్పాట్లుచేశాము. ఇంద్రాణిని ఆనందినిని, తిరిగి కలుసుకొనే ఏర్పాట్లుకూడా లేకుండా చేశాము.

ఆతర్వాత గోపాలసింహుడు చాలా విషయాలు చెప్పాడు. ఆ సంగతులన్ని చంద్రకాంతవిని "సరే జరిగిందేదో జరిగింది. మాకుమాత్రం కిశోరి, కామినీ ఎంతో కమలిని, లాడిలీకూడా అంతే. కాని ఈ విషయం కిశోరియొక్క తాత గారు వింటే చాలా నొచ్చుకుంటాడు.

వీరేంద్రుడు:- నాన్నగారుకూడా అదే అంటున్నారు. కాని ఈవిషయంలో కిశోరిమాత్రం చాలా సముచితంగా ప్రవర్తించిందని చెప్పకతప్పదు.

గోపాలసింహుడు:- కమలినికూడా అంత తేలికగా అంగీకరించలేదు. అందుకు మేము వేరే ఉపాయం పన్నవలసి వచ్చింది. ఆమె కిశోరిని తన ప్రాణసమానంగా భావించు కుంటోంది.

చంద్రకాంత:- సరేకాని నాకు వీరివివాహాలు చాలా సామాన్యంగా జరిగిపోవడం చాలావిచారంగానే ఉన్నది.

ఇలాగే ఇంకా కొంతసేపు వారేదో ప్రసంగించుకుం టూనే ఉన్నారు.

# 3

ఇక మనం ఇంద్రజిత్‌సింహుని వృత్తాంతాన్ని గురించి పరామర్శిద్దాం.

కిశోరీ కమలినీ ఆవిధంగా మాట్లాడుకొనడం చూచి ఇంద్రజిత్‌సింహుడు కమలిని తన్ను ఒక ఆట ఆడించిందని గ్రహించాడు. అయినా సందేహనివృత్తికోసం వారినిచూచి "మీ రిద్దరూ నన్ను పరిహాసపాత్రుణ్ణి చెయ్యాలని కంకణం కట్టుకొన్నారా యేమిటి? నన్నెందుకు ఇట్లా ఆడిస్తున్నారు? నిజం చెప్పండి" అన్నాడు.

కిశోరి:— (చిరునవ్వుతో) నిజానికి మిమ్మల్నిచూచి నేను సిగ్గుపడాలి. కాని, కమలా, కమలినికలసి నన్నువివశురాలినిగా చేశారు. ఈనాటి వేళాకోళం తలచుకొన్నకొద్దీ నేను నవ్వకుండా ఆగలేకపోతున్నాను. మీరెందుకలా బాధపడతారు? ఆగండి! తొందర పనికిరాదు. మీ వివాహం నాతో కాదు జరిగింది. కమలినితోనే జరిగింది.

ఇంద్ర:— అదెట్లా! అసంభవమైన ఈసమాచారాన్ని నేను నమ్మలేను.

కమలిని:— ఇప్పుడు మీమనస్సు చాలా చెడిపోయింది. కనుక ఇంకా మిమ్మల్ని ఆడించాలనేకోరిక ఉన్నా మిమ్మల్ని చూచి జాలిపడి విడిచిపెడుతున్నాను. మీ అనుమతి ప్రకారమే మీతో నేను వేళాకోళం ఆడాను. మీ రీ ఉంగరాన్ని గుర్తించగలరా?

ఇంద్రుడు:- ఎందుకు గుర్తించలేను. ఈ ఉంగరాన్ని నేను ఇంద్రజాలంలో ఇంద్రాణికిచ్చాను. కాని పాపం!

కమలిని:- విచారపడతారెందుకు? మీ ఇంద్రాణి మరణించలేదు. ఆమె సజీవంగా మీ కెదుట నిలిచిఉన్నది.

కమలినిమాటలువిని ఇంద్రజీతసింహుడుచాలా సంతోషపడ్డాడు. అతడు కిశోరి, కమలినులచేతులు పట్టుకొని "ఇది నిజమా?" అని ప్రశ్నించాడు.

కిశోరి :- చిత్తం! నిజమే.

ఇంద్రుడు :- అయితే నాకు కనిపించిన ఆ శవాలు ఎవరివి?

కిశోరి:- వాళ్ళిద్దరూ మాధవీ, మాయారాణీమాత్రమే. వాళ్ళుచేసిన పాపఫలితాన్ని ఇంద్రజాలంలోవలనే అనుభవించారు, మీమనస్సులోనుండి ఆ వివాహంసంగతి తుడిచివేయాలనే ఉద్దేశంతో వాళ్ళిద్దరను చంపి ఇంద్రాణి, ఆనంది వేషాలలో మీకు చూపించటం జరిగింది. కాని నిజమైన ఇంద్రాణి మీ సమక్షంలోనే ఉన్నది. ఆనంది వివాహం ఆనందసింహునితో జరిగింది. అటువైపునకూడా ఈసమయంలో ఇటువంటి నాటకమే జరుగుతూ ఉంటుంది.

ఇంద్రుడు :- నీమాటలు నాకు చాలా సంతోషాన్ని కలిగిస్తున్నాయి. అన్నిటికంటె మించి కమలినీ, నీవూ ప్రేమమూర్తులుగా కనిపిస్తూ హృదయం విప్పి అసలు రహస్యాన్ని [illegible]పెట్టినందుకు నాకు మరీ సంతోషంగా ఉన్నది. కాని నీవు నన్ను చాలా మోసంచేశావు. ఇలాంటి వేళాకోళం ఈ భూ మండలంలో ఎక్కడైనా ఎవ్వడైనా జరిగిఉంటుదా ?

కమలిని :- మన సంభాషణలు నిలబడితప్ప జరగవా యేమిటి? కూర్చోటానికి అనుమతించరా?

ఇంద్ర :- ఎందు కనుమతించం. హాయిగా కూర్చుండి సరసోక్తులతో కాలక్షేపం చెయ్యటం తప్ప వేరే మనకూ పని ఏమున్నది?

యువరాజు ఉచితాసనోపవిష్టుడై కమలిని కిశోరిలను తన కిరువైపుల కూర్చుండబెట్టుకొన్నాడు. కమలకూడా కూర్చో బోతున్న సమయంలో వాకిలివైపు అలికిడైంది. వెంటనే కమల బైటకువెళ్ళి తిరిగివచ్చి "భైరవసింహుడు వచ్చాడని దాసి చెప్పుతున్నది" అన్నది.

ఇంద్ర:- అలాగా! శ్రీవారిని వెంటనే లోపలికి రమ్మను. ఆ మహానుభావుడు మాత్రం తక్కువ వేళాకోళం చేశాడా? ఇవ్వేళ నాకన్ని విషయాలూ తెలిశాయి. పోనీ! ఇప్పటికైనా అతడు నాయెదుటకు రాగలిగాడు.

కమల బయటకువెళ్ళి భైరవసింహుణ్ణి వెంటబెట్టుకొని వచ్చింది. కిశోరి, కమలిని కొద్దిగా దూరంగా జరిగి కూర్చు న్నారు.

ఇంద్ర :- రండి! రండి! మహానుభావా! మీరుచేసిన దానికి బదులు తీర్చుకోలేకపోనులెండి!

భైరవసింహుడు నవ్వుతూ కిశోరినిచూపి "నేనేంచేశాను యువరాజా? అన్నీ ఈమే చేసింది. నాదేమీ తప్పులేదు."

ఇంద్ర :- జరిగిందేదో జరిగింది గాని ఇంద్రజాలంలో ఈ బావతు వివాహాలకు అధ్వర్యం వహించింది ఎవరో సెల విప్పించండి.

భైరవ :- చేసిందంతా కిశోరీదేవి. ఈమెకు గోపాలసింహ మహారాజు సహాయం చేశాడు. ఆయన ఆజ్ఞ ప్రకారం నాకూ ఈ వ్యవహారంలో సంబంధం కలిగింది. కమల ఈ విషయాలన్నీ వివరంగా చెప్పగలుగుతుంది.

ఇంద్ర:- కమలా, నీవే చెప్పు పోనీ—

కమల :- చెప్పమంటావా కిశోరీ?

కిశోరి:- ఇంకా దాచవలసిన అవసరం ఏముంది?

కమల ఈ విధంగా చెప్పసాగింది.

"ఒకసారి నాతో కిశోరి 'ఏవిధంగానైనా ఇంద్రజిత సింహ యువరాజుతో కమలిని వివాహం నాకంటే ముందుగా జరిపే యేర్పాటు చెయ్యి' మని చెప్పింది. కాని ఈ పని నావల్లనే జరగలేదు. కమలిని ఈ విషయాన్ని సుతరామూ అంగీకరించలేదు. అందుచేత నేను మౌనంగా ఉండిపోయాను. అప్పుడు కిశోరి నేనేవిధమైన ప్రయత్నమూ చెయ్యకుండా ఉండటం చూచి నీవు నేను చెప్పినట్లు చెయ్యకుండా ఊరకున్నట్లయితే ఉరి వేసుకొని చావవలసి వస్తుంది' అని హెచ్చరించింది. అంతే గాక ఆమె తనపట్ల కమలిని చేసిన ఉపకారానికి ప్రతిఫలంగా ఈ పని చెయ్యాలని చూచింది. ఆమె దృఢనిశ్చయాన్ని చూచి నేను భయపడ్డాను. గోపాలసింహ మహారాజు ద్వారా కూడా ఆమెకు చెప్పించి చూచాను. కాని లాభం లేకపోయింది.

"అప్పుడు గోపాలసింహ మహారాజు కమలినితో ఈ విషయం చెప్పాడు. ఆమె యువరాజును వివాహమాడటానికి ఒప్పుకొన్నది గాని పట్టపురాణి పదవిని స్వీకరించటానికిమాత్రం అంగీకరించలేదు. అప్పుడు గోపాలసింహుడు కమలినిని 'నీవు

కిశోరి మనోభీష్టాన్ని నెరవేర్చటానికి సంసిద్ధురాలివి గాకపోతే ఆమె ఆత్మహత్య చేసుకొంటుంద'ని చెప్పారు. కిశోరి మరణం యువరాజు కెంతబాధాకరమోకూడా వివరించారు. అప్పుడు కమలిని నిరుత్తరురాలైంది. వెంటనే వివాహపు ఏర్పాట్లు జరిగాయి. భైరవసింహులనుకూడా ఆ మహారాజు తమకు సహాయంగా తీసుకొన్నాడు. యువరాజులు అంగీకరించబోరనే విషయం అందరికీ తెలుసు. అందుచేత మాయోపాయంతో ఇంద్రజాలంలోనే ఈ వివాహం జరిపివెయ్యాలనుకొన్నారు. వృద్ధసాధువు వేషంలో గోపాలసింహ మహారాజు మిమ్మల్ని నమ్మించారు. నేనేమో ముసలిదాని వేషంవేశాను. కిశోరి ఇందిరా మొదలైనవాళ్లు చెలికత్తెల వేషాలలో మీకు ఇంద్రజాలంలో కనిపించారు.

కమలిని:- ఈ ముసలిది భైరవసింహుని భార్యగా నటించింది.

ఇంద్రుడు:- అయితే భైరవసింహుడు మా కందరికీ చెప్పిన విషయమంతా అబద్ధమేనా ?

కమల:- అవును. ముప్పాతిక భాగం అబద్ధమే!

ఇంద్ర :- తరువాత ఏం జరిగింది.

కమల తిరిగి చెప్పసాగింది.

"భైరవసింహులు ఉన్మత్తవేషంలో మీ కెందుకు కనిపించారంటే ఆ ఇంద్రజాలంలో మీ విరోధులుకూడా ఉన్నారని మీకు నమ్మకం కలిగించటానికే. మేము ఇంద్రజాలంలో ప్రవేశించినప్పుడు గోపాలసింహుడు తమ దగ్గరఉన్న ఇంద్రజాల గ్రంథాన్ని కమలినిచేతికిచ్చాడు. అందుచేత ఆమెకు ఇంద్రజాల

విశేషాలు చాలావరకు అర్థమయ్యాయి. ఆమె సహాయంతో మేము ఏమి చెయ్యాలనుకొంటే అదిచేస్తూ ఉండేవాళ్ళం. మా భోజనాదులను గోపాలసింహ మహారాజు అందజేస్తూ ఉండేవారు.

"భైరవసింహులు ఉన్మత్తవేషంలో మిమ్మలను కలుసుకొన్నప్పుడు ఆయనకావాలనే తన మాయాజాలం సంచిని కమలినికిచ్చారు. భైరవసింహులను పిలవాలనుకున్నప్పుడు ఆ సంచి విషయమై తగాదా పెట్టుకొని మీనుండి ఆయనను వేరు చెయ్యటం జరిగింది. కమలిని నేనూ తగాదా పడుతున్నప్పుడు మీరు మమ్మల్ని చాలా గట్టి తగాదాకోరులని భావించి ఉండాలి. ఇంద్రాణి ఆనందీఉన్న తోటలో మిమ్మల్ని భైరవ సింహులు కలుసుకొన్నప్పుడు ఆయనపైన మీరు కోపగించు కొన్నారు. అందుచేత ఆయన మిమ్మల్ని విడిచిపెట్టి వెళ్ళి పోయారు. మీ సోదరు లిద్దరూ వివాహం చేసుకోటానికి విముఖత్వాన్ని ప్రదర్శించినప్పుడు ఇంద్రాణి, ఆనంది కామిని వ్రాసిన ఉత్తరాన్ని చూపించి మిమ్మల్ని వివాహానికి సుముఖులుగా చేసుకొన్నారు. ఇక్కడకు వచ్చినతర్వాత మాతండ్రివల్ల కారాగార విముక్తులయిన బలభద్రసింహులు చాలాకాలం వరకూ కనిపించకుండా వుండి ఆ తర్వాత తిరిగి వచ్చారని మీరు విన్నారుగదా?"

యువరాజు:- విన్నాను.

కమల:- ఆయనను గోపాలసింహ మహారాజే తీసుకొని వెళ్ళారు. స్వయంగా బలభద్రసింహులే తమ కొమార్తెలను మీ కిద్దఱకూ కన్యాదానం చేశారు.

యువరాజు:- అవునవును. ఇప్పుడన్నీ సంగతులూ తెలుస్తున్నాయి. నన్ను మోసగించాలనే ఉద్దేశంతోనే మీరు అంతకుముందే మాధవి మాయారాణుల శవాలకు ఆనంది ఇంద్రాణుల వేషాలు వేసి నాకు చూపించారు. సరేగాని నానక్ అక్కడి కెందుకు వచ్చాడు.

భైరవ:- తారాసింహుడు నానకును ఏ విధంగా పీడించిందీ మీరు విన్నారు. అందుచేత అతడు మాపై పగ సాధించాలనే ఉద్దేశంతో అక్కడికి వచ్చి మాయారాణితో చేతులు కలిపాడు. కమలిని అతనికికూడా త్రోవ చూపించింది. మాయారాణి గోపాలసింహ మహారాజు చేతిలో చిక్కినప్పుడు నానకుకు మహారాజు ఎన్నో విధాల చెప్పి చూచారు. అందు చేత నానకు గోపాలసింహ మహారాజు పాదాలమీదపడి క్షమాభిక్ష వేడుకొన్నాడు. మహారాజు క్షమించి అతనిని తనతోపాటు చేర్చుకున్నారు. అందుచేతనే అతడు మిమ్మల్ని మాయచేద్దామనే ఉద్దేశంతో మాధవి, మాయారాణుల శవాలదగ్గర మీకు కనిపించాడు. ఆ తర్వాత జరిగిన విషయా లను మీరు గోపాలసింహ మహారాజు ముఖతః వినవచ్చు.

యువరాజు:- ఈ వేళవరకు నా మనస్సులో గూడు కట్టుకొనిఉన్న ఇంద్రాణ్యానంగుల పట్లగల విచారం ఇప్పుడు తగ్గిపోవ నారంభించింది. (కమలినితో) సరేగాని రాత్రి జరిగిన కోలాహలం నువ్వెట్లా చేశావో చెప్పు? నాకు మారు వేషం ఎలా వచ్చిందో అర్థం కావటంలేదు.

కమలిని:- కమలను అడగండి.

కమల:- అదేమంత గొప్పవిషయం కాదు. మీరు నిద్రిస్తున్న సమయంలో కమలిని మీకు స్పృహలేకుండా చేసి వేషం మార్చివేసింది.

అక్కడ లాడిలికూడా ఇదేపనిచేసింది. మొదట కామిని వలె ఆనందసింహునికి కనిపించి అతడు నిద్రపోతున్న సమయంలో వేషం తుడిచివేసుకొని లాడిలిగా మిగిలిపోయింది.

యువరాజు :- అలా ఎందుకుచేసింది ?

కమల :- మిమ్మల్ని తమాషాచేద్దామనే ఉద్దేశంతోనే గాక మొట్టమొదటజరిగిన వివాహంగనుక కిశోరి అని మిమ్మల్ని భ్రమింపచేసి మీతో పట్టపురాణి బాధ్యతను కమలిని నెరవేర్చుకొన్నది.

యువరాజు :- సరే; ఇదంతా కిశోరి ప్రతాపమన్న మాట ! చూస్తాగా ఈ రాత్రి ఆమె వంతెక్కడికిపోతుందో !

కిశోరి సిగ్గుతో తలవంచుకొన్నది. ఆ తర్వాత అందరు ఎక్కడివారక్కడ వెళ్ళిపోయారు.

రాజకుమారుల వివాహాలు పూర్తి అయిన తర్వాత భైరవసింహునికి కమలతోను, తారాసింహునికి ఇందిరతోనూ వివాహాలయినాయి. ఈ బంధుత్వాన్ని భూతనాథుడూ ఇంద్రదేవుడూ హృదయపూర్వకంగా అంగీకరించారు.

అటుపిమ్మట మహారాజు శిలాతటి ఉన్న ఇంద్రజాలంలో అపరాధుల విచారణ ప్రారంభించాలనుకొన్నాడు. ఆ ప్రకారంగానే బంధువులందరనూ పంపిన తర్వాత అక్కడికి వెళ్ళి న్యాయవిచారణ ప్రారంభించాడు. ఖైదీల నందఱనూ అక్కడికే తీసుకొనివెళ్ళి చీకటికొట్లలో పడవేశారు.

# 4

ఇప్పుడు దేశబహిష్కృతులయిన నానక్ రామదేవు లను గురించి తెలుసుకొందాము.

మహారాజు వారినిద్దరిని కనికరించి విడిచిపెట్టడం సాధారణంగా ఎవరికీ ఇష్టములేదు. మహారాజు ఆవిధంగా చెయ్యటం వలన ప్రతిఫలం అనుభవించవలసి వస్తుందని అందరూ అనుకొంటూ వచ్చారు. చివరకు అల్లాగే అయింది. నానక్ తనకు జరిగిన మేలుని విస్మరించి జనసామాన్యాన్ని నాశనం చెయ్యటానికి సంసిద్ధుడయాడు.

సరిహద్దులను దాటించి ఇంద్రదేవుని మనుష్యులు తిరిగి వెళ్ళిన తరువాత తల్లి కొడుకులిద్దరు ఒక చెట్టుక్రింద కూర్చుండి ఏమిచెయ్యాలా అని ఆలోచించారు. అప్పుడు తెల్లవారుతున్నది. జీవులలో అంతవరకూ సుప్తమైఉన్న వాసన ఉద్బుద్ధమైనది. విధాతృమూర్తి అయిన ఉదయభానుడు పూర్వపర్వత శిఖరాలను అలంకరించాడు.

రామదేవి :- మనమిపుడు చాలా కష్టాలలో చిక్కుకొని వున్నాం. ఏంచేద్దామో చెప్పు.

నానక్ :- మనల్ని ఎందుకూ పనికిరాకుండా చేసిపారవేశారు. నీదగ్గరి నగలు తీసుకొన్నారు సరిగదా నా ఆయుధాలనుకూడా లాగుకున్నారు. మనమిప్పుడు కనీసం బ్రతకటానికి కూడా వీలులేని పరిస్థితులలో వడ్డాము.

రామదేవి:- అవునుగాని, మనం ఏదో ఒకరకంగా ఒకఇంటికి చేరుకొంటే అక్కడ మనకు తగినంత ఆదరణ లభిస్తుందనే విశ్వాసం నాకు కలుగుతోంది.

నానక్ :- ఆమెదగ్గరకువెళ్ళితే ఏం ప్రయోజనం? బహుశః ఆమెను ఖైదులో వేసిఉంటారు. అయితే ఆమె మేనల్లుడు బయటనే ఉండిఉంటాడు. అతడు నన్హాకో ఆ స్త్రీకి యజమానిగా ఉండేఉంటాడు. కాని అతనియందు నాకు విశ్వాసంలేదు.

రామదేవి:- కాని నన్హాకో పరిచారికలలో ఒకరిద్దరు నాకు సాయపడేవాళ్ళున్నారు.

నానక్:- అబ్బే! నాకు వాళ్ళమీద విశ్వాసంలేదు. ఇంతకూ మనకు ఇప్పుడు ప్రాణాలునిలిచే ఆధారంకూడా లేనపుడు అక్కడిదాకా ఎలా చేరుకొంటాము.

రామదేవి:- నన్ను మనయింటికి తీసుకువెళ్ళావంటే అక్కడ డబ్బు చాలాఉన్నది.

నానక్ :- అక్కడకు వెళ్ళటానికి పర్వాలేదుకానీ, తిరిగి ఏమి కష్టాలువస్తాయోనని నాకు భయంగాఉన్నది. చివరకు నాదగ్గరఉన్న మాయాజాలం సంచికూడా లాగుకొన్నారు. అదైనాఉంటే మారువేషాలతో అక్కడకు వెళ్ళగలిగే వాళ్ళము.

రామదేవి:- అయిందేదో అయింది. నాదగ్గర ఇపుడు కొద్దిగా బంగారం ఉన్నది. దానితో...

నానక్ ఆశ్చర్యపడి "ఏమీ! బంగారం ఉన్నదా?"

"ఉన్నది." అనిచెప్పి రామదేవి తనదగ్గర రహస్యంగా దాచిన బంగారాన్ని నానక్ ముందుంచింది.

నానక్ :- (బంగారాన్ని తీసుకొని) అబ్బో! చాలా ఉన్నదే! మనము ఇంటికి వెళ్ళేవరకు ఇది సరిపోతుంది. అక్కడకు చేరుకొంటే మనకు ఏమీ ఇబ్బందివుండదు.

రామదేవి:- అక్కడకువెళ్ళి ఈ విషయాలు మరచి పోతావా?

నానక్ :-ఎందుకు మరుస్తాను. అక్కడకు చేరుకొని శత్రువులను ఏవిధంగా ఎదిరించాలో ఆలోచిస్తాను.

రామదేవి:- నా ఉద్దేశమూ అదే! నీ తండ్రినిచూస్తే నాకు చాలా అసహ్యంవేస్తున్నది. అతడు మనలను దూరంగా నెట్టివేశాడు. శాంతనూ, హరనామసింహుణ్ణి ఒడిలో కూర్చోబెట్టుకొని కులుకుతున్నాడు. చివరకు నీవు అతని కడుపున పుట్టావని అయినా ధ్యానం లేకపోయింది.

నానక్ :- నిస్సందేహంగా ఆయన చాలా ద్రోహం చేశాడు. ఆయన తలచుకుంటే మనల్ని రక్షించగలిగేవాడు.

రామదేవి:- అతడెక్కడ మనల్నిరక్షిస్తాడు. మనల్ని గురించి ఏమి చెయ్యటానికైనా మహారాజు అతనికే అధికారమిస్తే సిరాక్షిణ్యంగా మనల్ని అతడు దేశంనుండి వెడలగొట్టాడు.

నానక్ :- ఈవిధంగా చేసినందుకు ఆయనకు తగినశిక్ష విధించి [illegible] కేను విడచిపెట్టను.

రామదేవి:- నీ ఉద్దేశం క్షణికమైనది. నిన్ను నమ్ముకొంటే [illegible] క్క డ కుదురుతుంది?

తల్లి పాదాలను స్పృశిస్తూ నానక్ "అమ్మా నీపాదాల సాక్షిగా నేను నా తండ్రిమీద పగసాధించుకొంటానని ప్రమాణంచేస్తున్నాను" అన్నాడు.

రామదేవి:- చూస్తాగా నాఉద్దేశంలో అతనిని చంపినా పాపంలేదు.

నానక్: నీవు చెప్పినట్లే చేస్తాను. ఆయననేకాదు, ఆయన కుమారుడైన హరనామసింహుణ్ణికూడా యమలోకానికి పంపిస్తాను.

రామదేవి:- భలేవాడవురా! అంతేకాదు శాంతశిరస్సు మొండెమునుండి వేరైనపుడే నా కళ్ళు చల్లబడతాయి.

నానక్:- ఆ విధంగానే ఆమె తలకాయను నీ పాదాల ముందు తెచ్చి పెడతానమ్మా! ఇక్కడనుండి ఇక బయలు దేరు! ఆ కనిపించే ఊళ్ళోకి వెళదాం.

ఇద్దరూ దగ్గఱలో కనిపిస్తూఉన్న గ్రామం దిక్కుగా పయనం సాగించారు.

# 5

ఇంటికి చేరుకొన్న తరువాత నానక్ ఏ మాత్రమూ విశ్రాంతి తీసుకొనలేదు. మాయాజాలం సంచిని సిద్ధపరచుకొని నలుగురైదుగురు మనుష్యులను వెంటపెట్టుకొని ఆనాడే చునారగఢం దిక్కుగా ప్రయాణమయ్యాడు. రాజకుమారుల యొక్క పెండ్లినాటికి అతడు చునారగఢపు సరిహద్దులను చేరుకొన్నాడు. ఆ పెండ్లి సందడిలో ఖైదీలను కొందరిని విడిపించి తనకు సహాయులుగా చేసుకోవాలనుకున్నాడు. వీలుంటే

గోపాలసింహ మహారాజునుకూడావధించాలని అతనికి దురాలో చన కలిగింది.

అది మధ్యాహ్న సమయం. అందరూ భోజనాలుచేసి విశ్రాంతి తీసుకొంటున్నారు. ఒక గదిలో గోపాలసింహుడూ, భరతసింహుడూ, ఆనందసింహుడూ, భైరవసింహుడూ, తారా సింహుడూ కూర్చుండి ఏదో లోకాభిరామాయణం చెప్పు కొంటున్నాడు.

భరతసింహునితో గోపాలసింహుడు "కలలోకూడా నేను మిమ్ములను కలుసుకొంటానని అనుకోలేదు. లోకం అనుకొంటున్నట్లు అడవిలో దొంగల చేతులలో మీరు చని పోయారనే అనుకొన్నా" నన్నాడు.

భరతసింహుడు :- దానికి కారణం మీరు వృద్ధసాధు వును విశ్వసించటమే. అతడే నన్ను ఖైదులోపెట్టాడు.

గోపాలసింహుడు :- అవును. కాని భగవదనుగ్రహం ఉండాలేకాని ఒకరు చెరిపితే మనము చెడతామా? మాయా రాణి మట్టుకు మాయారాణి ఎంతచేసింది! ఐనా నేను ప్రాణా లతో బయటపడ్డాను. తిరిగి అందరము ఒకచోట చేరు కొన్నాము.

భరతసింహుడు :- అవును. కాని, సాధువు నన్ను చాలా కష్టపెట్టాడు. ఇంతచేసి అతడు తనను నిర్దోషిగానే ఋజువు చేసుకోవాలని చూస్తున్నాడు. నా జీవితవృత్తాంతం చెప్పు తూన్నపుడు మీరే ఈ ప్రపంచములో ఎటువంటి విశ్వాస ఘాతకులుంటారో, దుర్మార్గులుంటారో, తెలుసుకుందురుగాని,

అంతేగాక చెడ్డవారికి మేలుతలపెట్టిన ఫలితాన్ని కూడా మీరు తెలుసుకోగలుగుతారు.

గోపాలసింహుడు :— అవునయ్యా ! అందుకనే మాటి మాటికీ భైరవసింహుడు నానకును విడచిపెట్టినందుకు నన్ను ఎత్తిపొడుస్తూన్నాడు.

భరతసింహుడు :— అవును నిజమే ! నా వుద్దేశంకూడా అదే.

భైరవసింహుడు :— నిజం చెప్పాలంటే నానకును గురించి నేనే మాత్రం నిశ్చింతగా ఉండలేకపోతున్నాను.

ఆసమయములో భూతనాథుడు అక్కడకు రావటం కనిపించింది.

గోపాలసింహుడు :— ఏమయ్యా భూతనాథా ! మీ దర్శనంకోసం నాలుగైదుసార్లు కబురుపంపించవలసి వచ్చిందేం?

భూత:— (చిరునవ్వుతో) ఇప్పుడే యేమయ్యిందండీ. ఇంకా నాలుగైదు రోజులు గడిస్తే నా దర్శనభాగ్యమే దుర్లభమైపోతుంది.

గోపా:— ఎందుచేత?

భూత:— ఎందుచేతనంటే నా ప్రియపుత్రుడు నానక్ పట్టణానికి చేరుకొన్నాడట. ఎలాగైనాసరే తనచేతులమీదుగా నా అంత్యక్రియలు చేసిగాని తిరిగి వెళ్ళడట. దయచేసి మీరు కూడా సావధానంగా ఉండండి.

గోపాల:— దురుద్దేశంతో అతడిక్కడికి వచ్చాడని నీ కెట్లా తెలిసింది?

భూత:- నాకు విశ్వసనీయంగానే తెలిసింది. అందుకే నేనిక్కడకు రావటానికికూడా ఆలస్యమైంది. మహారాజుగారి దగ్గరకు వెళ్ళి యీ పరిస్థితులన్నీ తెలియజెప్పి నాలుగైదు రోజులు సెలవుతీసుకొన్నాను.

గోపాల:- మిమ్మల్ని రక్షించుకోటానికి ఎటువంటి ఏర్పాట్లు చేసుకొన్నారు?

భూత:- నేను వేరొకమార్గంలో అతన్ని సాధించాలను కొన్నాను. తండ్రీకొడుకుల యుద్ధాన్ని మీరు కాస్తదూరంగా ఉండిచూడండి. కాని మీమీదకుకూడా అతడు కాలు దువ్వి నట్లయితే మీరే ఉపాయంతో అతన్ని యెదుర్కొంటారో అది మీయిష్టం.

గోపాల:- నీమాటలనుబట్టి చూస్తుంటే అతడేదో మహావిప్లవాన్ని ప్రారంభించినట్టుగానే అనిపిస్తోంది. అయినా నిన్న మొన్నటి కుఱ్ఱవాడు మనల్ని ఏం చేయగలడు ?

భూత:- అయినా శత్రువును మనం తక్కువ అంచనా వెయ్యకూడదు.

గోపాల:- నీకంతభయమే గనుక ఉంటే నాతో చెప్పవే ఇక్కడ కూర్చుంటే అతని కాళ్ళూచేతులూ కట్టి నీముందు పడవేయిస్తాను.

భూత:- మీరలా చెయ్యగలరనటంలో నాకేమాత్రం సందేహంలేదు. అయినా ఈపని నాచేతికే వదలండి.

గోపాల:-నీయిష్టంవచ్చినట్లుగానే చేద్దువుగాని ఇంతకూ ఏం ఉపాయం ఆలోచించావు?

ఆతర్వాత చాలాసేపటివరకూ వారి మధ్య సమాలోచ
నలు జరిగాయి. భూతనాథుడు తన నివాసానికి బయలు
దేరాడు.

## 6

చునారగఢాన్ని చేరుకొన్న నానక్ శత్రువులను
నిర్జించే ఉపాయాలనుగురించి ఆలోచిస్తున్నాడు. అతడు ఐదు
గురు మనుష్యులను ఏవిధంగానైనా యమపురికి చేర్పించాలని
నిశ్చయించుకొన్నాడు. ఆ ఐదుగురు గోపాలసింహుడూ, భూత
నాథుడూ, హరనామసింహుడూ, ఇంద్రదేవుడూ, శాంతనూ
కాని ఈ ఐదుగురిలో ఇంద్రదేవుడు గోపాలసింహుడు అంటే
నానక్‌కు చాలాభయం. వీరు ఐంద్రజాలవ్యక్తులని నానక్
భయం. అందుచేత ఈ ఇద్దరూ ఏపనిచేసినా గారడీచేసినట్లు
చేసివేస్తారనీ, ఇతరులమనస్సులలో ఎటువంటి అభిప్రాయా
లున్నాయో పసిగట్టగలరనీ, అతని నమ్మకం. మిగిలిన ముగ్గురినీ
తేలికగానే సాధించవచ్చునని అతనిఊహ. అందుచేత ప్రస్తుతం
ఈముగ్గురిపని పట్టించాలని అతడు నిశ్చయించుకొన్నాడు. అతని
వెంట దాదాపు యేడెనమండుగురు వచ్చిఉన్నారు.

రాజకుమారుల వైవాహికోత్సవాలను తిలకించటానికి
చాలామంది సాధువులు సన్యాసులుకూడా వచ్చారు. వీరికంద
రికీ ప్రభుత్వంవారు ఉచిత భోజనసౌకర్యాలను ఏర్పాటు
చేశారు. కమ్మని భోజనాలు యేర్పాటులను వదలలేక యీసాధు
సన్యాసులు ఇంకా చునారగఢ నగర పరిసరాలలోనూ, ఇంద్ర
జాల సమీపాటడవులలోనూ డేరాలు వేసుకొని మకాంవేశారు.

నానక్‌తోపాటు అతని అనుయాయులుకూడా ఈ సాధువుల గుంపులో మారువేషాలతో తిరుగుతున్నారు.

భూతనాథుని నివాసం ఇంద్రజాలపు ఆవరణలో అత్యంత సురక్షితంగా ఉన్నదని నానకుకు తెలుసు. అందుచేత ఆ ప్రదేశాన్ని చేరుకోవటం ప్రమాదకరమని అతడు అనుకొన్నాడు. కాని అతడక్కడకు చేరుకొన్న తర్వాత భూతనాథుడు కుటుంబ సహితంగా ఇంద్రజాలం వెలుపల ఒక సుందరతరమైన డేరాలలో కాపురముంటున్నాడని తెలిసింది. అప్పటికే మహారాజు ఇంద్రజాలంలోపలికి న్యాయవిచారణకొరకు వెళ్ళిఉన్నాడు. నానక్ తనపని సుసాధ్యం కాగలదని చాలా సంతోషించాడు.

రోజులుగడుస్తున్నాయి. నానక్ సమయంకోసం ఎదురు చూస్తున్నాడు. భూతనాధుని నివాసానికి పహారా తగ్గించటం జరిగింది. అతని అనుయాయులుకూడా అక్కడలేరు.

అది అర్ధరాత్రి సమయం. వెన్నెలరాత్రి కాకపోయినా నీలాకాశంలో తారాగణం యామినీ కామినీ కైశ్యసమలంకృత మల్లికానికురుంబలంలాగా తేజరిల్లుతున్నది. తమోవృత మానవజీవితంలో మినుకుమినుకుమనే ఆశాజ్యోతి పుంజ యేమో అనిపిస్తున్నది. ఆసమయంలో ఒక ముసుగుమానిసి ఇతరులకంటబడకుండా భూతనాధుని నివాసంవైపు వెళ్ళు తున్నాడు.. అతడు నానక్ భూతనాధుని ఇంటిని సమీపించి తనకు సంబంధించిన సంకేత ధ్వని విని ఎవనికోసమో నిల బడ్డాడు. అప్పుడొకవ్యక్తి అతనిని సమీపించి ఏదో చెప్పి వెళ్ళిపోయాడు. ఆతర్వాత నానక్ నేలమీద దేకుతూ డేరాలో ప్రవేశించాడు. తానున్న చోటు చీకటిగా తని

పించినప్పటికి అతనికి కొద్దిదూరంలో కొంచెం వెలుతురు కని పిస్తోంది. ఇంతలో ఏదో చప్పుడైంది. నానక్ వెంటనే ఒక తెరచాటుకు పోయి దాగుకొన్నాడు. తిరిగి ఎటువంటి శబ్దమూ కానందువల్ల బయటికివచ్చి వెలుతురున్నచోటికి వెళ్ళాడు. అక్కడ మంచంమీద భూతనాథుడు, అతని భార్య పడుకొని ఉన్నారు. హరనారసింహుడుమాత్రం లేడు. అతడు లేకపోవటం నానక్‌కు విచారం కలిగించింది.

నెమ్మది నెమ్మదిగా భయపడుతూ నానక్ మంచం దగ్గరకువెళ్ళాడు. వెంటనే కత్తి తీసుకొని ఆ నిద్రావశుల నిద్దరినీ వధించాలనుకొన్నాడు. అయితే మొట్టమొదట ఆ యిద్దరిలో ఎవరిని హతమార్చాలో అతడు నిశ్చయించుకోలేక పోయాడు. భూతనాథుడూ, శాంతా తలనుండి కాళ్ళవరకూ ముసుగుదన్ని ఉన్నారు. ఆ యిద్దరిలో ఎవరు భూతనాథుడో ఎవరు శాంతో తెలియటంలేదు. దీపాన్ని ఆర్పివేయాలా అవ సరంలేదా అనే వితర్కంలోకూడా నానక్ పడ్డాడు. చేతిలో కత్తి సంసిద్ధంగా ఉన్నప్పటికి అతనిలోనిబలహీనత ఒక్కసారిగా పెల్లుబికింది. అతని చెయ్యి వణకసాగింది.

## 7

కిశోరీ, కామినీ, కమలినీ, లాడిలీ, పరస్పర ప్రేమాద రాలతో కాలం వెళ్ళబుచ్చుతున్నారు. వాళ్ళ మధ్యగల ప్రేమ కృత్రిమమైనదికాదు. హృదయపూర్వక మైనట్టిది. వారికి ప్రపంచానుభవంలో లోపమేమీలేదు. జీవితం సుఖదుఃఖ సమ్మిశ్రితమైనదిగా వాళ్ళు బాగా గ్రహించారు. అందులో

దుఃఖం అనేది కోరకుండానే లభిస్తుందని సుఖం ఆశించినా అందకుండా పోతుందనీ అనుభవంలో గ్రహించ గలిగారు. అందుచేతనే పెద్దలు ధర్మాన్ని సంప్రాప్తింపచేసేవనులు తప్ప దుఃఖాన్ని కొని తెచ్చేవాటికి సాధ్యమైనంత దూరంగా ఉండా లని ప్రబోధించారు. పరుల సుఖంచూచి ఓర్వలేని అసూయా పరులైన స్త్రీలవలెగాక యీ నలుగురు స్త్రీలు ఈర్ష్యాద్వేషా లను వదలి నిర్మలమైన జీవితాన్ని అనుభవిస్తున్నారు.

నిజానికి ఈ నలుగురి హృదయాలూ అద్దంవలె పరిశుద్ధ మైనవి. కాదు, కాదు. వీరి హృదయాలను అద్దానికి పోల్చ టం ఏ మాత్రం సరిగాదు. ఏ వస్తువు ఎటువంటి పరిస్థితుల లోనూ మార్పు చెందకుండా వుంటుందో అటువంటి వస్తువునే వీరి హృదయాలతో పోల్చాలి. కాని అద్దం అటువంటిది కాదు. దానిని పరిశుద్ధపరుస్తూ ఉండాలి. లేకపోతే మన ముఖాలు కనిపించవు. అంతేగాక అద్దంలో ఎవరిముఖమైనా ఏవిధంగా ఉంటుందో ఆ విధంగానే కనిపిస్తుంది. అనగా ఎదుటి వారిని బట్టి అది తనలో వారి ప్రతిబింబాన్ని చూపుతుంది. అందుచేత అద్దాన్ని ఎటువంటివారికి పోల్చాలంటే ఎవరు లోకములో ఎవరు ఎదుటివారి ప్రవర్తననుబట్టి తమ ప్రవర్త నలో మార్పు తెచ్చుకొంటారో వారి హృదయంతోనే సరి పోల్చాలి. కాని ఈ నలుగురు స్త్రీలూ అటువంటివారు కారు. తమకంటె వయస్సులో పెద్దలైన వారి వ్యతిరేకతను ఆశీర్వా దంగాను, పిన్నల ధూర్తతను వాళ్ళు తెలియనితనంగానూ భావిస్తారు. తమ చెలికత్తె లెవరైనా కోపంతో ముఖాన్ని వికృతంగా చేసుకొని యెదుటపడితే నగుమోముతో "మీా

ముఖం ఎంత అందంగా ఉన్నది" అనో, లేకపోతే "సోదరీ!
నీకు మేమేదైనా చెరుపుచేస్తే చేశామే అనుకో! ఆయినంత
మాత్రంచేత నీరూపు ఏంపాపం చేసిందని దాన్ని నీ చేజేతులా
వికృతపఱచావు?" అన్నైనా అంటారు. అంతలో ఎదుటివారి
రూపం మారిపోతుంది. అందుచేత ఈ నలుగురు స్త్రీల హృద
యాలు 'సముద్రంవలె గంభీరమైనవి' అనవచ్చు.

వీరికి తాము ధనవంతులమనే స్మృతే లేదు. అందుచేత
శరీరంవంచి పని చెయ్యటానికి ఎప్పుడూ సంసిద్ధులుగానే ఉండే
వారు. గృహలక్ష్ములుగా సంసారానికి శోభను చేకూర్చేవారు.
అన్నిటికంటే మించి పతులే దైవతాలన్న పరమపవిత్రభావం
స్థిరీకరించుకొనటానికి ఎనలేని కృషి చేసేవారు. చంద్రకాంతా
మహారాజ్ఞినిగురించి వేరుగా చెప్పనవసరంలేదు. ఆమె చంపనూ,
చపలనూ, అత్తగారివలెనే గౌరవించేది. దాసీజనం ఆమె
సొంతగానో గౌరవించేది. ఒకవేళ పరిచారికలలో ఎవరైనా
ఏమరుపాటున తప్పుచేస్తే వారిని దూషించటం, శిక్షించటం
వంటిదేమీ చెయ్యక అలా చెయ్యటం తప్పని ఓర్మితో ఉప
దేశమిచ్చేది. అందుచేత పరిచారికలు తమతప్పుల గుర్తిస్తూ
ఉత్తరోత్తరా అటువంటి లోపాలు రాకుండా సర్దుకొనేవారు.
చంద్రకాంతా మహారాజ్ఞి ముఖం ఎల్లప్పుడూ పూర్ణిమా
చంద్రబింబంవలె ప్రకాశమానంగా ఉండేది. ఉదాసీనత అనేది
ఆమె ముఖంలో కనిపించిందంటే ఏదో బ్రహ్మాండమైన వుప
ద్రవమే జరిగిఉండాలి. తన భర్త కష్టాలలో తలమునుకలై
ఉన్న రోజులలో ఈమె చింతాక్రాంత వదనయై ఉన్నమాట
వాస్తవమే. అయినా భర్తయెదుట ఆమె యెప్పుడూ తన

దుఃఖాన్ని బయటపెట్టలేదు. అతనికి సంతోషాన్ని కలుగ చెయ్యటానికి తన చింతను దిగమ్రింగేది. అందుచేత చంద్ర కాంత ఆ యింటి సౌభాగ్యలక్ష్మిగా పేరొందింది.

చంద్రకాంతకు భూతనాథుని భార్యయైన శాంతమీద ఎక్కువదృష్టి ఉండేది. ఆమెకు పతిభక్తిని ఇనుమడింపజెయ్యా టంలో శక్తివంచనలేని కృషిని చేసేది.

జీవితంలో చంద్రకాంత యెన్నెన్నో విపరీతమైన కష్టా లను అనుభవించింది. దేవుని దయవల్ల నేటికి ఈమె కష్టాలన్నీ గడిచి గట్టెక్కి సుఖజీవనం చేస్తోంది.

ఇంకా ప్రొద్దుక్రుంకటానికి ఒకగంట సమయమున్నది. పశ్చిమాద్రికి త్వరత్వరగా ప్రయాణం చేస్తున్న సూర్యభగ వానుని యెఱ్ఱని కిరణాలు ప్రకృతికి మేలిమిపూత పూసినట్లయి. సంధ్యాదృశ్యం ఆనందదాయకంగా ఉన్నది. ప్రకృతిలోని సర్వచరాచర వస్తువులూ బంగారు కిరీటాలను ధరించినట్లు మనోహరంగా ఉన్నాయి. ఆ సంధ్యాసమయపు ప్రకృతి సౌంద ర్యాన్ని కిశోరీ, కామినీ, కమలినీ, లాడిలీ, కమలా సౌదాంత ర్భాగంలోని ఒకగది కిటికీలోగుండా చూచి తన్మయులై పోతున్నారు.

కిశోరితో కమలిని "చెల్లీ! ఒకనాడు మనం ఆ కని పిస్తున్న అడవికంటె భయానకమైన అడవులలో తిరిగాం. ఎక్కడ క్రూరమృగాలు మీదికి ఉరికి తమ పొట్టను పెట్టు కొంటాయోనని భయంతో వణకిపోయేవాళ్ళం. కాని ఇవ్వేళ ఆఅడవులే అత్యంత సుందరంగా కనిపించి, వాటిలో తిరగాలన్నే వాంఛను రేకెత్తిస్తున్నాయి."

కిశోరి :- అవును! అక్కా! ఎవరికైనా ఇష్టంలేనిపని అదెంతమంచిదైనా చెయ్యటానికి బుద్ధిపుట్టదు. అందులో నూ ప్రాణోపద్రవాన్ని కలిగించే పనులు అసలే చెయ్యలేము. నిజంగా నాకు అడవులలో తిరుగుతున్నప్పుడు క్రూరమృగాల కంటే శత్రువులంటేనే యెక్కువ భీతిగా వుండేది. అటువంటి పరిస్థితులు భగవానుడు శత్రువులకుకూడా కలిగించకుండుగాక! ఆరోజులలో మన దురదృష్టంచేత మిత్రులనుకున్న వాళ్ళు సైతం శత్రువులుగా తయారయి మనల్ని నానా హింసలూ పెట్టారు. కమలా! నువ్వే చెప్పు? ఆ చమేలి పిల్లకు నేనేమి అపకారం చేశానని ఆమె నన్ను నానా భాధలు పెట్టింది? ఆమె నా ప్రేమవ్యవహారాన్ని మానాన్నకు చెప్పకుండావుంటే నాకిన్ని కష్టాలు దాపురించేవికావు.

కమల :- అవునుగాని చివరకు ఆ విశ్వాస ఘాతుకు రాలు తగినశిక్షే అనుభవించింది. నాచేతి దెబ్బను అది జన్మ జన్మాలకు మఱచిపోదు.

కిశోరి :- అయినప్పటికీ అది మానాన్న రహస్యాలు పూర్తిగా చెప్పనేలేదు.

కమల :- అవును. అది చాలా పెంకెఘటం. నీవుదానిని విడిచిపెట్టమని చెప్పి మంచిపనే చేశావు. ఇప్పటికీ అదెక్కడున్నా ఏడుస్తూ ఉండవలసిందే!

కిశోరి: - నాగర్ నన్ను ఖైదులో పెట్టినప్పుడు ధనపతి సోదరుడు మాత్రం నన్ను తక్కువగా ఏడిపించాడా? ఆదార్భాగ్యుని ముఖంచూస్తేనే నాకు ఆపాదమస్తకం భగ్గున మండి పోయేది.

లాడిలి :- అతణ్ణి భూతనాథుడు నరకానికి పంపి మంచి పని చేశాడు. కాని నాగర్ తప్పించుకొన్నది. మాయారాణీ నాగర్ ఏమీ చెప్పకుండా ఉండటమే దానికి మంచిదైంది.

కిశోరి:- చెల్లీ! నువ్వు చాలా మంచిదానివి, ధర్మనిష్ట కలదానివికదా! మరెందుకు ఆ రోజుల్లో మాయారాణితో కలసి మమ్మల్ని చంపటానికి ఉద్యుక్తురాలివయ్యావు ?

లాడిలి:- ఇప్పుడాసంగతి యెందుకు తెచ్చావు? చాలా సార్లు నిన్నావిషయాలు యెత్తినా తలవంచుకొనేట్లు చెయ్యవద్దని చెప్పానుగదా! ఆ రోజులలో నేను అస్వతంత్రను. నాకెవ్వరి సహాయమూ లేదు. నాకు ప్రత్యేకనివాసం కూడా లేదు ఆ దుర్మార్గురాలితో కలసివుండి నేను ఊరకే ఉండలేకపోయాను. అక్కడనుండి పారిపోదామంటే నా మానాభిమానాలనుగురించి నాకు ఆందోళనగా ఉండేది. నీవు ఆ విషయాలన్నీ కావాలని యెప్పటికప్పుడు గుర్తుకుతెచ్చి నన్ను హింసిస్తున్నావు. ఇక్కడ కూర్చోనా? వెళ్ళనా?

కిశోరి:- పోనీలే! తప్పుచేశాను. క్షమించు. నా ఉద్దేశం నిన్ను బాధపెట్టాలనికాదు. నానక్‌ను గురించి ఒకటి రెండు విషయాలు తెలుసుకోవాలనుకొన్నాను. ఆవిషయాలు రహస్యాలుగా మిమ్మల్ని...

లాడిలి:- ఆ విషయాలు కూడా నన్ను బాధించేవే!

కిశోరి:- అబ్బే! నువ్వు రామభోళివేషంలో నానక్‌ను యేమేమిచేశావో ఆ సంగతులు నిన్ను నేనడగదలచుకోలేదు. నానక్ దొంగిలించుకొని తెచ్చిన ఆరేకు డబ్బాలో ఏముందో అడగాలనుకొన్నాను. నీకు దానిని పడవలో యిచ్చాడుగదా

నానక్‌ను మోసగించడానికే, దానికి వేరే కారణమేమీలేదు.
ఇక రోహితగఢపు చీకటిగృహంలో నీవు చూచిన నా చిత్రాన్ని దిగ్విజయసింహుని మేనత్త వ్రేలాడగట్టింది. అదీ కూడా నా కోరిక! ఆమె నా చిత్రాన్ని ఒకచోట కట్టి వచ్చి, దానికి యేవైపున ఎటువంటి రహస్యాలున్నాయో నాకు వివరించేది. ఆ వృద్ధురాలు చాలా మంచిది. అక్కడి రహస్యాలు దిగ్విజయసింహునికంటేకూడా ఆమెకే ఎక్కువగా తెలుసు. ఆమె నాకు చాలా సాహాయ్యం చేసిందని మహారాజుకు ఇంతకు ముందే చెప్పాను. ఆమె నేనున్న చోటికి అనేక పర్యాయాలు వస్తూపోతూ ఉండేది. ఈ విషయాలన్నీ దిగ్విజయునికి తెలియవు అతనికీ, ఆమెకూ ఎక్కువ ప్రేమాభిమానాలు కూడా లేవు. ఆమె సాహాయ్యంతో నేను చీకటిగృహంలో ప్రవేశించాను. ధనపతి అనగాకుందనం అక్కడ చేసిన పనులన్నీ మాయారాణీ, సాధువుల మూలాన జరిగినవే. ఇంటికి వచ్చిన తరువాత సాధువు అనేక పర్యాయాలు రహస్యంగా అక్కడకు వచ్చి కుందనాన్ని కలుసుకున్నాడని తెలిసింది. కాని అతనికి నావృత్తాంతమేమీ తెలియదు అతనికే తెలిసినట్లయితే నాకూ ఈ కుందనానికి శత్రుత్వం ఉండేదికాదు. కాని విచిత్రమేమంటే ఇంటికి వచ్చినతర్వాతకూడా ధనపతి నాకనేక విషయాలు చెప్పకుండా రహస్యంగా ఉంచాడు.

కిశోరి:— సరేకాని రోహితగఢంలో నువ్వు కుందనానికి చూపించమని నాకిచ్చిన బొమ్మ నీకెక్కడదొరికింది. తర్వాత నీకూ కుందనానికీ దాని రహస్యం ఎలా తెలిసింది?

లాడిలి:— ఆ రోజులలో నేను కుందనం అంటే ఎవరో తెలుసుకోవాలని నానాయాతనలు పడుతుండేదాన్ని. ఒకసారి నేనా శ్రీ వీరేంద్రసింహామహారాజుయొక్క ఇంద్రజాలికుడే అని అనుమానించాను. ఆ అనుమాన నివృత్తికోసం నేనే ఆ చిత్రాన్ని సిద్ధంచేసి ఆమెకు చూపించమని నీ చేతికిచ్చాను. ఆ చిత్రంయొక్క రహస్యం మాకూ చివరకు మనోరమద్వారా తెలిసింది. ఇందిరకు తల్లిగా మనోరమ నటిస్తున్న రోజులలో ఇందిరద్వారా ఆ రహస్యాన్ని మనోరమ తెలుసుకొన్నది.

కిశోరి:— ఈ చిక్కులన్నిటికీ కారణం ఆ దుర్మార్గుడైన వృద్ధసాధువేనని నిస్సందేహంగా చెప్పవచ్చు. జమానియా రాజ్యంలో అతడు లేకుండాఉన్నట్లయితే ఈవిషయాలేవీ వినవచ్చేవికావు. మన యీకష్టాలగాథలను ప్రజానీకం చెప్పుకొని ఉన్నురుమనే అవకాశం అంతకంటే ఉండేదికాదు. ఇంతకూ కమలినక్కయ్యా! ఈసాధువుకు ప్రపంచంలోతల్లీతండ్రీబంధువు లన్నవారెవరైనా ఉన్నారా?

కమలిని:— ప్రపంచంలో మానవుడు చెడునుగాని మంచినిగాని మొట్టమొదట ఇంటివద్దనే నేర్చుకొంటాడు. తల్లిదండ్రులయొక్క ఎక్కువ గారాబంవల్లనూ క్రమశిక్షణలేనందువల్లనూ పిల్లలు చెడ్డనడతను నేర్చుకొని ఆ యింటిలోనే ఆ దుష్టప్రవృత్తికి ప్రారంభోత్సవం చేస్తారు. ఆతర్వాత పెద్దవారైన కొద్దీ ప్రపంచంలో దుర్మార్గులనేపేరు సంపాదించుకొంటారు. ఇదేవిషయం సాధువు వ్యవహారంలోకూడా జరిగింది. ఇతడు మొదట తనవాళ్ళనుకొన్నవారినందరినీ నాశనంచేశాడు. ఇంటికి చిన్నతనంలో యజమాని అయ్యాడు. సాధువేషాన్ని ఇతడు

చిన్ననాడే అలవరచుకొన్నాడు. అందుచేత త్వరగా మను ష్యులు ఇతని వేషాన్నిచూచి మోసపోయేవారు. మన గోపాల సింహ మహారాజుకూడా ఇతనిని ఋషిపుంగవుడుగా భావించి దగ్గరకు చేర్చాడు. ఇతనికి పినతండ్రి కుమారుడొకడున్నాడు. అతడొక్కడే ఈతనిచేతిలో చావలేదు. దానికి కారణంఏమంటే అతడూ ఒకదుర్మార్గుడే! చివరకతడు అన్నగారికిశిష్యుడై బ్రతక గలిగాడు. ఇప్పుడుతడు మన కారాగారంలో మరణోన్ముఖుడై ఉన్నాడు. అతడు తనకు శిఖండి అని పేరుపెట్టుకొన్నాడు. ఒక సారి నేను జమానియా ప్రత్యేకవనంలోని చీకటిగుహలోనుండి పారంగపుమార్గంగుండా రాకుమారులతోపాటు మిగతామన వారినితీసుకొని వస్తుంటే ఏనుగు వాకిలిదగ్గర ఒకడు మావారిపై దెబ్బతీశాడు గుర్తున్నదా? అతడేవాడు. నేనతన్ని నాతరపు వాడనుకొన్నాను. మోసంచేశాడు. దేవునిదయవల్ల అత డక్కడే బందీఅయినాడు.

అప్పుడు కమలినిదృష్టి ఎదురుగాఉన్న అడవిమీద పడింది. ఆనందసింహుడు ఎదురుగా గుర్రాన్నెక్కివస్తున్నాడు. అతని వెంట తారాసింహుడూ కనిపిస్తున్నాడు. అక్కడవారిద్దరూ తప్ప ఇంకెవ్వరూలేరు. వాళ్ళను చూడటంతోపాటు కమలిని దృష్టి మరొకవిచిత్ర సన్నివేశంమీద పడింది. ఆమె ఉలిక్కి పడటంతోటే అందరూ ఆ దిక్కుగాచూచారు.

అడవిదాటి ఆనందసింహుడూ, తారాసింహుడూ మైదానం చేరుకొన్నారు. కాని అంతలోనే వెనుకకుతిరిగారు. అప్పుడు అడవిలోనుండి పదివన్నెండుగురు ధనుష్పాణులు మైదా నంలో చేరుకొని వీరిపై బాణవర్షం కురిపించసాగారు. తారా

సింహుడు ఆనందసింహుడు కత్తులుచూపి ఆ ధనుర్ధారులతో పోరాడటానికి తలపడ్డారు. ఆవిధంగా వారు పోరాడుకొంటూనే అడవిలోచేరి కంటికి కనిపించకుండాపోయారు. ఈ దృశ్యాన్ని చూచిన కమలిని మొదలైనవాళ్ళందరూ భయపడి ఆవృత్తాంతం తెలిసికొని రావటానికి ఒక దాసీని ఇంద్రజీతసింహుని దగ్గరకు పంపించారు.

# 8

త్రోలుదొంగలు ఎవరిపై దెబ్బవెయ్యాలాఅని నానక్ ఆలోచిస్తున్నాడు. మొదట శాంతమీద కత్తివిసిరితే భూత నాథుడు లేస్తాడేమోనని భయం. అతడిని ఎదుర్కొనే శక్తి తనకెలాగూలేదు గనుక ముందుగా భూతనాథునివవిపట్టించటమే మేలనుకున్నాడు. తండ్రినివధించే సమయంలో సవతి తల్లి మేల్కొన్నా ఆమెను త్రుటిపాటులో తెగనరకగలనని ధైర్యాం తెచ్చుకొన్నాడు. అయితే మొదట ఆ యిద్దరిలో ఎవరు ఎవరో తెలుసుకోవాలిగదా!

ఈ విధంగా ఆలోచించి ఆలోచించి చివరకు ఆయిద్దరినీ విచక్షణచేసి తెలుసుకోక వారిని స్పృహాలేకుండాచేసి తనతల్లి దగ్గరకు ఎత్తుకొని పోవాలనుకొన్నాడు. ఆ ప్రకారంగా వారి మీద మత్తుమందు చల్లాడు. ఆ ముసుగు తన్ని పడుకొన్న వారు కొద్దిగా కాళ్ళుచేతులు కదలించి చివరకు చలనంలేకుండా ఉండిపోయారు. అప్పుడు వాళ్ళ ముసుగులను నానక్ తొల గించి చూచాడు. కాని వాళ్ళిద్దరిలో భూతనాథుడు లేడు.

ఇద్దరూ స్త్రీలే! వారిలో ఒకతె శాంత. రెండవ స్త్రీ యెవరో తెలియటంలేదు. ఇంతకుముందు నానక్ ఆమెను చూచి ఉండ లేదు.

శాంతకు మరొకసారి మత్తుమందును వాసన చూపి నానక్ ఆమెను పూర్తిగా స్పృహ తప్పిపోయేటట్లు చేశాడు. అప్పుడామెను మంచంమీదనుండి బయటకుతీసుకొనివచ్చాడు. అక్కడ అతని అనుయాయి ఒకడు కాచుకొని ఉన్నాడు. ఇద్దరూ కలసి శాంతను మూట గట్టుకొని చాలామెలుకువతో ఆ ప్రదేశంనుండి పారిపోయారు.

శాంతను బంధించ గలిగినందుకు నానక్ చాలా సంతోషించాడు. తన తల్లి తన ప్రతాపానికి ముగ్ధురాలౌతుం దనుకొన్నాడు. అటుమీద భూతనాధుడిని వశపరచుకోవా లనుకొన్నాడు. అదేవిధంగా క్రమంగా శత్రువులను నిశ్శేషం చెయ్యాననే ఆత్మవిశ్వాసం అతనికి ఏర్పడింది.

ఒక్క క్రోసెడుదూరం వెళ్ళినతర్వాత నిర్దిష్ట ప్రదేశంలో నానక్ కోసం వేచిఉన్న తక్కినఅనుచరులు కనిపించారు. వాళ్ళు ప్రయాణానికి సిద్ధపరచిన గుర్రాలను అక్కడకు తీసుకొనివచ్చారు. నానక్ శాంతను ఒక గుర్రంవీపుపై కట్టివేశాడు. అందరూ గుర్రాలమీద పూర్వదిక్కుగా ప్రయాణమయ్యారు.

మరునాటి సాయంకాలానికి నానక్ తన యింటికి చేరుకొన్నాడు. ప్రయాణమధ్యలో తానూ, తన అనుయాయులూ ఎన్నోసార్లు భోజనాలు చేశారుగానీ శాంత విషయం ఎవరూ పట్టించుకోలేదు. మత్తు సన్నగిలి మేలుకొనబోతున్నప్పుడెల్లా

తిరిగి మత్తుమందిచ్చి ఆమెను మూర్ఛలోనే ఉండేట్టు చేశారు.

నానకును చూచి అతని తల్లి చాలా సంతోషించింది. తన సవతి పట్టుబడినందుకు ఆమె హృదయం చల్లబడింది. తన కుమారుణ్ణి ఉద్దేశించి ఆమె "ఈమెపై పగసాధించుకొనటానికి మనం ఆలస్యం చెయ్యకూడదు. ఒక స్తంభానికి కట్టివేసి చెప్పు తీసుకొని బాగాకొట్టు. అఱవకుండా, మనల్ని తిట్టకుండా నోటినిండా గుడ్డలు కుక్కు" అని ఆదేశించింది.

నానక్ అదేవిధంగా చేశాడు. వసారాలో ఆమెను ఒక స్తంభానికి కట్టివేసి నోటినిండా గుడ్డలు కుక్కి స్పృహ తెప్పించి చెప్పుతీసుకొని కొట్టసాగాడు. శాంత తన దురవస్థను గ్రహించి కన్నీరు మున్నీరుగా విలపించింది.

నానక్ నిర్దాక్షిణ్యంగా హింసించటంవల్ల శాంత బాధను భరించలేక స్పృహతప్పి పోయింది. అప్పుడు నానక్ తల్లి ఒక ఉత్తరాన్ని నానక్ ముందువేసి 'దీన్ని జాగ్రత్తగా చదువు ! నేనిప్పుడే తిరిగివస్తాను. అని బయటకు వెళ్ళింది.

నానకుకు అతని తల్లి ప్రవర్తనను ఆశ్చర్యాన్ని కలిగించింది. అతడా ఉత్తరాన్ని తీసుకొని దీపం ఎదుట చదవటం ప్రారంభించాడు. ఆ లేఖలో—

"భూతనాథుణ్ణి ఎదిరించటానికీ, మాయచెయ్యటానికి నానక్ వంటి నీచుల కెప్పటికీ సాధ్యంకాదు. బహుశః నీవు శాంతను బంధించి తీసుకొనివచ్చావనుకొంటున్నావు కాబోలు కాని ఆమె నీచేతి కెప్పటికి దొరకదు. నీవల్ల చెప్పుదెబ్బలు తిన్న స్త్రీ శాంతకాదు. ఆమె ముఖాన్ని కడిగితే నీకు భూత

నాథుని నైపుణ్యం విదితమౌతుంది. నీకు నీ ప్రాణాలమీద తీపివుంటే భూతనాథుణ్ణి వెంబడించకు. జాగ్రత్త!"

ఉత్తరాన్ని చదివిన నానక్ భయభ్రాంతుడయ్యాడు. అతడు త్వరత్వరగా ఆమె నోట్లో కుక్కిన గుడ్డలు తీసి ముఖాన్ని నీళ్ళతో కడిగాడు. అప్పటి కామెకు తెలివివచ్చింది. "ఆమె ఏరా కొడుకా! నీవేనన్నిట్లా చేశావుగదరా!" అన్నది.

నానక్ ఆశ్చర్యానికి మేరలేదు. అతడు వణకుతూ తల్లి వంక శిలాప్రతిమలాగా చూడసాగాడు. రామదేవి అతనిని ఎన్నో తిట్లూ తిట్టింది. అతడు వాటినన్నింటిని నోరెత్తకుండా సహించాడు. రామదేవి రూపంలో తనకీ ఉత్తరాన్ని పారవేసి పోయిన స్త్రీని పట్టుకోవాలనుకున్నాడుగాని ఆమె యీపాటికే చాలాదూరం వెళ్ళిపోయింది. ఆపని సాధ్యం కాదని అతడు ఆగిపోయాడు.

తన తల్లిని స్తంభంనుండి విడిపించి "ఇదంతా యెట్లా జరిగిందో నా కర్థం కావటంలేదు. నీ వక్కడికి ఎట్లావెళ్ళావు' నీ రూపంలో ఇక్కడఉన్న వారెవరు? ఇక్కడికెట్లా వచ్చిందిశ?"

రామదేవి:— నా కేమీ తెలియదు. నీ విక్కడనుంచే వెళ్ళినతర్వాత కూడా నేనీయింట్లోనే ఉన్నాను. ఈ ఇంట్లోడి నాకు స్పృహ తప్పింది. తెలివి వచ్చేసరికికూడా ఇక్కడే ఉన్నాను. ఇంతకూ ఏం జరిగిందో నువ్వే చెప్పు? నన్నెందు కిట్లా చేశావు?"

నానక్ జరిగినదంతా చెప్పి "నేనేం చెయ్యాను చెప్పు" అని తల్లిని ప్రాధేయపడ్డాడు.

# 9

అప్పటికి మధ్యాహ్నం దాటింది. సురేంద్రసింహ మహారాజు అప్పుడప్పుడే భోజనం చేశాడు. మంచంమీద తమలపాకులు నములుతూ తన స్నేహితులతోనూ మనుమలతోనూ తమాషాగా మాట్లాడుతున్నాడు. మిగతావాళ్ళు మహారాజు గారికంటే ముందుగానే భోజనాలను ముగించుకొన్నారు.

ఆ సమయంలో ఆ గదిలో వీరేంద్ర, ఇంద్రజీత, ఆనంద, గోపాల, జీత, తేజ, దేవీ, భైరవ, భరతసింహులు, పన్నాలాలూ, రామనారాయణా, బదరీనాధుడూ, చున్నీలాలు, జగన్నాధుడూ, ఇంద్రదేవుడు ఉన్నారు. వీరేంద్రుడు "నేను భేదించిన ఇంద్రజాలం ఈ ఇంద్రజాలం ముందు చాలాచిన్నది. జమానియా రాజ్యంలోవలెనే యిక్కడ చాలా ఘటికులు నివసించారు. అనేకమైన అద్భుత సంఘటనలు జరిగాయి."

గోపాల:- ఈచిక్కులన్నిటికీ కారణం ఆ ఇంద్రజాలమే. దాని ఆనందాన్ని అనుభవించాలని ఆనేకులు ఎన్నో చిక్కులు కలిగించారు. అందుచేత ప్రజానీకం యొక్క శక్తిసామర్థ్యాలు చాలా పెంపొందాయి.

జీతసింహుడు:- ఇంద్రజాల రహస్యాలు బయటపడుతున్న కొద్దీ అనేకుల దురదృష్టరేఖలు కూడా బయటపడ్డాయి.

సురేం:- ఇంద్రజాల ప్రధాన సంరక్షకుడైన వృద్ధ సాధువునుచూస్తే నాకు చాలా ఆశ్చర్యం అవుతోంది. అతడే

సుఖాన్ని కోరి యిన్ని పాపకార్యాలు చేశాడో అర్థం కావటం లేదు.

భరతసింహుడు:- బహుశః మహారాజులుంగారుసాధువు దుష్కార్యాలనుగురించి చాలా తక్కువే తెలుసుకొన్నారను కొంటాను. మావైపు నుంచి కూడా మీరువింటేగాని అతని సంపూర్ణ చరిత్ర మీకు విదితంగాదు.

సురేంద్ర:- అవును; అందుకే మేము యివ్వాళ విశ్రాంతి తీసుకోకుండా వచ్చాము.

భరతసింహుడు తన కథను ప్రారంభించాడు. "నేను జమానియా పౌరుడైన ఒక జమీందారు కుమారుణ్ణి. గోపాల సింహుడు నన్ను స్నేహితుడుగా చేసుకొన్నాడు. ఆయన యింట్లో నేను చాలా చనువుగా తిరుగుతుండేవాణ్ణి. అందుచేత జమానియా ప్రభుత్వ కర్మచారణులకు నేనంటే చాలా గౌరవ ముండేది. ఇలా ఉండటం సాధువుకు యిష్టంలేదు.

"గోపాలసింహమహారాజు మాత్రమేగాక అతని తండ్రి గారుకూడా నన్నెంతగానో ఆదరించేవారు. మా యిరువుర మైత్రిలో దుష్ప్రవర్తన మచ్చుకైనా కనిపించేదికాదు.

"జమానియాలో విశ్వాసఘాతుకులందరు కలసి నిర్మించిన రహస్య సంఘాన్ని గురించి మీరు విన్నారు. దాని కార్యక్రమాలుకూడా మీరు తెలుసుకొన్నారు. కనుక ఆ సంఘాన్ని గురించి యిప్పుడంతగా చెప్పవలసిన అవసరంలేదు.

"రాజ్యపాలనలో సాధారణంగా ఏదో ఒక లోపం ఎప్పుడూ జరుగుతూనే ఉంటుంది. కనుక గోపాలసింహుడు సింహాసనానికి రాకపూర్వం జరిగిన విషయాలన్నీ విడిచిపెడ

తాను. ఆయన వివాహం జరిగిన తర్వాత జరిగిన సంఘటనలను వివరించటానికి పూనుకొంటాను. వివాహసందర్భంలో జరిగిన విషాద సంఘటన మీకు తెలును.

"జమానియాలోని ఆ రహస్యసంఘం భూతనాథుని మూలాన విచ్ఛిన్నమైనప్పటికి సమూలంగా మాత్రం పోలేదు. సాధువు ఎప్పటి కప్పుడు తప్పించుకొంటూనే ఉన్నాడు. ఆసంఘంయొక్క కార్యాలయం అతని వశంలో ఉన్నది.

"గోపాలసింహుని వివాహం జరిగి చాలా కాలమైంది. ఒకనాడు రాత్రిపూట నా పనికత్తె నాకాళ్ళకు నూనెరాస్తూ నాతో 'గోపాలసింహునిపెండ్లి నిజమైన లక్ష్మితో కాలేదు. ఒక అన్యయువతితో జరిగింది. ఈ పనిని సాధువు లంచం తీసుకొని చేశాడు. ఈ పనిలో అడ్డంగా భావించిన గోపాలసింహుని తండ్రిని కూడా ఆ దుర్మార్గుడు హత్య చేశాడు.' అన్నది.

"ఈ వర్తమానం విని నేను వణకిపోయాను. ఆమెని ఎన్నో అడ్డు ప్రశ్నలు వేసి జరిగిన సంగతంతా వివరంగా తెలుసుకొన్నాను. వెంటనే గోపాలసింహుడిని కలుసుకొందామనుకొన్నాగానీ తొందరపడటం భావ్యంకాదని ఆగాను. ఈ విధంగా అసలెందుకు జరిగింది. ఇందులో రహస్య మేమిటికి అని వితర్కించుకొన్నాను.

"ఆ రాత్రిఅంతా నాకు కంటిమీద కునుకు పట్టలేదు. తెల్లవారినతర్వాత మహారాజును కలుసుకోటానికి వెళ్ళాను. ఆయన సంధ్యవార్చు కొంటున్నాడు. అతనికి సమీపంలో మాయారాణికూర్చుండి పూలదండ కట్టుతోంది.

"ఆమె నన్ను చూచి 'ఇవ్వేళ నాకు ఏదో మంచి కానుక తీసుకొని వచ్చారనుకొంటాను.' అన్నది. దానికి సమాధానంగా నేను మెల్లగా నవ్వి మహారాజు సమీపంలో కూర్చున్నాను. సంధ్యవార్చుకోటం పూర్తయిన తర్వాత ఆయన పలకరించాడు. రాణి అక్కడినుండి వెళ్ళితే బాగుండు నని నేను కూర్చున్నాను. నేనేమి చెబుతానో వినాలని ఆమె అక్కడ కూర్చున్నది. నేనేదో సామాన్యంగా మాట్లాడి లేచి వెడదామన్నా వీలుగా లేదు. కారణం నేను ప్రత్యేకంగా మాట్లాడటానికి అప్పుడక్కడకు వచ్చానని వారికిద్దరకూ తెలిసి పోయింది. అందుచేత సంకేతమాత్రంగా గోపాలసింహునికి 'మీతో ఒంటరిగా చెబుతాను.' లే అని హెచ్చరించాను. అప్పుడు గోపాలసింహుడు ఏదో పని చెప్పి రాణిని అక్కడ నుండి వెళ్ళేటట్టుచేశాడు. ఆమె ఇదంతా గ్రహించి ముఖ మింత చేసుకొని లేచింది.

"రాణి లేచి వెళ్ళినట్లు వెళ్ళిందిగాని చాటుగా మా సంభాషణ విన్నది. అందుచేతనే నాకు ఆరోజునుండే కష్టాలు సంభవించాయి. ఆమె ఏ విధంగా మా సంభాషణవిన్నదో నాకు తెలియదు. మేము కూర్చున్న గదికి దగ్గరగా ఒక చిన్న కిటికీమాత్రంవున్నది. బహుశః ఆమె వెనుకనుంచీ ఆ కిటికీ గుండా మా సంభాషణలు విని వుండవచ్చు.

"నేను గోపాలసింహునితో 'ఏమండీ మీ తండ్రిగారు సాధువు చేతిలో మరణించారట! మీ వివాహంలోకూడా ఏదో గడబిడ జరిగిందట! ఈ అన్నిటినీగురించి విచారించాలి.' అన్నాను. ఈ విషయాలన్నీ మా నౌకరు చెప్పిందని చెప్పాను

గాని ఆమె పేరు బైటపెట్టలేదు. ఆమె చెప్పిన విషయాలన్నీ కూడా అక్కడ చెప్పలేదు. మా నౌకరుపైన నాకు చాలా విశ్వాసమున్నది. అందుచేత ఆమె రక్షణ బాధ్యతనుకూడా నేనే వహించాను. ఆమె చాలా తెలివికలది. రాచ కార్యాలను సైతం అవలీలగా నెరవేర్చగలదుగాని కులహీను రాలవటంవల్ల పైకి రాలేకపోయింది.

"గోపాలసింహుడు నేను చెప్పిన విషయాలన్నీ శ్రద్ధగా విన్నాడు. కాని అతడు అప్పట్లో మాయారాణి పాతివ్రత్యాన్ని గాని, సాధువు నిష్ఠాగరిష్ఠతనుగాని శంకించే స్థితిలో లేడు. నేను మాత్రం అంతటితో విడిచిపెట్టక 'ఒకవేళ నామాట అబద్ధమైనా కాస్త జాగ్రత్తగా ఉండి సాధువును ఒక కంట కనిపెట్టివుండ వలసిందని ఉద్బోధించాను. కాని నామాటలను అతడేమాత్రం లక్ష్యపెట్టనందువలననే ఇద్దరమూ ఘోరహింసల పాలయ్యాం.

"ఆ తర్వాతకూడా నేను చాలాసార్లు స్నేహితుడుగా అతనికి ఇవ్వవలసిన సలహాలను ఇస్తూవచ్చాను. అతడు మాత్రం సరేనంటే సరేఅని అశ్రద్ధవహించాడు. ఇంకొకసారిగా హారదీన్ అనే పేరుగల ఆ నా నౌకరు నన్ను ఏకాంతంగా కలుసుకొని 'అయ్యా! మీరింకా రాజుగారికి నచ్చజెప్పటం మానివేయండి! ఆయనకు ఆపత్కాలంసమీపించింది. ఇటు వంటి పరిస్థితులలో ఎవరుచెప్పినా ఆయన వినిపించుకోడు. అంతేగాక మీరుచెప్పిన విషయాలను రాణికీ, సాధువుకూ చెప్పివేశాడు. ఇకమీదట మీరు మిమ్మల్ని సంరక్షించుకొనే ఉపాయం ఆలోచించండి. మీరిక ప్రతిక్షణం ప్రమాదంతో

గడపాలి. అన్ని సంగతులూ బయటపెట్టనందుకు కాస్త మొరగే జరిగింది.” అన్నాడు.

“ఇతరులను నేనేవిధంగా పరిగణించినా హారదీనును మాత్రం నేను నా శ్రేయోభిలాషిగా విశ్వసిస్తాను. అతని మాటలువిని నాకుగోపాలసింహునిపట్ల పట్టరానికోపం వచ్చింది. ఆనాటినుంచే అతనికి నచ్చచెప్పే పనిని మానుకొన్నాను. కాని అతనిపట్ల నా అనురాగం వైదొలగలేదు.

“నేను హారదీనును ‘ఒరే! నాయనా నీ కీ సంగతులన్నీ యెట్లా తెలిశాయ్? ఎలా తెలుసుకొంటున్నావు?’ అని అడిగాను. కాని అతడు సరిగా సమాధానం చెప్పలేదు. బాగా ఒత్తిడిచేసినమీదట ‘కొన్నాళ్ళపాటు ఆగండి! ఆ తర్వాత చెబుతాను’ అన్నాడు.

“మరునాడు సూర్యాస్తమానం కావటానికి ఇంకా రెండుగంటలు వ్యవధిఉన్నదనగా నేను నా ఉద్యానవనంలో విహరిస్తున్నాను. గోపాలసింహా మహారాజును ఋజుమార్గంలోనికి ఎలా తీసుకొనిరానా అని ఆలోచిస్తున్నాను. అప్పుడు రఘువరసింహుడు నాదగ్గరకువచ్చి ఏదో కొంతసేపు మాట్లాడాడు. మాటలసందర్భంలో ‘ఏమండీ! నేనొక గుఱ్ఱాన్ని కొన్నాను. ఇంకా ధరవిషయంలో తెగలేదు. మీరుకూడా స్వారీచేసిచూసి దానినాణ్యాన్ని సెలవిచ్చారంటే ఏదోఒకధర నిర్ణయంచేసికొంటాను. పదండి! నేనూ మీ వెంట ఒకగుఱ్ఱాన్ని యెక్కివస్తాను. నాలుగైదు క్రోసులవని...’ అన్నాడు.

“నాకు గుఱ్ఱాలంటే చాలాసరదా రఘువరునిమాటలు విని నేను చాలా సంతోషపడ్డాను. నా మనస్సులో గుఱ్ఱం

శ్రేష్ఠమైనదైతేనే కొనాలనిఉన్నది. అందుచేత 'సరే! పద! నాకూ ఒక గుర్రం అవసరం. అది ఎల్లాంటిదో చూద్దాం.' అన్నాను. రఘువరుడు 'దానిదేముందండీ? మీకునచ్చిందంటే మీరే తీసుకోండి!' అన్నాడు.

"ఆరోజులలో నేనాతనిని స్నేహితునిగా భావిస్తున్నాను. నేనెప్పుడూ అతన్ని నీచుడని తలంచలేదు. సాధువుకూడా అంత చెడ్డవాడని నేను అనుకోలేదు. వీరికిద్దరికీ రహస్యసంఘంలో సభ్యత్వమున్నదనికూడా నేను అనుకోలేదు. కాని హారదీనుడు నాకు కనువిప్పు కలిగించాడు. నా అభిప్రాయాలు తప్పని నిరూపించాడు.

"సరే! నేనూ రఘువరసింహుడు తోటవాకిలిదగ్గరకు వచ్చాం. అక్కడ రెండుగుర్రాలు కట్టిఉన్నాయి. అందులో ఒకటి రఘువరసింహుని పాతగుర్రం. అతడు పరీక్షించగోరింది ఆ రెండవగుర్రాన్నే.

"నేను గుర్రంఎక్కబోతూ ఉండగా హారదీన్ పరుగున నాదగ్గరకు వచ్చి 'ఇంట్లో అమ్మగారు నెత్తురుకక్కుకొని తెలివిలేకుండా పడిపోయారు. మీరు తొందరగావచ్చిచూడండి!' అన్నాడు. నేను వెంటనే యింటికివెళ్ళాను. బాగా లోపలకు వెళ్ళినతర్వాత హారదీన్ 'అంతావట్టిదే' అన్నాడు. 'ఎందుకిలాచేశా'వని నే నడిగితే 'రఘువరసింహునితో మిమ్మల్ని వెళ్ళనివ్వకుండా చెయ్యాలని అలాచెప్పా' నన్నాడు.

'ఏమిటిదంతా?' అని నే నడిగితే అతడు "మిమ్మల్ని దగాచేసి తీసుకొనిపోయి ప్రాణం తియ్యాలను కొంటున్నారు. ఈ విషయం అతనిఎదుట చెప్పి మిమ్మల్ని వెళ్ళనివ్వకుండా

చెయ్యలేను. అలాచేస్తే నా ప్రాణాలుకూడా దక్కవు. నేను మరణించిన తర్వాత ఈ దుష్టులబారినుండి మిమ్మల్ని రక్షించే వారెవరూ ఉండరు. మిమ్మల్ని రక్షించే బాధ్యత నా మీద ఉన్నది. మీ రహస్యాన్ని బహిరంగపరిస్తే నే నీ ప్రపంచంలో బ్రతకటం చాలా కష్టం.' అన్నాడు. అతని మాటలకు నేను ఆశ్చర్యాన్ని ప్రకటిస్తూ 'ఏమిటి నువ్వంటున్నది. రఘువర సింహుడు మన మిత్రుడుగదా!' అన్నాను.

అప్పుడు హారదీన్ "ఈ స్నేహాలను మీరు విశ్వసించకుండా ఈ సారి అతనివెంట వెళ్ళటం మానుకోండి! రాత్రికి నేను అన్ని విషయాలు మీకు విశదీకరించుతాను. అయితే నా మాటలు మీకు నమ్మకం లేకపోతే వెళ్ళండి! కాని పిస్తోలు ఒకటి జాగ్రత్తగా వుంచుకోండి! ఎంతసేపటికీ తూర్పు దిక్కుగా మాత్రం వెళ్ళండి. పడమటిదిక్కుగా మాత్రం వెళ్ళవద్దు. జాగ్రత్తగా మాత్రం ఉండండి! మీరెంత జాగ్రత్తగా ఉన్నప్పటికీ నా మాటలలోని సత్యాసత్యాలు మీ కెలాగూ తెలుస్తాయి.' అన్నాడు.

"హారదీన్ చెప్పేమాటలు నాతల దిమ్మెక్కిస్తున్నాయి. కాస్త ఆలోచించి నేను 'నిజమే హారదీన్! ఇవ్వేళ నీవు నన్ను రక్షించావు. కాని ఈవేళ నీవు నన్నాపకు. ఈ దుర్మార్గుని వెంట వెడతాను. అతని వలలో చిక్కకుండా నీవు చెప్పినట్లే చేస్తాను' అన్నాను. ఆ తర్వాత నేను నా గదిలోనికి వెళ్ళి జోడుగుళ్ళ పిస్తోలును నింపుకొని బయటకు వచ్చాను. నన్ను చూడగానే రఘువరుడు 'ఎలాఉందీఅని అడిగాడు. నేను 'ఫరవాలేదు. కాస్త తెలివి వచ్చింది. వైద్యుణ్ణి తీసుకొని

రమ్మని కబురంపించాను. అతడు వచ్చేసరికి మనం తిరిగివద్దాం' అన్నాను.

"ఇద్దఱం గుఱ్ఱాలెక్కాం. అతడు నా వెంటనే వస్తున్నాడు. పట్టణం దాటిన తర్వాత గుఱ్ఱాన్ని తూర్పు ముఖం పట్టించాను. 'అప్పుడతడు అబ్బే. అటువైపెందుకు? పశ్చిమంగా మైదానం బాగుంది. ఇటు త్రిప్పండి' అన్నాడు.

"నేను 'ఇటుమాత్రం ఎందుకు బాగాలేదు. నేనిటే వెడతా' నన్నాను.

"అతడు. వద్దు నా మాట వినండి! సాధువుకూడా గుఱ్ఱాన్ని చూస్తానంటే 'సరే మీరూ మీ గుఱ్ఱంమీద పడమటి మైదానంలో ఉండండి! మేము వస్తామన్నాను. అతడు మనకోసం చూస్తూ వుంటాడు' అన్నాడు.

'అతని కంతగా చూడాలని వుంటే మనం ఉన్నచోటికే వస్తాడు "అన్నాను నేను. అతను' అయిందేదోఅయింది. మన మిప్పుడు ఆయనను గుఱించికూడా ఆలోచించా' లన్నాడతడు.

"నాకు తూరుపువైపుగా వెళ్ళవలసినపని ఒకటి ఉన్నది. అక్కడ నాకోసం ఒక మనుష్యుడు ఎదురు చూస్తుంటాడన్నాను.

"ఈ ప్రకారంగా మా యిద్దరిమధ్యా చాలాసేపు వాదప్రతివాదాలు జరిగాయి. చివరకు ఎటువైపూ వెళ్ళకుండా తిరిగి యింటికి వచ్చాం—నా ప్రవర్తనకు రఘువరసింహుడు అలిగినట్లుగా కనిపించి తన యింటికి వెళ్ళిపోయాడు.

"నాకు హారదీన్ మీద సంపూర్ణ విశ్వాసం ఏర్పడింది. కాని అతనికి ఈ రహస్యాలన్నీ యెట్లా తెలుస్తున్నాయా అనే కుతూహలం అధికమయింది. ఆ తర్వాత ఆనాటిరాత్రి మా యిద్దరి మధ్యా ఈ విధంగా సంభాషణలు నడిచాయి.

"నేను 'నీవు చెప్పింది నిజమే హారదీన్! అతడు వశ్చి మంగా వెళ్ళాలని చాలా పట్టుబట్టాడు గాని నేను ససేమిరా అన్నాను.'

హారదీన్:- మీరు చాలా మంచిపని చేశారు. లేకపోతే ఈపాటికి చాలా అపాయం తటస్థించి ఉండేది.

నేను:- సరేగాని అతడు నాకు చాలా స్నేహితుడు గదా! ఇంతలోనే ఏంవైపరీత్యంవల్ల నా ప్రాణానికే యెసరు బెట్టాలని చూస్తున్నాడు?"

హారిదీన్ దీనికి కారణం ఆ లక్ష్మీదేవి రహస్యమే. ఆ రహస్యాన్ని మీతో చెప్పి నేను చాలా పెద్ద తప్పుచేశాను. నే నేదో గోపాలసింహ మహారాజుకుకూడా మేలుచేద్దామని ప్రయత్నిస్తే ఆయన వ్యవహారాన్నంతా తలక్రిందులు చేశాడు. ఆయన మీరు చెప్పిన విషయాలు లక్ష్మీదేవికిచెప్పి సాధు, రఘు వీరసింహులను మీకు విరోధులనుగా చేశాడు. అసలు వీళ్ళిద్దరిమూలంగానే ఆమె కంతటి ఉన్నతపదవి దొరకింది. వీళ్ళిద్దరే పెద్దరాజును చంపారు. వీళ్ళిద్దరే నిజమైన లక్ష్మీదేవినీ వాళ్ళ మొత్తం కుటుంబాన్ని సర్వనాశనం చేశాడు.

నేను:- నీవేమిటో చాలా చాలా క్రొత్తవిషయాలు వినిపిస్తున్నావు.

అతడు:- అవునుగాని మీ రా విషయాలు మనస్సులోనే ఉంచుకొని పరిస్థితులకనుకూలంగా ప్రవర్తించండి. లేకపోతే మీరు చాలా పశ్చాత్తాప పడవలసివస్తుంది. కాని మిమ్మల్ని గోపాలసింహ మహారాజును గురించి పూర్తిగా విడిచిపెట్టుడని కోరను. ఆయన మీ స్నేహితుడు.

నేను:- నీవు చెప్పినట్లు చేస్తాగాని; ఇంతకూ బలభద్రసింహుడు, లక్ష్మీదేవి యేమయ్యారు ?

అతడు:- వాళ్ళిద్దర్నీ సాధువు తన ఆధీనంలో ఉంచుకొన్నాడని మాత్రం తెలుసు. ఆ తర్వాత యేమి జరిగిందీ నాకు తెలియదు. వాళ్ళు మరణించారో ఇంకా ఖైదీలుగా ఉన్నారోకూడా తెలియదు. ఈ సంగతి రణధీరసింహుని వద్ద ఐంద్రజాలికుడుగావున్న గదాధరసింహునికి మాత్రం తెలును. అతడు నానక్ తల్లిని మాయచెయ్యటానికి తనపేరు రఘువీరసింహుడని పెట్టుకొన్నాడు. అతడే జమానియా రహస్య సంఘాన్ని విచ్ఛిన్నంకూడా చేశాడు. అతడు సాధువునూ ఈ రఘువీరసింహుణ్ణే ఒక ఆట ఆడించాడు. లక్ష్మీదేవి పెళ్ళి వ్యవహారంలో హేలాసింహునికీ యితనికి మధ్య నడిచిన ఉత్తరప్రత్యుత్తరాలనకళ్ళు గదాధరసింహుని దగ్గర ఉన్నాయి. సమయం వచ్చినప్పుడు బయటపెట్టాలనేఉద్దేశంతో అసలుఉత్తరాలను చూచి స్వహస్తంతో నకళ్ళు తీసిఉంచాడు. కాని ధనాశచేత అతడు సాధువును, రఘువరసింహుణ్ణి వదలివేశాడు. ఈరహస్యసంఘ సభ్యులలో ముఖ్యులు వీళ్ళిద్దరే వనే విషయాన్ని రహస్యంగానే ఉంచాడు. ఈ పాపఫలితాన్ని గదాధరసింహుడు అనుభవించక తప్పదు. ఆ ఉత్తరాల నకళ్ళు

ద్వారా అతడే ఒకరోజున చిక్కుల్లోపడినా ఆశ్చర్యపడ నవ సరంలేదు. ఆ ఉత్తరాలే అతనికి మృత్యువుగా ఎదురౌతాయి.

"ఇప్పుడు నాకు హారదీస్ ఆనాడు చెప్పిన విషయా లన్నీ గుర్తుకువస్తున్నాయి. అతడు చెప్పినట్లుగానే అన్నీ ఋజువయ్యాయి. ఆ రోజులలో గదాధరసింహుడుగా ప్రసిద్ధి కెక్కిన ఈ భూతనాథునికి ఆ వుత్తరాలు చాలా ప్రమాదాన్ని కొని తెచ్చాయి. భూతనాథుడిని గురించి నాకు బాగా తెలుసు. ఆతర్వాతజరిగిందికూడా నేనువిని తెలుసుకొన్నాను. కాని భూతనాథుని న్యాయవిచారణ సందర్భంలో తేజసింహుడు చాలా పొరబాటు చేశాడని నేను ఘంటాపథంగా చెప్ప గలను. అటువంటి తప్పు ఇతరులుచేస్తే ఆశ్చర్యపడవలసినపని లేదు. ఇంద్రజాలిక లోకానికి శిరోభూషణంలాంటి తేజసింహుడే ఇలా పొరబడటంవల్ల విచారించవలసి వచ్చింది. ఈయన ఆ కాగితాల మూటను లాడిలీ, కమలినీ, లక్ష్మీదేవుల సన్ని ధానంలో విప్పి, వాటిని చదివి, ఈ కాగితాలను నిస్సందే హంగా భూతనాథుడే వ్రాశాడని నేరం ఆరోపించివేశాడు. భూతనాథునికి సమాధానంగా హేలాసింహుడు వ్రాసిన ఉత్త రాలను చదువుతున్నప్పుడు అవికూడా భూతనాథుని దస్తూరి తోనే ఎందుకున్నాయని ఆలోచించలేకపోయాడు. ఎక్కడైనా తన లేఖలకు సమాధానాన్ని తన దస్తూరితోనే భూతనాథుడు వ్రాస్తాడా ?

తేజసింహుడు :— మీరు చెప్పింది నిజమే. నేనిప్పుడు చాలా పొరబాటుపడ్డాను. ఒక ఉత్తరాన్ని చదివేసరికే మేమందరమూ క్రోధావిష్టులమైనాము. ఆ ఉన్మత్తతలో మాకు

యుక్తాయుక్త వివేచనశక్తి నశించింది. ఆ తర్వాత చాలా రోజులకు దేవీసింహుడు ఇప్పుడు మీరు చెప్పిన అనుమానాన్నే గుర్తుచేశాడు. అప్పుడు మేము సిగ్గుతో మా అభిప్రాయాన్ని మార్చుకొన్నాము.

భగతసింహుడు:- అయ్యా! తేజసింహులుంగారూ! ఈ ప్రపంచంలో మహామహా మేధావులే ఒక్కొక్కసారి పొరపాట్లు చేస్తుంటే మనమందరమూ ఒక లెఖ్ఖా. విధాతకూడా పొరబాట్లు పడతాడు. కాని ఆశ్చర్యకరమైన విషయమేమంటే పెద్దవాళ్ళు ఏమి తప్పులుచేసినా బయటికి పొక్కవు. దాని సంగతి అలాఉంచి నాకథ పూర్తిచేస్తాను.

"అప్పుడు గదాధరసింహునితో కలుసుకోవటం మంచిదని భావించాను కాని అతడు నాతో తన రహస్యాలు చెబుతాడా? అందులో అతడిక్కడ ఉండటంలేదుకూడా. అప్పుడప్పుడు వచ్చి పోతుంటాడు. గదాధరసింహుడు ఎప్పుడు వస్తాడో ఎప్పుడు పోతాడో ఎవడికీ తెలియదుకదా!" అని హారదీన్‌తో అన్నాను.

అతడు "అయినప్పటికీ మీకు అతణ్ణి చూపిస్తాను. నేను చెప్పితే అసలు రహస్యమేమిటో అతడు మీకు చెప్పవచ్చు. రేపతడు జమీనియాకు వస్తాడు.

నేను:- నాకూ అతనికి లోగడ పరిచయం లేదుగదా. అటువంటిపరిస్థితిలో నన్నతడెలా నమ్ముతాడు?

అతడు: "ఫరవాలేదు. అతనికి మీపరిచయంచేయిస్తాను అన్నాడు.

"హారదీన్ చెప్పేమాటలు నన్ను మరింత ఆశ్చర్యంలో ముంచెత్తాయి. గదాధరసింహునికీ యితనికీ ఇంతగాఢపరిచయం ఎక్కడిదా అని నే నాలోచించాను."

ఈసమయంలో భూతనాథుడు వచ్చాడని భటుడువర్తమానం తెచ్చాడు. అందరిముఖాలుఆనందవికసితాలయ్యాయి. భరతసింహుడు "ఇప్పుడు నాకథ మరింతబాగా రక్తికడుతుంది" అన్నాడు.

మహారాజు భూతనాథుణ్ణి ప్రవేశపెట్టవలసిందిగా భటునికి ఆజ్ఞాపించాడు. భూతనాథుడు సభాస్థలికి చేరుకొని అందరికీ నమస్కారాలు చేశాడు.

తేజసింహుడు:— కుశలమా భూతనాథా! చాలారోజులకు మీ దర్శనమయింది.

భూతనాథుడు:— భగవత్కటాక్షంచేత క్షేమంగానే ఉన్నాను. సెలవుతీసుకొని వెళ్ళిన రోజులకంటే ముందుగానే వచ్చాను.

తేజ:— అవునుగాని తమ కుమారరత్నం ఏమంటున్నాడు?

భూత:— మీరు చెప్పిన తర్వాత ఇంకా దానికి తిరుగున్నదా? నానకును ఏమంత కష్టపెట్టలేదుగాని శిక్షమాత్రం చాలా విచిత్రంగా విధించటం జరిగింది.

దేవీసింహుడు:— (నవ్వుతూ) ఏమిటండీ ఆ విచిత్ర శిక్షా విధానం?

భూత:— నేను చేసిన పనికి వాడూ నవ్వుకునే ఉండాలి. వాడు పశువుగాకుండా ఉంటే ఇంకెవ్వరికీ ముఖం చూపించడు.

ఏమున్నదీ! వాడు నాకోసం వచ్చాడని తెలియగానే ఇంట్లో చెయ్యవలసిన యేర్పాట్లన్నీ చేసి కొంతమందిని తీసుకొని వాడి యింటికి వెళ్ళాను. అక్కడ రామదేవిని పట్టుకొని దాని స్థానంలో మనవాడి నొకణ్ణి మారువేషంలో ఉంచాను. రామదేవికి శాంతవేషం వేసి ఒక దాసీతో కూడా మా ఇంట్లో పరుండపెట్టాను. నానక్ గాడు మోసపోయి వాళ్ళమ్మనే శాంత అనుకొని భుజాలు ఎగరవేసుకుంటూ తన మారువేషంలోని తల్లిని చేరుకొన్నాడు. ఆ తల్లిగారి ఆజ్ఞప్రకారం ఈ తల్లిని స్తంభానికి కట్టి చెప్పుతీసుకొని చావమోదాడు. అప్పుడు రామదేవి వేషంలో ఉన్న మనవాడు ఒక ఉత్తరాన్ని వాడి ముందర పడవేసి అక్కడనుంచీ చక్కగా నా దగ్గరకువచ్చి చేరాడు. ఆ ఉత్తరం చదువుకున్న తర్వాత వాడి ప్రతాపమేమిటో బయటపడింది. అప్పుడు వాళ్ళిద్దరి అవస్థ యేమని చెప్పను? మీరే ఆలోచించుకోండి!"

అందరూ విరగబడి నవ్వారు. ఆ తర్వాత, భరతసింహుడు తన జీవిత వృత్తాంతాన్ని తెలియజెపుతున్నాడని తెలుసుకొని అతనిని చూచి "నాకూ మీ కథతో ఏమన్నా సంబంధం ఉన్నదా? అని ప్రశ్నించాడు.

భరత:– ఇప్పు డాసంగతే చెప్పబోతున్నాను.

భూత:– గోపాలసింహ మహారాజా! క్షమించండి. మీరు కృష్ణాజినుని వేషంలో నాకు తారసిల్లినప్పుడు ఆ కాగితాలు గోపాలసింహ మహారాజు విడుదలైన తర్వాత సంపాదించారని అబద్ధమాడాను. కాని ఆ కాగితాలు జమానియాలో నాతో భరతసింహుడు కలుసుకున్నప్పుడే నా దగ్గర

ఉన్నాయి. ఈ విషయం భరతసింహుడు చెప్పగా విన్నారను కొంటున్నాను.

భరత:- అవును, ఇప్పుడే ఆ విషయం చెప్పబో తున్నాను. ఇంకా చెప్పలేదు.

భూత:- అయితే విఘ్నేశ్వర పూజ యిప్పుడే జరిగిం దన్న మాట. కానివ్వండి!

భరత:- మరునాడు అర్ధరాత్రివేళ నేను మంచి నిద్రలో ఉన్నాను హారదీన్ వచ్చి నన్ను లేపి "ఏమండీ! గదాధర సింహుడు వచ్చాడు. అతనిని కలుసుకోండి! చాలా మంచి వాడు" అని చెప్పాడు. నేను సంతోషంతో లేచి గదాధరుని కలుసుకొన్నాను. మాయిద్దరి మధ్యా ఈ విధంగా సంభాషణలు నడిచాయి. గదాధరుడే ప్రస్తుత భూతనాధుడు.

భూత:- అయ్యా! మీ హారదీన్ చాలా ఉత్తముడు. అతణ్ణి నేను నా శ్రేయోభిలాషిగా భావిస్తున్నాను. అతడు నాకు చేసినమేలును ఏ విధంగానూ మరువలేను. మన కిద్దరికీ లోగడ ఎటువంటి పరిచయమూ లేదు. అయినా అతడు నన్నిక్కడకు రావలసిందిగా కోరాడు. అతని కోరికకు వ్యతి రేకంగా నడచుకోలేక పోయాను. అందుచేత వచ్చాను. హారదీన్ ద్వారా ప్రస్తుతం మీరు ఎటువంటి చిక్కులలో చిక్కుకొన్నారో, నన్ను కలుసుకోవలసిన అవసరమేమిటో తెలుసుకొన్నాను. ఆ కాగితాల కట్టకూడా మీకు చూపించ టానికి తీసుకొని వచ్చాను. వీటిద్వారా మీకు సాధువూ, రఘువీరసింహుడూ ఎటువంటి ద్రోహాన్ని చేశారో, గోపాల సింహ మహారాజు వివాహం ఏ విధంగా జరిగిందో మీకు

తెలుస్తుంది. అప్పుడు మీకు పట్టరాని కోపం రావచ్చు. కాని నిగ్రహించుకోవాలి. ఈ రహస్యాన్ని బయటకెక్కడా పొక్క నియ్యకూడదు. మీ విషయమై హారదీన్ చాలా విశ్వాస పాత్రులని నచ్చజెప్పడం వల్లనే నేనిక్కడకు వచ్చి యీ రహస్యాలన్నీ మీ ముందు పెట్టటానికి సిద్ధపడ్డాను.

నేను:- మీరు నన్నింతగా విశ్వసించినందుకు చాలా కృతజ్ఞుణ్ణి. మీ రహస్యాలు నా నోటిమీదుగా ఇంకొకరికి ఎటువంటి పరిస్థితులలోనూ బయటపడవు. గోపాలసింహుణ్ణి గురించి నేనేమీ పట్టించుకోవాలన్న ఉద్దేశం లేకపోయినా నా మిత్రుడయిన అతడు దుర్మార్గుల చేతులలో చిక్కుకొని పోవ టం నాకు చాలా బాధగా ఉన్నది.

భూత:- ఆ బాధ నాకూ ఉన్నది. అందుకే అతణ్ణి కాపాడాలని విశ్వప్రయత్నం చేస్తున్నాను. కాని ఏంచెయ్యను. బలభద్రసింహుడూ, లక్ష్మీదేవి యేమయ్యారో తెలియటం లేదు. ఆ విషయం తెలియకుండా ఏమీ చెయ్యలేం.

నేను:- ఇంతకూ ఈ దుర్మార్గానికంతటికీ కారణం సాధువేనని మీకు నిశ్చయంగా తెలుసా!

భూత:- అందులో అనుమానమేమీ లేదు. ఈ కాగి తాలను తిరగవేస్తే మీకే తెలుస్తుంది.

"ఆ లేఖలను నేను చదవటం ప్రారంభించాను. ఆ ఉత్తరాలు చదువుతున్నకొద్దీ నాకు విద్రోహుల మీద పట్ట రాని కోపం వచ్చింది. ఆ తర్వాత నేను భూతనాథునితో "మీరు నాకుసహాయులుగావుంటే వాళ్ళిద్దరినిహతమారుస్తాను" అన్నాను.

భూత:- దానివల్ల లాభమేమున్నది? ఆపని చెయ్యటం చాలా తేలిక కాని ముందుగా లక్ష్మీదేవిని ఆరాతీసి కాపాడాలి. ఈవిషయంలో హారదీన్ కూడా ప్రయత్నంచేస్తున్నాడు. అంతకుముందే మనం వీళ్ళిద్దరినీ చంపివేస్తే లక్ష్మీదేవి యేబంది ఖానాలోనో క్రుళ్ళి చచ్చిపోతుంది.

నేను:- అవునవును. ఇంతకూ మీరు హారదీనును ఎందుకింతగా గౌరవిస్తున్నారు?

భూతనాథుడు:- ఇదంతా చెయ్యగలిగింది నేను మీ హారదీన్‌వల్లనే. అతడే రహస్యసంఘంయొక్క గుట్టుమట్టులు నాకు తెలియజేశాడు. అందుచేత నే నా సంఘాన్ని నాశనం చెయ్యగలిగాను.

నేను:- హారదీన్! నీ కా సంఘంయొక్క విషయాలెట్లా తెలిశాయి?

హారదీన్ చేతులుజోడించి "క్షమించండి! స్వయంగా నే నా సంఘంలో సభ్యుణ్ణి. ఇప్పటికీ నన్ను వాళ్ళు తమవాడనే అనుకొంటున్నారు. కాని నాకు ఆసంఘంయొక్క కార్యకలాపాలు నచ్చక రహస్యంగా వాళ్ళకు శత్రువునై కూర్చున్నాను. ఇంతవరకూ నేను బ్రతికివుండటానికి కారణం మీయింట్లో వాళ్ళముఠాకు చెందినవాడు లేకపోవటమే.

నేను:- ఏమిటీ! ఇప్పటికీ నీవు వాళ్ళ స్నేహితుడివిగానే వుంటున్నావా? వాళ్ళు తమ రహస్యాలను నీదగ్గర హృదయపూర్వకంగా బయటపెడుతున్నారా?

హారదీన్:- చిత్తం, అందుచేతనే మిమ్మల్ని రక్షించగలిగాను.

నేను:- అయితే ఆనాడు గుర్రంవిషయంలో తమ ప్రణాళిక నెరవేరనందుకు ఇప్పుడు వాళ్ళేమిటాలోచిస్తున్నారో చెప్పు?

హారదీన్:- మొదట నన్ను వాళ్ళు భరతసింహుడు గుర్రంమీద పడమటి మైదానానికి ఎందుకురాలేదో చెప్పమన్నారు. ఏమో నాకు తెలియదన్నాను. ఆమీదట సాధువు నన్ను విషంపెట్టి మిమ్మల్ని చంపమని ఆజ్ఞాపించాడు. అలాగే చేస్తాను ఒక వారంరోజులు గడువివ్వండన్నాను.

అని చెప్పి హారదేన్ ఈ విషయంలో తననేంచెయ్యమంటావని భూతనాథుని సలహా అడిగాడు. భూతనాథుడు "నాలుగైదురోజులతర్వాత భరతసింహుడు తనకెవరో విషం పెట్టారని మిథ్యా ప్రచారంచేసి జబ్బుపడినట్లుగా నటిస్తే బాగుంటుందని సలహా యిచ్చాడు.

"ఆతర్వాత భూతనాథుడు తిరిగి మరునాడు కలుసుకొంటానని వెళ్ళిపోయాడు. అటుపిదప ఆవిధంగానే మేము చాలాసార్లు కలుసుకొన్నాం. మాయిద్దరిమధ్య స్నేహంకూడా ఏర్పడింది. నాకతడు ఎన్నోవిధాల సహాయపడ్డాడు. నేను నాకెవరో విషంపెట్టారనీ, జబ్బుపడ్డాననీ నటించానుగాని దానివల్ల లాభంలేకపోయింది. హారదీన్‌పై సాధువుకు అనుమానం కలిగింది. అతను తనకు అనుకూలుడు కాడని వాడు గ్రహించాడు. ఈవిషయమే హారదీన్ నాతో చెప్పి ఇక నేను మీయింటికి రాను. సాధువుసంగతి తేల్చుకొని నేను చావటమో అతడు చావటమో జరిగిపోవాలి. నేను చచ్చిపోతాననే భయం నాకేమీలేదు గాని మీసంరక్షణబాధ్యత యెవరుతీసుకొంటారనేబాధ నాకు చాలావున్నది. కాని నేనిక్కడ వుండటంవల్ల

చాలా ప్రమాదం సంభవిస్తుంది. రహస్యంగా వుంటూనే నేను మీకు సాధ్యమైనంత ఎక్కువగా తోడ్పడతాను. మీరు మాత్రం సాధువులలో చిక్కకుండా అత్యంత జాగరూకతతో వుండండి" అని చెప్పాడు.

నేను:- అలాగైతే నీవు పారిపోనవసరంలేదు. సాధువు రహస్యాలను బహిర్గతంచేసి అతనితో ముఖాముఖిగానే తల పడదాం.

హారదీన్:- మనదగ్గర సాధువుకు వ్యతిరేకంగా సాక్ష్యం లేదు సరిగదా అతనిని ఎదుర్కొనే శక్తికూడా చాలాతక్కువ

నేను:- ఈ రహస్యాలు గోపాలసింహునితో చెప్పితే కూడా ప్రయోజనంలేదా ?"

హారదీన్:- అయ్యయ్యో ! అలాచేస్తే ఇంకా ఒకటి రెండు సంవత్సరాలపాటు జీవించే గోపాలసింహుడు కూడా మనతోపాటే ఈ క్షణంలో సాధువు ఖడ్గానికి ఎఱ అవుతాడు. మీకు నిజంగా సాధువు శక్తి సామర్థ్యాలు ఏమాత్రం తెలియవు. అతడు గోపాలసింహునికంటే బలవంతుడు. అయితే గోపాలసింహుడు రెండోకంటివాడికి తెలియకుండా సాధువునుఅమాంతంచంపివేస్తే చంపివేయగలడు. కాని అప్పటికైనా మాయారాణి సామాన్యురాలేమీకాదు. లక్ష్మీదేవి రహస్యం అలాగే ఉండిపోతుంది. ఆమె మరణిస్తుంది.

ఈవిధంగా నాకు హారదీన్ నచ్చచెప్పి మా యిల్లు విడిచిపెట్టి వెళ్ళిపోయాడు. అతని సంగతి ఆ తర్వాత ఏమైందీ నాకు తెలియదు. మరునాడు నేను సాయుధుడనై మహారాజు దగ్గరకు వెళ్ళాను. అప్పుడు నాకు అంతఃపురంలో రాజుగారి

దగ్గిరనుంచీ తిరిగివస్తూ సాధువు నా కెదురయ్యాడు. అతడు నన్ను మామూలు ధోరణిలో పలకరించి "రాజుగారు తోటలో ఉన్నాడు. నేనూ అక్కడికే వెళ్ళుతున్నాను. నాతో రండి" అన్నాడు. "జబ్బుగాకూడా వున్నది వీలైతే వైద్యుణ్ణి వెళ్ళి తీసుకురండి" అన్నాడు.

నేను వెంటనే వైద్యుణ్ని తీసుకునిరావటానికి వెనుకకు వెళ్ళాను.

అంతవరకూ చెప్పిభరతసింహుడుకొన్ని క్షణాలుఆగాడు అప్పుడు జీతసింహుడు "భరత సింహుని కథనుకూడా న్యాయ విచారణసందర్భంలో ప్రత్యేకపు దర్బారులో వినటం మంచిది" అన్నాడు.

అందరూ దానికి సమ్మతించినమీదట మహారాజు రేపు ప్రత్యేకమైన రాజసభలో ఖైదీల న్యాయవిచారణ జరుగు తుంది. అని ప్రకటించాడు. అందరూ తమ తమ నివాసాలకు వెళ్ళిపోయారు.

మధ్యాహ్నం దాటింది. అప్పుడు ఆనందసింహుడు తారాసింహుడు మృగయావినోద కుతూహలంతో అశ్వా రూఢులై వనానికి బయలుదేరినారు.

# 10

సామాన్యంగా వేటముగించి ఆనందసింహుడు సాయం కాలమయ్యేసరికి యింటికి తిరుగుముఖం పట్టాడు. ఆ సమయం లోనే కమలిని మొదలైన యువరాణులు ఆనందసింహుడు కొందరిని ఎదుర్కొనడం చూచారని వ్రాయటం జరిగింది.

ఇంద్రజీతసింహుడు ఈ వర్తమానం తెలుసుకొని ఆనందసింహునికి సహాయంగా భైరవసింహుడు మొదలైన వాళ్ళను వెంటబెట్టుకొని అతిశీఘ్రగతిని వెళ్ళాడు.

అసలుసంగతేమంటే నానక్ భూతనాథునివల్ల అవమాన పడికూడా ఊరకుండక ఇవ్వాడు ఆనందసింహునిమీాద విజృంభించాడు. కాని తారాసింహుడూ, ఆనందసింహుడూ తమ జవనాశ్వాలను వాళ్ళమీాదకు ఉరికించి వాళ్ళను ఊపిరి సలపకుండా చేశారు. అంతలో ఇంద్రజీతుడుకూడా వారికి తోడుగా వెళ్ళి వాళ్ళనందరనూ బందీలుగా పట్టుకొన్నాడు. ఆసందర్భంలో కొందరు పారిపోవటం జరిగింది గాని వాళ్ళను గురించి అంతగా లెక్కపెట్టక మిగతావాళ్ళతో యువరాజు ఇంటిముఖంపట్టాడు.

దుర్మార్గుడైన నానక్‌కు మహారాజు తనను క్షమించి విడిచిపెట్టినప్పటికీ బుద్ధిరాలేదు. మహారాజు అతనిని చెరలో పెట్టవలసినదిగా ఆజ్ఞాపించాడు. ఈసారి అతనికి కఠిన శిక్ష పడుతుందని అందరూ భావించారు.

మరునాడు రాజదర్బారు జరిగింది. ఖైదీల విచారణను వినాలనే ఉద్దేశంతో చాలామంది ప్రజలువచ్చారు. రాజభటులు చేతులకు కాళ్ళకు బేడీలువేసి ఖైదీలను తీసుకొని వచ్చారు. మహారాజు సపరివారంగా దర్బారులో ప్రవేశించాడు. జయజయధ్వానాలు దిక్కులు పిక్కటిల్లగా సురేంద్రసింహమహారాజు సింహాసనంమీాద కూర్చున్నాడు. భరతసింహుడూ, దిలీప్‌షా, అర్జునునితోపాటు ఇంటికివెళ్ళివస్తామని చెప్పిన మిగతా ఇద్దరుకూడా వచ్చారు. వాళ్ళిద్దరూ నల్లని

ముసుగులు ధరించి గోపాలసింహుని సమీపాన కూర్చుండి రాజాజ్ఞకొరకు ఎదురుచూస్తున్నారు.

రాజాజ్ఞప్రకారం భరతసింహుడు లేచి సాధువునూ జయపాలుడిని ఉద్దేశించి—

"సాధుపుంగవా! కొద్దిగా ఇటుచూచి నే నెవరనో గుర్తించండి! జయపాలా! నీవూ ఇటుచూడు! అని ముసుగును తొలగించాడు.

అతనిని చూచి సాధువూ జయపాలుడూ వణికిపోయారు. కంపితస్వరంతో సాధువు "ఎవరూ? భరతసింహుడా కాదు. అతడేనాడో మరణించాడు. ఇతడెవరో ఇంద్రజాలికుడు" అన్నాడు.

భరత:— లేదు సాధుమహాశయా! మీవల్ల నానా హింసలుపడిన భరతసింహుడినే! వినండి నా వృత్తాంతం చెబుతాను.

. సాధువుమాటలు నమ్మి నేను మోహనుడనే వైద్యుణ్ణి తీసుకొనిరావటానికి వెళ్ళాను. నాకు వీళ్ళిద్దరూ ఒకటైనసంగతి తెలియదు. మోహనుణ్ణి ఆయన గదిలో కలుసుకున్నాను. అక్కడ గోపాలసింహమహారాజు అనారోగ్యపరిస్థితిని చెప్పి రావలసిందిగా కోరాను. అతడు సరేనని చెప్పి లేచి అలమరలో మందులసీసాలను తీస్తూ ఒక సీసాను నాచేతికిచ్చి "ఈ మందును నేను ప్రత్యేకంగా చేశాను. దీనిని వాసన చూచినంతమాత్రానే శరీరంలో నూతన చైతన్యం కలుగుతుంది. కాస్తవాసన చూడండి అన్నాడు. నేనతని మాటలు నమ్మి ఆ మందు సీసామూత తీసి వాసనచూచి తెలివిదప్పిపడిపోయాను.

నాకు తెలివివచ్చి చూచేసరికి నేనొక చీకటికొట్లో బంధితుడ నయి ఉన్నాను. అది పగలో రాత్రోకూడా తెలియదు. గదిలో ఒక మూల దీపం వెలుగుతోంది. సాధువు జయపాలుడు కత్తులు తీసుకొని నా ప్రక్కనే కూర్చున్నారు.

"నేనూ హరదీనూ కలసి చేసిన పనులన్నిటినీ సాధువు ఊహించి, చివరకు నన్నొక షరతుమీద విడిచిపెడతానన్నాడు. అదేమంటే మంథరను రాణిగా చేసే కార్యక్రమంలో నాకూ భాగమున్నట్లూ, అందుకుగాను నాకు రావలసిన వాటా నాకివ్వమన్నట్టూ ఒక లేఖను వ్రాయాలట! నేను అలా వ్రాసియిచ్చేదీ లేనిదీ మరునాడు చెబుతానని వాయిదా వేశాను. వాళ్ళు వెళ్ళిపోయారు.

"ఆవిధంగా వ్రాసిన తర్వాతకూడా నన్ను సాధువు చంపుతాడని నాకు తెలుసు. ఆ ఉత్తరంతో నాజీవితాన్ని అవమానాలపాలు చెయ్యాలని అతని ఉద్దేశం. నా మిత్రుడు నన్ను అసహ్యించుకొంటాడు. లోకమంతా నన్ను దుర్మార్గుడని ఆడిపోసుకొంటుంది. ఎలాగూ చావసిద్ధమైనవాణ్ణి ఈ అవమానాన్ని తలకెందుకు ఎత్తుకోవాలని నిశ్చయించుకొన్నాను. మరునాడు సాధువూ రఘువరసింహుణ్ణి అంటే జయపాలుణ్ణి తీసుకొని వచ్చాడు.

భరతసింహుని మాటలకు గోపాలసింహుడు అడ్డంవచ్చి, "ఈ జయపాలుడే రఘువరసింహుడా?" అని అడిగాడు.

భరత :— అవునండీ! ఇతడే! ఇతడే కొన్నాళ్ళు తన పేరును భూతనాథుడనికూడా పెట్టుకొన్నాడు.

గోపాల :- అలాగా! నేనే మోసపోయాను. కాదు; నా కోశాధికారి మోసగించాడు సరే! తరువాత?

భరత :- సరే! ఉత్తరం వ్రాసియిస్తావా లేదా అని అడిగారు. లేదని చెప్పాను నేను. వాళ్ళిద్దరూ నన్ను ఘోరంగా హింసించి వడ వేసిపోయారు. మరునాడు మళ్ళా వచ్చారు. నేను నా నిశ్చయాన్ని మార్చుకోలేదు. గుడ్డం గుగ్గిళ్ళతినే సంచిలో కారంపోసి నా ముఖానికి కట్టారు. నేనెంత అవస్థపడ్డానో ఆ దేవుడికి తెలుసు.

"ఆవిధంగా ఎనిమిదిరోజులపాటు నాకు అన్న నీరాలు ఇవ్వకుండా యమయాతనలు పెట్టారు. విషమిశ్రిత గంధం నా శరీరానికి పూశారు. బావిలో వ్రేలాడదీశారు. దుర్వాసన గల గదిలో బంధించారు. చివరకు నేను మాట్లాడలేని పరిస్థితులోనికి వచ్చాను. ఎనిమిదవరోజు అర్ధరాత్రాన నా గదిలోనికి ఒక ముసుగుమానిసి వచ్చాడు. అతని ఒక చేతిలో కత్తీ, మరొక చేతిలో ఒక మూటా ఉన్నాయి. అతనికి చేతిలోవున్న కత్తిగాక నడుముదగ్గర మరో కత్తికూడా ఉన్నది. అతడు గది లోనికి వచ్చి తలుపులు వేసుకొని కత్తీ మూటా నాదగ్గర పెట్టి నన్ను కౌగలించుకొని యేడవటం మొదలెట్టాడు. అతని అనురాగాన్ని చూచి హారదీన్ అని గుర్తించాను. ముసుగు తొలగించి హారదీన్ ముఖంలోనికి చూస్తూ నేనూ ఏడ్చాను.

"అతడు తాను తెచ్చిన భోజనాన్ని నన్ను తినమన్నాడు. రావటమైతే వచ్చానుగాని పోవటం చాలా కష్టమే అయినా శత్రువును దెబ్బతియ్యనిదే వదలను అన్నాడు. నేను భోజనం చేసినతర్వాత నాచేతికొక కత్తి యిచ్చి తన వెనుక

రమ్మన్నాడు. నేను కొని తెచ్చుకొన్న బలంతో అతణ్ణి అనుసరించాను. ఆ గది విడిచిపెట్టిన తర్వాత నేను ఉద్యాన వనంయొక్క మూడవ భాగంలో ఉన్నానని తెలిసింది. గోపాల సింహునితో కలసి అక్కడికి నేను చాలా సార్లు వచ్చాను. అటువంటి చోటనే సాధువు మహారాజుకు ఏమాత్రం తెలియ కుండానే నన్ను విపరీతహింసలకు గురిచేయటం నాకు ఆశ్చర్య కారణమైంది. నన్ను బందీగా ఉంచినచోటు సాధువు ఒక్క నికేగాక ఇతరులకు తెలియదా? అనిపించింది. మేము తప్పించు కొని పారిపోతున్నాం. మా వెనుకనుండి సాధువు రావటం కనిపించింది. అతడు మమ్మల్ని పట్టుకోవాలని చూచాడుగాని హారదీన్ అతణ్ణి ఎదుర్కోటానికి సన్నద్ధుడయ్యాడు. అందుచేత అతడు మమ్మల్ని తాకకుండా మూర్ఛిల్లచేయటాకి విష ధూమాన్ని వ్యాపింపజేసే ఉండ విసిరాడు. దాని సంగతి హారదీన్‌కు తెలుసు గనుక అతడు నన్ను తీసుకొని మరింత వేగంగా ముందుకు సాగాడు. అప్పుడొక ఎత్తైన శిలావేదిక కనిపించింది. దానిమీదకు మేమిద్దరం ఎక్కేసరికి అది భూమిలో దిగబడిపోయింది. ఆ తర్వాత మాకు తెలివివచ్చి చూచేసరికి మేము రాకుమారులు కలుసుకొన్న ఆ బురుజున్న తోటలో ఉన్నట్లు తెలిసింది. అక్కడనుంచి రాకుమారులు మమ్మల్ని తీసుకొనివచ్చేవరకూ అక్కడే ఉన్నాం. అక్కడే దిలీప్‌షా కూడా మమ్మల్ని కలిశాడు. అడుగో ఆ ముసుగుమానిసే ఇంతకాలం నా సుఖదుఃఖాలలో పాలుపంచుకున్న నా ప్రియ మిత్రుడు హారదీన్. ఇదే నా జీవిత వృత్తాంతం.

ఆ తర్వాత మహారాజు తదుపరి విచారణ మరునాటికి వాయిదా వేశాడు.

# 11

మరునాడు రాజసభ యేర్పాటు అయింది. రాజాజ్ఞ ప్రకారం దిలేప్షా, సాధువూ, జయపాలుడూ, బేగమూ, నాగరూ వగైరాలను వుద్దేశించి తన జీవన వృత్తాంతాన్ని చెప్పటం ప్రారంభించాడు.

"ఓ పాపాత్ములారా! మీ రోజులు గతించాయి. ఒక నాడు మీరు హద్దులెరుగని దుర్వ్యాపారంతో మమ్మల్నందరినీ హతమార్చాలని విపరీత ప్రయత్నం చేశారు. కాని ఇవ్వేళ వారందరూ సజీవితులుగానే ఉన్నారు. ఏడుస్తూ ఉన్న మీ ముఖాల యెదుటనే ఆనందోత్సవాలతో కలకల లాడుతున్నారు.

సరే ఆ విషయమంతా విడిచిపెట్టి ఓ మహాశయులారా నేను నా విషయం చెబుతాను. నాకూ భూతనాథునికీ చాలా దగ్గరి సంబంధమున్నది. ఆ సంబంధమంతా అతడు వ్రాస్తున్న తన జీవిత కథలో ఎలాగూ వస్తుంది. అప్పుడు మహారాజు స్వయంగా దానిని చదివి తెలుసుకొంటారు.

నేను మిర్జాపూరు నివాసినైన దీనదయాళసింహుడనే ఇంద్రజాలికుని పుత్రుణ్ణి. నా తండ్రి ధౌలపూరురాజు కొలువులో ఉండేవాడు. అక్కడ ఆయనకు చాలా గౌరవాదరాలు లభించేవి. ఆయన నాకు బాగా మాయాజాలం నేర్పాడు. ఆయన మరణానంతరం నేను మిర్జాపురంలో నా తండ్రి సంపాదించి

యిచ్చిన ఆస్తిని అనుభవిస్తూ వచ్చాను. ఆ తర్వాత మా తల్లి కూడా మరణించింది. ఇక ఇంటిలో నేనూ నా భార్యమాత్రమే మిగిలాము. జమానియా రాజ్యంతో నాకేవిధమైన సంబంధమూ లేకపోయినా నేను ప్రసిద్ధి చెందిన ఇంద్రజాలికుణ్ణి కావటంవల్ల ఆక్కడేమి జరుగుతుండేదీ నాకు తెలుస్తూ ఉండేది. భూతనాధుని భార్యా, నా భార్యా అక్కచెల్లెండ్ర బిడ్డలు. అందుచేత నాకు జమానియా విశేషాలు ఎక్కువగా తెలుస్తుండేవి. ఈ సాధువు పైకి అతి పవిత్రుడుగానూ, నిష్కపటిగాను కన్పిస్తున్నా లోపల వీడివంటి అపవిత్రుడూ, కపటి మరొకడుండబోడనే విషయం నేను ప్రత్యేకించి మీకు తెలియజేయవలసిన పని లేదు.

"మాతండ్రి, ఇంద్రదేవునితండ్రీ ఒక గురువువద్దనే విద్యాభ్యాసం చేశారు. అందుచేత నాకూ ఇంద్రదేవునికికూడా రాకపోకలుంటూ ఉండేవి. అతని ద్వారానే నాకు జమానియాతో పరిచయం ఏర్పడింది. సాధువు గోపాలసింహుడూ భరతసింహుడూ మొదలైనవారు పరిచితులయ్యారు. భూతనాధుడు నిష్కారణంగా దయారాంను చంపిన తర్వాత మా యిద్దరి మధ్యా భేదాభిప్రాయాలు ఏర్పడ్డాయి.

"ఒకసారి నేను యింద్రదేవుని యింట అతనితో భూతనాధుని గురించి మాట్లాడుతున్నాను. ఆ రోజులలో అతడు చనిపోయాడని ప్రతీతిగా ఉండేది. అతన్ని గురించి ఇంద్రదేవుడు అతడెప్పటికీ చచ్చిఉండడు. ఒకనాడు అమాంతంగా బయట పడతాడని చెప్పాడు. ఆ సమయంలో ఇంద్రదేవునికి సాధువు వచ్చాడని తెలిసింది. ఇంద్రదేవుడు గౌరవపురస్సరంగా సాధు

వును నేనున్న గదిలోనికి తోడ్కొని తెచ్చాడు. నేనుమాత్రం అతనికి ఎదురేగి స్వాగతమివ్వలేదు సరిగదా గదిలోనికి వచ్చిన తర్వాతకూడా అతన్ని చూచి లేవటంగానీ నమస్కరించటం గాని చెయ్యలేదు. అందువల్ల సాధువు నామీద చాలా కోపం తెప్పించుకున్నాడు. ఇంద్రదేవునికి నేనిలా చెయ్యటం వల్ల ఏం కష్టం కలగలేదు. అతడూ సాధువంటే లోలోన అసహ్యించుకుంటూనే ఉన్నాడు. అయితే గురుసోదరుడు గనుక మర్యాద చెయ్యక తప్పలేదు. వాళిద్దరూ చాలాసేపు మాట్లాడుకొన్న తర్వాత సాధువు నావైపు తిరిగి "మీరు చాలా ప్రసిద్ధిగల ఐంద్రజాలికుని కుమారులైఉండి పనిలేకుండా ఎందుకు కూర్చున్నారు? ఎక్కడా పనిలేకపోతే నా రాజ్యం లోనికి రండి! అక్కడ మీకు ఉద్యోగమిస్తాను. హాయిగా ఉండవచ్చు. బీహారిసింహుడు హరనామసింహుడు బాగా బ్రతుకుతున్నారు. మీరు వాళ్ళకంటేకూడా ఎక్కువగా గౌరవం పొందుతారు?" అన్నాడు.

నేను:- నేను ఖాళీగా ఉన్నప్పటికీ ఇప్పటికీ చాలపూరు సంస్థానాధీశ్వరుని కొలువులో ఉన్నట్లే భావించుకొంటున్నాను. సంస్థానంలో పనిచేయకపోయినప్పటికి నాకు అక్కడనుంచి కొద్దిగానో గొప్పగానో పైకం నెల నెలకూ వస్తూఉంటుంది.

సాధువు:- అయితేమాత్రం ఏమయ్యా! ఆ కొద్దిపాటి మొత్తం నీ కే మూలకు సరిపోతుంది. నీకు తెలుసుగా ఇంటి నుండి కూడా ఎంతకర్చవుతున్నదీ?

నేను:- అదిమాత్రం మహారాజు ఇచ్చింది కాదా?

సాధువు:— ఎందుకవుతుందీ? అది మీ తండ్రి సంపాదించింది. అయినా ఈ గొడవంతా ఎందుకు? అక్కడనుంచి వచ్చిందికూడా పుచ్చుకోండి! మా దగ్గరకూడా పనిచేసి లాభం పొందండి.

నేను:— అట్లా చెయ్యటం బుద్ధితక్కువా, కృతఘ్నతా అవుతుంది. ఆ పని నావల్ల కాదు.

సాధువు:— (నవ్వి) భళే! ఇంద్రజాలికులు రాత్రింబగళ్ళు నమ్మకాలనే గుట్టలుగా వేస్తున్నారు కాబోలు!

నేను:— (ఉద్రేకంగా) తిప్పకుండాను. అలా ఎవరైనా చెయ్యకపోతే వాళ్ళు రాజ్యానికి చీడపురుగులే అన్నమాట.

సాధువు:— అలాగా! గదాధరసింహుడు తమకు బంధువుకూడా కాబోలు! మరి వారి సంగతేమిటో!

నేను:— అతడు ఏ రాజు కొలువులోనూ లేడు. అతణ్ణి నేను ఇంద్రజాలికుడుగా భావించటంలేదు. అయినప్పటికీ మీరతణ్ణి స్వామిద్రోహం చేసినట్లుగా ఋజువు పరచలేరు.

సాధువు:— అబ్బా! చాలులెండి. మాకు బీభత్ససింహుడు, మారనామసింహుడు ఉన్నారుగాని——

నేను:— అందుకే నేను మీ సంస్థానంలో అడుగు పెట్టటం అగౌరవంగా భావిస్తాను.

సాధువు:— అంటే అర్థం, మేము స్వామిద్రోహం చేసేవాళ్ళమూ, బుద్ధిహీనులమూ అనేనా?

నేను:— ఆసంగతి మీకే తెలుసు.

సాధువు:— నోరు జాగ్రత్తగా పెట్టుకొని మాట్లాడండి! లేకపోతే నేనెటువంటి వాడినో తెలియదేమో!

నేను :- మీరు సాధారణ మనుష్యులు కారని నాకు ముందే తెలుసు. ఎందుచేతనంటే సాధారణంగా మానవుడన్న వాడికి లజ్జా అభిమానమూ ఉంటాయి. చివరకు దైవభీతి అయినా ఉంటుంది—

సాధువు :- మళ్ళీ అవేమాటలు ! మాట్లాడు తున్నావు !

నేను :- అవును ! అవేమాటలు ! గోపాలసింహుని తండ్రిమాటలు ! రహస్యసంఘం మాటలు గదాధరసింహునితో స్నేహం మాటలు ! లక్ష్మీదేవి వివాహం మాటలు ! ఇంకా మీ గురుసోదరునికి తెలియని మాటలు !

సాధువు :- (పండ్లు గీటుతూ నావంక చూచి) "సరే; ఈ మాటలన్నిటికీ తన్నులే బదులు చెబుతాయి.

నేను :- తప్పకుండా, అంతేకాదు సమాధానమిచ్చే వాళ్ళు ఒకరిద్దరు కారని తెలుసుకోండి ! అప్పుడు మీరు తన్నులుకూడా లెక్కపెట్టుకోలేరు. సాధు మహాశయా ! ఒడలు దగ్గరపెట్టుకొని మాట్లాడండి. మిమ్మల్ని మీరు దేవు డనుకుంటున్నారేమో ! జాగ్రత్త ! మీరూ మనుష్యులే ! చాలపూరు ఇంద్రజాలికునితో మాట్లాడుతున్నామని తెలుసు కోండి.

సాధువు :- (ఇంద్రదేవునితో) ఏమయ్యా; మీ ఇంట్లో నన్నవమానిస్తుంటే చూచి ఊరుకుంటున్నావా ?

ఇంద్రదేవుడు :- అయ్యా ! మీరే మిమ్మల్ని అవమా నితుల్ని చేసుకోటానికి ప్రారంభించారు. ఇతనితో మాటలు పెంచుకోవలసిన అవుసరం మీకేంవచ్చింది ? మీ ఇద్దరిమధ్యా

నేను మాట్లాడలేను. దిలీప్‌షా నాసహోదరునితో సమానమైన వాడు.

సాధువు :- అయితే యితనిసంగతి మేమే చూచుకొంటాం.

ఇంద్రదేవుడు :- తప్పకుండా చూచుకోండి.

సాధువు :- చివరకు తమ్ముడని వెనకేసుకొని రావుగదా !

ఇంద్రదేవుడు :- అబ్బే; రాను.

సాధువు :- సరే ! అయితే నేను వెడతాను. మళ్ళా వచ్చినప్పుడు మాట్లాడతాను.

ఇంద్రదేవుడు సాధువుకు సమాధానం చెప్పకుండా అతడు వెళ్ళిపోతుంటే సాగనంపివచ్చాడు. వచ్చిన తర్వాత నాతో నవ్వుతూ "నీ గురుసోదరునికి తెలియని మాటలు అని నువ్వు బలే దెబ్బకొట్టావు. ఆ మాటలు అతనికి గుండెలలో బాకులుగా దూసుకొనిపోయాయి. కాని మండిపడుతూ వెళ్ళాడు. జాగ్రత్త ! అన్నాడు.

"అందుకు మీరేమీ భయపడనవసరంలేదు. వీడిని ఏం చేస్తానో చూడండి ! అని చెప్పి నేను వెళ్ళిపోయాను. ఇంటికివచ్చి ఈ విషయమంతా నా భార్యతోనూ, శిష్యులతోనూ చెప్పాను. శిష్యులలో గిరిజాకుమారుడనే యువకుడొకడున్నాడు. అతడు అతిచతురుడు. ఎదుటివారు మాట్లాడుతున్నప్పుడు అతడు తనముఖాన్ని అదొకరకంగాపెట్టి వాళ్ళను తన వశపరచుకొంటాడు. ఆ ప్రజ్ఞ ఇంద్రజాలికులలో చాలా తక్కువమందికి ఉంటుంది. అతడు సాధువును ఏడిపించటానికి

తనను వంపించవలసిందిగా ప్రార్థేయపడ్డాడు. నేను ఒప్పుకొనీ ఒప్పుకొనక మునుపే అతడు సర్వసన్నద్ధుడై జమానియాకు ప్రయాణమై వెళ్ళాడు.

"నిజానికి మనోరమ సాధువుయొక్క ఉంపుడు కత్తె. అతని కారణంగానే మాయరాణి దర్బారులో మనోరమ బాగా గౌరవించబడుతూ ఉండేది. ఈ అవకాశాన్ని వినియోగ పరచుకొని మాయారాణిని వంచించి ఆమె బాగా డబ్బు కూడబెట్టుకొన్నది. గిరిజాకుమారుడు తోలుదొల్త సాధువును మనోరమ యింటిలోనే కలుసుకొన్నాడు. మనోరమఅంటే సాధువుకు అపరిమితమైన వ్యామోహం. కాని ఈ విషయం ప్రపంచానికి తెలియకుండా బయటికి విరాగిగానూ బ్రహ్మ చారిగానూ కనిపించేవాడు. తాను స్వయంగా జమానియాలో ఉంటూ మనోరమ కొరకు కాశీలో ఒక భవనాన్ని కట్టాడు. గాలి మళ్ళినప్పుడల్లా రథం మీదనో గుర్రంమీదనో కాశీలో వ్రాలుతుండేవాడు. మనోరమా ప్రణయరసం ఆస్వాదించిన మీదట తిరిగిపోతూ ఉండేవాడు.

"ఒకనాడు అర్ధరాత్రివేళ సాధువు మనోరమ యింటిలో ఆమెతో కలసి మధుపానం చేస్తున్నాడు. అప్పుడు వాళ్ళిద్దరి మధ్యా జరిగిన సంభాషణ యిది—

సాధువు:— నా దగ్గరవున్నదంతా నీదే! డబ్బుకోసం నీవెప్పుడూ బాధపడనవసరంలేదు. నీవు హాయిగా కాలం వెళ్ళబుచ్చు. గోపాలసింహుడు ఇంద్రజాలానికి రాజయితే నేను దాని ప్రధానసంరక్షకుడిని. ఆ ఇంద్రజాలంలోని కొన్ని ప్రత్యేకస్థలాలు రాజుకుకూడా తెలియవు. అక్కడ ఉన్న సంప

దఅంతా నాది. అంతేగాక నీకుమాయారాణి పరిచయంకూడా చేశాను. ఆమె నిన్ను చాలా గౌరవిస్తుంది. నీకేం ఫరవాలేదు.

మనోరమ:- మీదయవల్ల నాకేవిధమైన లోటూలేదు గాని మాయారాణిదగ్గరకుమాత్రం రహస్యంగా వెళ్ళవలసి వస్తోంది. గోపాలసింహునివల్ల భయాన్నికూడా దూరంచేసి నే నామెను స్వేచ్ఛగా కలుసుకొనే యేర్పాటుచెయ్యండి.

సాధువు:- ఈ పని చాలాకష్టమే !

మనోరమ:- అబ్బో, ఏంకష్టం ! లక్ష్మీదేవి స్థానంలో ఇంకొకస్త్రీని మహారాజ్ఞిగాచేసినవారికి ఈపని కష్టమంటే నేను నమ్మను.

సాధువు:- అవుననుకో! నేను తలచుకొంటే గోపాల సింహుణ్ణి తేలికగానే వైకుంఠానికి ప్రయాణం గట్టించగలను. గాని ఆపని నాచేతితో కాదు. అతనిమీదకు నాచెయ్యిపోదు.

మనోరమ:- మరీ యింతజాలిగుండె అయితే ఎట్లా ? అతడు చాలా ఆటంకంగా వున్నాడు. అతన్ని లేకుండాచేస్తే జమానియా ఇంద్రదలాలానికి మీరు సర్వాధికారులౌతారు. మాయారాణి మీచేతిక్రింద పడివుంటుంది.

సాధువు:- అవునుగానీ......

మనోరమ:- అందులో మీరేమీ చెయ్యానవసరంలేదు. అంతా మాయారాణి చేసుకుపోతుంది.

సాధువు - ఎమిటీ; మాయారాణికూడా ఇట్లాగే అనుకొంటున్నదా?

మనోరమ:- అవునండీ; ఆమె యెప్పుడో సిద్ధమైంది. అయితే మిమ్మల్ని చూచి భయపడుతోంది. మీరు 'ఊఁ' అంటే అంతేచాలు.

సాధువు:- సరే, నీముఖంచూచి కాదంటానా? కాని ఈవిషయంలో మాయారాణికీ నాకూ సంప్రదింపులుమాత్రం జరగకూడదు. ఆమె యిష్టంవచ్చినట్లు ఆమెను చెయ్యమను నేనుమాత్రం అడ్డురాను. ఎప్పుడైనా ఈ విషయాన్నిగురించి నేను చెప్పవలసివస్తే 'నాకేమీ తెలియదు' అనగలఅవకాశం మాత్రం నాకుకావాలి. కాని సాధ్యమైనంతవరకు గోపాల సింహుడు సహజంగానే మరణించాడని లోకానికి తెలియటం అవసరం నేనుకూడా ఈవిషయాన్ని బయటకు పొక్కకుండా చేస్తాను.

మనోరమ:- అబ్బా! చాలండీ! మీరు నన్ను ప్రేమిస్తున్నారనటానికి ఇదొకగొప్ప నిదర్శనం.

"ఆతర్వాత వాళ్ళిద్దరూ ఏదో నెమ్మదిగా మాట్లాడుకొన్నారు. ఆమాటలు గిరిజాకుమారునికి వినిపించలేదు. దొంగలాగా అతడాయింటదూరి ఈమాటలు విన్నాడు. మనోరమ గదితలుపులు వేసుకొన్నతర్వాత త్రాటిచుట్టపల్ల పెరటివైపు దిగాడు. మనోరమ అశ్వశాలలో దూరాడు. సాధువువచ్చిన రథం అక్కడేవున్నది. సారథి నిద్రపోతున్నాడు. మనోరమ భృత్యులు మొదలైనవాళ్ళు దూరంగా మంచినిద్రలోవున్నారు. గిరిజాకుమారుడు చాలా తెలివిగా రథసారథికి మత్తుమందుపెట్టి అతన్ని తోటలో చెట్లచాటున దాచాడు. అక్కడ అతనిదుస్తులను తాను ధరించి రథంలో పడుకొన్నాడు.

ఇక తెల్లవారుతుండనగా సాధువు జమానియాకు ప్రయాణమైనాడు. ఒక దాసీ వచ్చి గిరిజాకుమారుణ్ణి లేపి రథాన్ని సిద్ధంచెయ్యమని చెప్పింది. అతడు రథాన్ని సిద్ధంచేసి వాకిటముందు నిలిపాడు. విపరీతంగా మద్యం త్రాగి మత్తుడైన సాధువు దాసీదాని చేతి ఆసరాతో రథంలోనికి వచ్చి కూలబడ్డాడు. రథం అత్యంత వేగంగా ప్రయాణమైంది. ప్రాంతఃకాలపు చల్లని మలయమారుత పరిష్వంగంలో సాధువు మహాశయుడు గుఱక పెట్టి నిద్రపోతున్నాడు. గిరిజాకుమారుడు రథాన్ని రోహితగఢపు దిక్కుగా మఱల్చి తన వేషాన్ని కూడా మార్చుకొన్నాడు. సాధువు ఈ మధ్యలో లేవకుండా మరి కాస్త మత్తుమందును తగిలించాడు. ఇక్కడ నిజమైన సారథీ యెప్పుడు మేల్కొన్నాడో అని గిరిజాకుమారునికి ఆలోచన కలుగలేదు. రథం రోహితగఢపు అడవులలో చేరుకొన్నది. ఒకనిర్జన ప్రదేశాన్ని చూచి గిరిజా కుమారుడు దాన్ని ఆపి సాధువును ఒక చెట్టుకు కట్టివేశాడు. అతని మత్తు వదలించి యెదురుగా కొరడా పుచ్చుకొని నిలబడ్డాడు.

సాధువు మేల్కొని తన అసహాయపరిస్థితిని చూచి వణకిపోయి తన యెదురుగా ఉన్న అపరచితునితో "ఎవరవు నాయనా నువ్వు. నీకునేం అపకారం చేశానని యిట్లా వంచించావు?" అన్నాడు

గిరిజ:— ఏంచెయ్యమంటారు? మా జయమాని ఉత్తరువు అలాంటిది.

సాధువు:— ఎవరు నీ యజమాని?

గిరిజ:- నేను మనోరమగారి నౌకరును. ఆమె నన్నీ పనికి ఆజ్ఞాపించింది.

సాధువు:-ఏమిటీ? నువ్వామె నౌకరువా? కాదు. ఆమె నౌకర్లందరినీ నేను ఎరుగుదును.

గిరిజ:- కాని మీరు నన్నెరుగరు. ఆమె రహస్య కార్య కలాపాలలో నేను పాల్గొంటాను. ఇంటిదగ్గఱ సాధారణంగా ఉండను.

సాధువు:- ఏమో! నాకు నమ్మకం కుదరటంలేదు. ఇంతకూ ఆమె నన్నెందుకిలా చెయ్యమని ఆజ్ఞాపించింది?

గిరిజ:- మీరు నమ్మితే ఎంత? నమ్మకపోతే ఎంత? నేను నా కర్తవ్యాన్ని నిర్వహించక తప్పదు. ఆమె నాతో ఏం చెప్పిందంటే సాధువు గోపాలసింహుణ్ని వధించ వల సిందిగా మాయారాణికి అనుమతి యిచ్చాడు. అయితే ఈ మాట అతడు త్రాగుడు మైకంలో అన్నాడు, కనుక మత్తు విడిచినతర్వాత వ్యతిరేకించవచ్చు. అందుచేత ఏ విధంగానైనా అతనిద్వారా తాను గోపాలసింహుణ్ని వధించటానికి మాయా రాణికి అనుమతి ఇచ్చినట్లు అతనిచేత వ్రాయించి తీసుకోనిరా. అతనికి తన వాగ్దానం గుర్తుంటుంది.' అని చెప్పింది.

సాధువు:- నువ్వంటున్నదేమిటో నాకు అర్థం కావటం లేదు. అటువంటి వాగ్దానం నేను మనోరమ కివ్వలేదే!

గిరిజ:- బహుశః ఆమె అబద్ధమాడిందేమో నాకు తెలియదు. కాని ఆమె ఆజ్ఞను నేను పరిపాలించక తప్పదు.

సాధువు:- మనోరమ విషయం నాకు చాలా ఆశ్చ ర్యాన్ని కలిగిస్తోంది. ఆమె తనకు కావలసిందేదో నాయెదుటే చెప్పవచ్చుగా.

గిరిజ:- ఆ సంగతి నాకేం తెలుసండీ.

సాధువు:- అయితే నీవు కోరినట్లుగా నేను వ్రాసి ఇవ్వకపోతే ఏం చేస్తావు ?

గిరిజ:- ఇదిగో చేతిలో కొరడా చూస్తున్నారుగా, దీనితో మీ చేత వ్రాయించుకొనే తీరుతాను. ఇక్కడ మీకెవరూ సహాయ పడేవాళ్ళు లేరు.

సాధువు:- ఒకవేళ ఉత్తరం వ్రాసి యిచ్చి బయటపడిన తర్వాత ఏం చేస్తానో నీకూ, మీ మనోరమకూ తెలియదూ?

గిరిజ:- ఆ సంగతులన్నీ మీరు ఆమెనే అడిగి తెలుసు కోండి. నాకవన్నీ అనవసరం. మీరు తొందరగా పని పూర్తి చేసి వంపండి.

సాధువు:- చాలు చాలు! అనవసరంగా ప్రగల్భాలు చెప్పకు. వ్రాతా గీతానూ.

ఆ వెంటనే గిరిజాకుమారుడు చుర్రున కొరడాదెబ్బ తగిలించాడు. ఏ డెనిమిది దెబ్బలు పడినతర్వాత సాధువు వీపు ముఖంపెట్టి "క్షమించరా నాయనా! నువ్వు వ్రాసి ఇవ్వమన్నట్టే వ్రాసియిస్తా గాని——" అన్నాడు.

వెంటనే గిరిజకుమారుడు కలం కాగితం అతనిచేతికి ఇచ్చాడు. సాధువు అతడు కోరినట్లుగా వ్రాసిచ్చాడు. గిరిజా కుమారుడు ఆకాగితాన్ని భద్రపరచుకొని సాధువును సోదాచేసి

అతనిదగ్గరవున్న కత్తిని, కొన్ని వరహాలనూ స్వాధీనపరచుకొని విడిచిపెట్టాడు.

"తర్వాత సాధువు ఏమైందీ ఎక్కడకు వెళ్ళిందీ తెలియదు."

## 12

దిలీప్‌షా తిరిగిచెప్పటం ప్రారంభించాడు.

"గిరిజాకుమారుడు మాత్రం సాధువును అంతటితోనే విడిచిపెట్టదలచలేదు. అడడు తిన్నగా జమానియా చేరుకొంటాడో? మనోరమ దగ్గరకే వెళతాడో చూడాలనుకొన్నాడు. మనోరమ దగ్గరకేవెళ్ళితే అక్కడేమి జరుగుతుందో తమాషా చూడాలనుకొన్నాడు.

"సాధువు మొదట గిరిజాకుమారుణ్ని అనుమానించిన తర్వాత అతనికి మనోరమమీాద అనుమానమే కలిగింది. ఆ యిద్దరిమధ్యా జరిగిన సంభాషణ ఇతరులకు తెలియదనే అతడనుకొంటున్నాడు. కాని ఈ విధంగా మనోరమ ఎందుకు చేసిందో అతనికి అర్థంకాలేదు. తానెప్పుడూ ఆమెకు విరుద్ధంగా ప్రవర్తించి యెరుగడు. ఒకవేళ ఆమె ఈ రకపు ఉత్తరాన్ని కోరివుండినట్లయితే అతడు వ్రాసియిచ్చేవాడే!

"తిన్నగా జమానియావైపు సాధువు రథాన్ని తోలుకొని పోతున్నాడు. అదిచూచి గిరిజాకుమారుడు తిన్నగా నా దగ్గరకు వచ్చాడు. తానుచేసిన వ్యవహారమంతా చెప్పి ఆ చీటీ నా చేతికిచ్చి తిరిగి జమానియా వెళ్ళాడు.

"నాకు గోపాలసింహుడు ప్రమాదంలో పడుతున్నాడనే విచారం పట్టుకొన్నది. వెంటనే ఈ విషయాన్ని ఇంద్రదేవునికి తెలియజేద్దామనున్నాను. ముందుగా నేను నా యింటిని భద్రపరచుకోవలసిన అవసరమున్నది గనుక నా భార్యనూ పిల్లలతో రహస్యంగా పుట్టింటికి పంపించి ఇంటికి చేయవలసిన రక్షణయేర్పాట్లుచేసి ఇంద్రదేవుని దగ్గరకు ప్రయాణమయ్యాను

"ఇంద్రదేవుని యింటికి వెళ్ళేసరికి అతడు ప్రయాణసన్నాహంలో ఉన్నాడు. ఎక్కడికని అడిగితే "గోపాలసింహుడు జబ్బుతో ఉన్నాడు. చూచిరావాలని చెప్పాడు. నా నోటినుంచి హఠాత్తుగా "అయ్యయ్యో! దుర్మార్గులు తమపని అప్పుడే ముగించివేశారు." అని వచ్చింది. అత డాశ్చర్యపడి యేమిటలా అన్నావు? అన్నాడు. నేను గిరిజాకుమారులు నాకుచెప్పిన ఉదంతాన్ని అతనికిచెప్పి ఆ ఉత్తరాన్నికూడా ఇచ్చాను. ఇంద్రదేవుడు నిర్విణ్ణుడైపోయాడు. ఆ తర్వాత తెప్పరిల్లి తనతోపాటు నన్నుకూడా జమానియాకు రమ్మన్నాడు. గోపాలసింహుడు బ్రతికి ఉంటే ఎలాగైనా రక్షించాలని అతని పట్టుదల. వెంటనే జమానియాకు గుఱ్ఱాలమీద ప్రయాణమయ్యాం. మేమింకా జమానియాకు ఒక క్రోసెడు దూరంలో ఉండగానే గ్రామస్థులు గోపాలసింహ మహారాజు మరణించాడని భోరున ఏడుస్తూ మాకు ఎదురైనారు. ఆ వర్తమానంవిని మా గుండెలు నీరైపోయాయి. ముందుకు అడుగు వెయ్యలేక పోయాం. ఆ సమీప తరుచ్ఛాయలో కూర్చుండి పొంగి పొరలివస్తున్న దుఃఖాన్ని ఆపుకోలేక విలపించాము. ఆ సమయంలో జమానియానుండి గిరిజాకుమారుడు రావటం

కనిపించింది. అప్పుడింకా ప్రొద్దుక్రుంకటానికి మూడుగంటల వ్యవధి ఉన్నది. అతడు మారువేషంలో ఉండి తనను పరిచయం చేసుకున్నాడు.

"ఇంద్రదేవుడు కన్నీరొత్తుకుంటూ నిజంగా ఆయన మరణించాడా?" అని ప్రశ్నించాడు.

గిరిజా "చిత్తం; నేను చూస్తుండగానే ఆయన శరీరాన్ని చితికి ఎక్కించారు. పంచభూతాలలో కలసిపోవటంకూడా జరిగింది. కాని నాకు ఆయన మరణించలేదని అనుమానంగానే ఉన్నది."

ఇంద్రదేవుడు "నీకేనా? ఇంకెవరికైనాకూడా అనుమానంగా ఉన్నదా?

గిరిజా :- నాకే అనుమానంగా ఉన్నది.

ఇంద్ర :- ఎందుచేత నీకీ అనుమానం వచ్చింది.?

గిరిజా:- నిన్న హారనామసింహుడూ బీహారసింహుడూ అంతఃపురంలోనికి ఒకశవాన్ని బయటనుంచి తీసుకొని వచ్చారు. దాని అంతేమైందీ తెలియదుగాని? చివరకు రాజుగారి శవం మాత్రమే బయటకు వచ్చింది.

ఇంద్ర:- అనుమానించదగ్గ విషయమే.

గిరిజా:- ఆ తర్వాత రాజుగారి అంత్యక్రియలకు చాలా తొందరపాటు చేశారు. దూర దూరాలనుంచి రావలసిన వారినికూడా రానివ్వలేదు. అన్నిటికంటే ముఖ్యంగా చితిమీద నియమ విరుద్ధంగా శవంయొక్క ముఖాన్ని కప్పి ఉంచారు. దానికి కారణం రాణిగారు రాజుగారి ముఖాన్ని చూచి మరీ

దుఃఖితఅవుతుందని చెప్పారు గాని నాకుమాత్రం అనుమానం గానే ఉన్నది.

"నేను మనోరమ యెక్కడ ఉన్నదని ప్రశ్నించాను. గిరిజాకుమారుడు ఆమె దగ్గరఉన్నదని చెప్పాడు. తాను సాధువు వ్యవహారంలో చేసినమోసంవల్ల చాలా గమ్మత్తు జరిగిందనీ ఆవిషయం తర్వాత చెబుతాననీ చెప్పాడు. అప్పా డింద్రదేవుడు గోపాలసింహుడిని గురించి ఏంచేద్దామని గిరిజా కుమారుడిని అడిగాడు. అతడు తానేమీ చెప్పలేననీ పెద్దలు ఎలా సెలవిస్తే అలా నడుచుకొంటాననీ అంటూఉండగానే జమానియావైపునుండి సాధువు, జయపాలుడూ రావటం కని పించింది. గిరిజాకుమారుడు వాళ్ళిద్దరూ అలా బయలుదేర టంలో ఏదో రహస్యముందనీ అనుమతిస్తే తాను వారిని వెంటాడతానని అన్నాడు. వాళ్ళిద్దరు మమ్మల్ని దాటి వెళ్ళే దాకా మేమొక చెట్టుచాటున దాగుకొన్నాం. ఆ తర్వాత గిరిజాకుమారునికి నా గుర్రాన్నిచ్చి సాధువును జయపాలుడిని అనుసరించవలసిందిగా ఆజ్ఞాపించాడు. అతడా విధంగానే చేశాడు.

---

# మాయామయి

## మూడవ అధ్యాయం

### 1

ఒకగంటకంటే యెక్కువగా ప్రొద్దెక్కింది. సురేంద్ర సింహ మహారాజు బంగారుపీఠంమీద కూర్చుండి దంతధావనం చేస్తున్నాడు.సమీపానగోపాలసింహుడు మొదలైనవాళ్లున్నారు.

సురేంద్ర:- గోపాల్! నువ్వు రాజ్యాధికారానికి వచ్చిన తర్వాత వివేకంతో ప్రవర్తించలేదు. చాలాపొరపాట్లుచేశావు.

గోపాల:- అవును! దాని ఫలితాన్నికూడా అనుభవించాను.

వీరేంద్ర:- తడిసిగాని గుడిసెకప్పదని సామెతఉన్నదిగా! అందుకే ఖైదునుండి బయటకు వచ్చినతర్వాత గోపాలసింహుడు చాలా అద్భుతాలుచేశాడు. ఇంతకూ సాధువుకూ జయపాలునికి నువ్వేమి శిక్షను సూచించదలచుకొన్నావు?

గోపాల:- ఆవిషయంలో నేనూ ఒక నిశ్చయానికి రాలేకపోతున్నాను.

సురేంద్ర:- నేనుమాత్రం ఈ నిర్ణయాన్ని భూతనాథునికి వదలివేద్దా మనుకొన్నాను. అతడైతే ఏదైనా చక్కని సూచనచేస్తాడు.

భూతనాథుడు:- అంతటివాడినా ప్రభూ! అయినా మొదట వాళ్ళచేత పాదరసం తినిపించి శరీరమంతా పగిలిన తర్వాత ఆ పగుళ్ళకు ఉప్పూకారమూ అంటిస్తే బాగుంటుంది. చచ్చేవరకూ అలాచేస్తే అదే వాళ్ళకు సరైనశిక్ష.

సురేంద్ర:- శిక్ష సామాన్యమైందికాదే.

గోపాల:- వాళ్ళనుగురించి మీరేమీజాలిపడగూడదు. కావాలంటే నేను వాళ్ళను నారాజ్యంలోనికి తీసుకొనివెళ్ళి తగినశిక్ష విధిస్తాను.

వీరేంద్ర:- ఏదో ఒకటి చేయవచ్చులెండి! కానిజనూ నియీఇంద్రజాలాన్ని చూడాలంటే మార్గమేమిటి?

గోపాల:- నేను చూపిస్తాగా—

ఇంద్రజీతసింహ:- అక్కడ నాకింకా కొన్ని అనుమానా లున్నాయి. అందులో ఒకటి మొట్టమొదట ఆనందుడు చిక్కు కొన్న గదిలో ఉన్న లాడిలిబొమ్మ యెక్కడిది? ఆగాజు గృహంలో లాడిలీ కమలినుల విగ్రహాలు. మా అన్నదమ్ముల బొమ్మలు మా ఐంద్రజాలికుల రూపచిత్రాలు కనిపించాయి; అవేమిటి? అంతేగాక అక్కడ నేను లోపలకువెళ్ళినప్పుడు ఇనుపగొట్టాలమీద కొన్ని బొమ్మలు కదిలివెళుతున్నాయి. అదేమిటి? —

గోపాల:- అవన్నీ నేను చేసిన కిటుకులే! అవన్నీ ప్రాత కాలంనాటి బొమ్మలు నేనే వాటికి క్రొత్తగా ఈ ఆకారాలు వచ్చేట్టు రంగులువేశాను.

ఇంద్రుడు:- అదాసంగతి! నేనూ అట్లాగే అనుకున్నాను. కాని ఒక ఇంద్రజాలగృహంలో మేము నవ్వుతూ, నవ్వుతూ దూకాం. పాపం కమలిని సైనికులు దూకారు...

గోపాల:- అవును వాళ్ళందరూ జైలులో చిక్కుకొన్నా జీవించేఉన్నారు. ఇప్పుడు జమానియాలో ఉన్నారు. అందులో ఒకణ్ణి సాధువు మూటగట్టుకొని రోహితగఢపుకోటలో వది లాడు. అప్పుడు నేను కృష్ణాజినుని వేషంలో అక్కడవున్నాను.

ఇంద్రుడు:- పోనీలే, బ్రతికారు.

వీరేంద్ర:- దిలీప్‌చరిత్ర చాలా ఆశ్చర్యాన్ని కలిగించింది. ఇంతకూ నిన్ను మాయరాణి రెండోవాడికి తెలియకుండా చెరసాలలో ఎలా నిర్బంధించి ఉంచగలిగింది?

గోపాల:- నాకూ ఏమీ తెలియదు.

జీతసింహుడు:- దర్బారులో దిలీప్ చెబుతాడులెండి!

తిరిగి మహారాజు కొలువుదీర్చాడు. దిలీప్‌షా చెప్పటం ప్రారంభించాడు.

"గిరిజాకుమారుడు వెళ్ళినతర్వాత మేమిద్దరమూ ఇండ్లకు తిరిగి వెళ్ళిపోయాం. ఇంద్రదేవుడు నన్ను మాఇంటికి అప్పుడే వెళ్ళవద్దన్నాడు. నేను ఆగిపోయాను. అతడు చాలామంది గూఢచారులను జమానియాకు పంపించాడు. అప్పుడే నాకు భూతనాథునిభార్య జబ్బువడిందనీ నాభార్య చూడటానికి నా అనుమతి కోరుతోందని వార్తాహరుడు వచ్చిచెప్పాడు. నేను నా భార్యను వెళ్ళవలసిందిగా చెప్పివంపించాను. ఆతర్వాత కొంతసు నాభార్య తనదగ్గరకు తీసుకొనివెళ్ళినట్లుగా తెలిసింది. ఏ కాని,

మూడు రోజులు గడచినా గిరిజాకుమారుడు రాలేదు ఎక్కడ నుంచీకూడా విశేషాలు తెలియలేదు.

పన్నెండురోజు లైనతర్వాత గిరిజాకుమారుడు వచ్చాడు. అతనితోపాటు అర్జునుడుకూడా ఉన్నాడు. మా ఇంద్రజాలికులలో అతడుగూడా మంచిఉపాయశాలి. ఇతనికీ భూతనాథునికీ మధ్య కొంత వ్యవహారం నడిచింది. (రాజును, మంత్రినిచూచి) మీరే విన్నారుగదా; ఒకసారి అర్జునుడు భూతనాథుణ్ణి మాయచేసి బావిలోత్రోసి అతనిసంచిలోనుండి కొన్ని కాగితాలను కాజేశాడని...

జీత:- కాని ఆకాగితాలేమిటో తెలియలేదు.

భూత:- ఒకసారి నా కాగితాలు పోయాయని మీకు చెప్పాను. ఆతర్వాత గోపాలసింహమహారాజు మరణించాడని పుకారుపుట్టింది. వాటినే అర్జునుడు ఎత్తుకొనిపోయాడు. నేను ఉత్తరాలకు రెండునకళ్ళు వ్రాశాను. ఒకదానిని జాగ్రత్తగా ఇంట్లో పెట్టాను. ఒకటెప్పుడూ వెంటఉంచుకొనేవాడిని. అర్జునుడు దొంగిలించినవాటివల్ల నాకేమీ అపకారం జరగలేదు గాని ఇంటిదగ్గరనుంచిజయపాలుడు ఎత్తుకొనివచ్చిన ప్రతులతో నాకుచాలా నష్టం జరిగింది.

దిలీప్ తిరిగి చెప్పటం ప్రారంభించాడు.

మాకు గిరిజాకుమారుడు అర్జునుడూ బంధువులకంటేకూడా ఎక్కువప్రేమపాత్రులు. వాళ్ళిద్దరూ తిరిగి వచ్చిన తర్వాత మాలో ఈవిధంగా సంభాషణ జరిగింది.

నేను:- చాలారోజులు పట్టిందేమయ్యా?

గిరిజా:- ఇంకా చాలారోజులు వస్తేదే! అర్జునుడు రావటంవల్ల త్వరగా రాగలిగాను.

నేను:- ఏం జరిగిందో చెప్పు.

గిరిజా:- జయపాలుణ్ణే తీసుకొని సాధువు తిన్నగా మనోరమయింటికి వెళ్ళాడు. ఆ తర్వాత మనోరమ వచ్చింది. నేను రహస్యంగా ఆ ఇంటిలో ప్రవేశించాను. వాళ్ళిద్దరూ నాకు సాధువు వ్రాసియిచ్చిన లేఖనుగురించి పోట్లాడుకొన్నారు. తర్వాత రాజీపడి ఇదంతా భూతనాథుని కుట్ర అనుకొన్నారు. వాళ్ళమాటలవల్ల వాళ్ళుకూడా గోపాలసింహుడు మరణించాడనే అనుకొంటున్నారని తేలింది. ఆ మర్నాడు ఆయింటిలో నుంచి స్పృహతప్పిఉన్న ఒక ఖైదీని జయపాలుడు బేగమ్ ఇంటికి తీసుకొనివెళ్ళాడు. అతడు బలభద్రసింహుడని నా అనుమానం. బేగమ్ అతణ్ణి తనయింట్లోనుంచికూడా దాటవేసింది. సాధువు భూతనాథుణ్ణి చంపాలని ఉద్యుక్తుడయ్యాడు.

"ఒకసారి అర్జునుని ఇంటికి సాధువు వచ్చాడు. అతడు మిమ్మల్ని అర్జునుణ్ణి కలసి భూతనాథుణ్ణి చంపవలసిందని కోరాడు. రెండులక్షల రూపాయలు లంచమిస్తా నన్నాడు. మీరాశివ్వమని ఒక ఉత్తరంకూడా ఇచ్చాడు.

గిరిజాకుమారుడు ఇలా చెప్పి ఆ ఉత్తరాన్ని నా చేతికిచ్చాడు. నేను దానిని చదివి ఇంద్రదేవుని చేతికిచ్చాను. ఆ ఉత్తరంలోకూడా ఆ విషయమే ఉన్నది. కాని సాధువుకు సమాధానంవ్రాసి తమాషా చెయ్యాలనుకొన్నాను. ఆ తర్వాత గిరిజాకుమారుడు జమానియాకు వెళ్ళాడు. నేనూ అర్జునుడూ కలసి మాయింటికి వెళ్ళాము. ఇంటిదగ్గర భూత

నాథుని భార్యా జబ్బుపడి చాలా బలహీనంగా ఉన్నది. భూతనాథుడు తాను మరణించాడని ఏ విధంగా ప్రచారం చేశాడో అదేవిధంగా మేముకూడా శాంత యిష్టానుసారం శాంత, ఆమెకుమారుడు మరణించారని వదంతి పుట్టించాము.

తరువాత నేను వేళాకోళంగా సాధువుకు భూతనాథుణ్ణి పట్టియిస్తానని వ్రాశాను. కాని నా ఉద్దేశం భూతనాథుడు కలిస్తే సాధువుసంగతి తెలియజేసి జాగ్రత్తగా ఉండమని చెప్పడామనే! ఆ లేఖలన్నీ హరనామసింహుని దగ్గర ఇవ్వ డున్నాయి.

హరనామసింహుడు ఆ ఉత్తరాలను మహారాజు కందించాడు. అందరూ చదివినమీదట ఆ ఉత్తరాలు సాధువు ముందు విసిరివేయటం జరిగింది."

ఒలీప్‌షా మళ్ళీ ప్రారంభించాడు.

"మా ఇద్దరిమధ్యా ఒప్పందం జరిగిందని భూతనాథునికి తెలిసింది. అతడు సాధువును కలుసుకొన్నాడు. సాధువు నేను వేళాకోళంగా భూతనాథునికి వ్యతిరేకంగా వ్రాసిన ఉత్తరాలను చూపి నాపట్ల అతనికి విరోధభావాన్ని కలిగించాడు. అప్పటి నుంచీ భూతనాథుడు నన్ను నాశనం చెయ్యాలని పట్టుపట్టాడు. నేను సాధువును ఎదుర్కోవాలని సిద్ధపడ్డాను.

కొన్నాళ్ళకు గిరిజాకుమారుడు వచ్చి మాయరాణి అత్యంత వైభవంగా ఉన్నదనీ ఆమెదగ్గర మనోరమా నాగర్లతో పాటు ధనపతి అనే స్త్రీమూర్తి కూడా ఉన్నదని – నిజానికి ధనపతి పురుషుడే ననీ చెప్పాడు. సాధువు నన్ను సాధించాలని ప్రయత్నిస్తున్నాడని చెప్పాడు. భూతనాథుని రూపం అచ్చు,

గ్రుడ్డివట్లున్న ఒకవ్యక్తి అక్కడికి వచ్చిపోతున్నాడని కూడా చెప్పాడు. అత డప్పుడు బిహారీసింహుణ్ణి పట్టుకొని అర్జునుని యింట పెట్టి వచ్చాడట. అతని వేషంలో మాయారాణిని చేరుకొని రహస్యాలు తెలుసుకొని వస్తానని వెళ్ళాడు.

నిజానికి గిరిజాకుమారుడు చాలా నైపుణ్యంతో బీహారీసింహుని వేషంలో జమానియాలోని రహస్యాలు తెలుసుకొంటూ నాకు వ్రాస్తూఉండేవాడు. సాధువు మా మండలిలో ఎవరినీ చంపక పోవటానికి కారణం ఏమంటే మనో రమకు గోపాలసింహుణ్ణి వధించమని అతను వ్రాసిన ఉత్తరం మా దగ్గర ఉండటమే. ఒకసారి హఠాత్తుగా అర్జునుని దగ్గఱ ఉన్న బీహారీసింహుడు తప్పించుకొని పోయాడు. అతడు జమానియాకు చేరుకోవటంవల్ల అతని వేషంలో ఉన్న గిరిజా కుమారునికి వచ్చే ఆపద గ్రహించి నేనూ, అర్జునుడూ మారు వేషాలతో హుటాహుటిగా జమానియాకు ప్రయాణ మయ్యాము. మార్గమధ్యాన రాత్రివేళ ఒక అడివిలో ఆగి పోవలసి వచ్చింది. మే మిద్దరం ఒకచెట్టుమీద ఎక్కి కూర్చు న్నాం, అప్పుడు ఇద్దరు సైనికులు ప్రయాణంచేస్తూ మే మున్న చెట్టుక్రిందకు వచ్చారు. వారి సంభాషణవల్ల అందులో ఒకడు గిరిజా కుమారుణ్ణి ఎరిగిఉన్నట్టూ, అత డిప్పుడు శివశంకరుడనే పేరుతో జమానియాలో ఉన్నట్లూ మాకు తెలిసింది. వాళ్ళి ద్దరూ సాధువు పనుపున బేగందగ్గఱకు వెళుతున్నట్లుకూడా తెలిసింది. వాళ్ళను పట్టుకొంటే కొన్ని రహస్యాలు తెలుస్తా యనిచెప్పి చెట్టుదిగి వాళ్ళిద్దరి యెదుటా పడ్డాం. మేము దిలీప్‌షా మనుష్యులమని చెప్పాము. వాళ్లు దిలీప్‌షా పేరు

వినగానే ప్రమాదం సంభవిస్తుందని భయపడి మేమడిగిన అన్ని విషయాలకు దాపరికం లేకుండా సమాధానాలు చెప్పారు. గిరిజాకుమారుడు పట్టుబడ్డాడనికూడా చెప్పారు. బేగం దగ్గరకు వాళ్లు తీసుకొనివెళుతున్న ఉత్తరాన్ని చూపించారు. వాళ్లు మరునాటి రాత్రికి ఆమెను జమానియాకు తీసుకొని వస్తామన్నారు. అందుచేత మార్గమధ్యంలో గంగబడ్డున మేము చోరులలాగా నటించి ఆమెను బంధించి మాకు కావలసిన ఆచూకీ తీసుకోటానికి కూడా వాళ్లు ఒప్పుకొన్నారు. ఇలా చెయ్యటానికి స్థలనిర్దేశం చేసుకొన్నాము. తర్వాత ఆ రాత్రి అంతా మేము నలుగురమూ అడవిలో గడపాం. తెల్లవారిన పిమ్మట వాళ్ళిద్దరూ బేగం ఇంటివైపు వెళ్ళారు. అర్జునుడూ నేనూకూడా ఏం చెయ్యాలో ఆలోచించాము. అతడు గిరిజాకుమారునికి సాహాయ్యంగా జమానియాకు వెళ్ళాలనీ నేను బేగాన్ని పట్టుకోవాలని నిశ్చయించుకొని విడిపోయాము.

ఈ సందర్భంలోనే అసలు జమానియాలో గిరిజాకుమారుని వ్యవహారం ఎట్లా జరిగిందో చెబుతాను.

బీహారీసింహుడు జమానియా చేరుకొన్న తర్వాత సాధువు బీహారీవేషంలోవున్న గిరిజాకుమారుణ్ణి బంధించాడట. అప్పుడతడు తాను అర్జునుని శిష్యుడైన శివశంకరుణ్ణిని చెప్పాడు. అయితే తాను జమానియాకువచ్చింది తన గురువుగారి శత్రువైన భూతనాథుణ్ణి పట్టుకోటానికని చెప్పి తమకు జమానియామీద ఎటువంటి శత్రుత్వమూ లేదని సాధువును నమ్మించాడట. అప్పుడు సాధువు భూతనాథుడింకా బ్రతికే ఉన్నాడా అనే అనుమానాన్ని వెలిబుచ్చితే గిరిజాకుమారుడు

భూతనాథుడు బ్రతికేవున్నాడనీ బేగంతో అతనికి సంబంధం కలదనీ ఉద్ఘాటించాడట! జయపాలునితో సంబంధంకల బేగం భూతనాథునితో కూడా సంబంధం పెట్టుకొన్నదని వినటంవల్ల ఆమెను జమానియాకు రమ్మని సాధువు కబురంపించాడట. ఆమెవచ్చి వెళ్ళేవరకూ గిరిజాకుమారుడు బీహారీసింహుని వేషంలోనూ, బీహారీసింహుడు మారువేషంలోనూ ఉండటానికి సాధువు అనుమతించాడు. ఆతర్వాత బీహారీసింహుని తోడ్పాటుతో భూతనాథుణ్ణి పట్టుకోవటంలో సాయపడతానని గిరిజాకుమారుడు సాధువుకు వాగ్దానంచేశాడట.

కాని ఈ విషయాలన్నీ మాకు తెలియక నేను బేగాన్ని పట్టుకోటానికే అజ్ఞునుడు జమానియా వెళ్ళి గిరిజా కుమారుణ్ణి రక్షించటానికి ఏర్పాట్లు చేసుకొన్నాం."

## 2

"అప్రకారంగా నే నేను తిన్నగా ఇంటికి వెళ్ళి కొంత మందిని తోడుతీసుకొని గంగఒడ్డున బేగాన్ని దోపిడిచేశాం. అప్పుడామె దగ్గర కొన్ని కాగితాలూ ఒక వజ్రాంగుళీయకమూ దొరికాయి. కాని అవి మళ్ళీ నా దగ్గరనుంచి పోయాయి. వాటిని భూతనాథుడు బేగం యింటిలోనుంచి సంగ్రహించాడు. అదంతా ఒక కథ.

బేగం వెంటవచ్చిన మనుష్యులు ఆమెను దొంగతెత్తుకుపోయారని జమానియాకు వెళ్ళి చెప్పారు. గిరిజాకుమారుడు ఈ పని చేసింది భూతనాథుడేనని చెప్పి బీహారీసింహునితో తాను జ్యోతిషీ వేషం ధరించి బీహారీ సింహునిచే

వైద్యవేషం వేయించాడు. ఇద్దరూ బేగం యింటికి ప్రయాణ మయ్యారు. ఈ సంగతులన్నీ గిరిజాకుమారుణ్ణి విడిపించటానికి జమానియాకు వెళ్ళిన అర్జున్‌సింహుడు తెలుసుకొని మార్గమధ్యంలో బీహారీకి తెలియకుండా గిరిజకుమారుణ్ణి కలుసుకొని సంగతి సందర్భాలన్నీ వివరించి చెప్పి నాదగ్గరకు వచ్చాడు. అప్పుడు బేగం నాదగ్గరనే ఖైదీగావున్నది. ఇద్దరమూ కలసి ఏంచెయ్యాలా? అని ఆలోచించాం. ఆమెదగ్గర దొరికిన కాగితాలు వజ్రపుటుంగరము అర్జునసింహునికి చూపించాము.

"ఆ రోజులలో నాకు ముఖ్యంగా మూడు విషయాలను గురించిన ఆవేదన ఉండేది. ఒకటి భూతనాథుణ్ణి ఋజుమార్గాన పయనింపచెయ్యటం, రెండోది గోపాలసింహుణ్ణి గురించి ఆరాతియ్యటం, మూడోది లక్ష్మీదేవి భలభద్రసింహులను సాధువు చెరసాలనుండి విముక్తుల్ని చెయ్యటం. ఈ మూడురకాల కార్యక్రమాలలో విజయం సాధించాలని చాలా ప్రయత్నం చేస్తూవుండేవాణ్ని.

బేగం దగ్గర పట్టుబడ్డ కాగితాలనూ, ఉంగరాన్ని పరిశీలిస్తే ఆమె సాధారణ స్త్రీ కాదని తెలిసింది. ఆ కాగితాలలో కొన్ని భూతనాథుణ్ని గురించి జయపాలుడు బేగానికి వ్రాసిన ఉత్తరాలు. కొన్ని ఉత్తరాలవల్ల మాయారాణి తండ్రిని రాణి, సాధువుల ఇష్టానుసారం జయపాలుడు వధించాడని అర్థమవుతోంది. అంతేగాక బలభద్రసింహుడు జీవించే ఉన్నాడనీ, లక్ష్మీదేవి కారాగారంలో నుండి పలాయనం చిత్తగించి సాధువుకు అంతు తెలియకుండా తిరుగుతోందనీ స్పష్టమౌతోంది. ఆ వజ్రపుటుంగరం మాయారాణి తండ్రి

థైన హేలాసింహునిది. అతనిని వధించినతర్వాత జయపాలుడా వుంగరాన్ని వశపరచుకున్నాడు. ఆ ఉంగరానికి కట్టివున్న చీటీలో బలభద్రసింహుణ్ణి బంధించవలసిందిగాను హేలా సింహుణ్ణి చంపవలసిందిగాను రాణీ సాధువులు అనుమతించి నట్లు సంతకాలుచేసి ఉండటం కనిపించింది.

ప్రస్తుతం ఆ కాగితాలు వుంగరము బలభద్రుని విడి పించటానికి వెళ్ళిన భూతనాథుడు సంపాదించి మహారాజుగారి కిచ్చాడు. అయితే తొలుదొల్త నాచేతికి చిక్కిన ఈ వస్తువులు తిరిగిబేగందగ్గరకుఏందుకు వెళ్ళాయనేఅనుమానంమీకురావచ్చు దానికి కారణం భూతనాథుడే! అతనివల్ల నేను బేగం సాధు వుల చేతులలో చిక్కినప్పుడు ఈ వస్తువులుకూడా తిరిగి వారి అధీనమయ్యాయి. ఈవిధంగా చేసినందుకు భూతనాథుడు ఆ తర్వాత చాలా సిగ్గుపడ్డాడు. ఆ విషయం వేరు.

అర్జునుడూ నేనూ ఎక్కువసేపు ఆలస్యం చెయ్య కుండా గిరిజాకుమారుణ్ణి కలుసుకోవాలని ప్రయాణమయ్యాం.

బీహారీని వెంటబెట్టుకొని గిరిజా కుమారుడు బేగం ఇంటికి ఐదుక్రోసుల దూరంలోనికి చేరుకొన్నాడు. అది ఒక చిన్నగ్రామం. ఆ గ్రామంలో ప్రయాణీకులకొరకు ఒక సత్రం ఉన్నది. ఆ సత్రంలో హల్వా దుకాణంతోపాటు అన్నిరకాల దుకాణాలు వున్నాయి. ముందుగానే నేనూ అర్జునుడూ ఆ హల్వాదుకాణాన్ని ఏర్పాటుచేశాం. బీహారీసింహుడూ గిరిజా కుమారుడూ మాదగ్గరనే హల్వా పూరీలు కొని ఊరివెలువల తోటలోనికి వెళ్ళారు. గిరిజాకుమారునితో కలిసే మేమీ యేర్పాట్లు చేశాం. ఆ తోటలో పూరీలు తిని బీహారీ

సింహుడు శరీరం మఱచిపోతూ ఉన్న స్థితిలో గిరిజా కుమారునితో గోపాలసింహుడు మరణించలేదని రహస్యాన్ని బహిరంగ పరచాడు. ఆ సమయంలో భూతనాథుడు అక్కడకు ప్రత్యక్షమయ్యాడు. బాగా మత్తెక్కిఉన్న బీహారీ సింహుడు భూతనాథుణ్ని చూచి వణకిపోయాడు. భూతనాథుడు గిరిజాకుమారుణ్ణి గుఱించి మాట్లాడటంకూడా అతని ఆశ్చర్యాన్ని ద్విగుణీకృతం చేసింది. అప్పటికి మత్తు బాగా తలకెక్కటంవల్ల అతడు స్మృతితప్పి పడిపోయాడు. గిరిజాకుమారుడు భూతనాథునితో తానుగాని, దిలీప్‌గాని అతనికి శత్రువులు కారని ఎంతగా చెప్పినా అతడు వినక శత్రుత్వమే వహించి అతనిని ఎత్తుకొనిపోయాడు. ఆ తర్వాత, నేనూ అర్జునుడూ ఆ తోటలోనికి వస్తే ఎవరూ కనిపించలేదు.”

ఆనాటికి సభ చాలించబడింది.

## 3

తిరిగి సభ ప్రారంభమైన తర్వాత దిలీప్‌షా తన కథాశేషాన్ని కొనసాగించాడు.

“ఆ తర్వాత నేను గిరిజాకుమారుణ్ణి వెదకటానికి మారువేషంలో తిరుగుతున్నాను. భూతనాథుడు నన్ను పట్టుకోటానికి ఒకనాటిరాత్రి మా యింటికి వచ్చి నా కుమారుడనుకొని స్వయంగా తన కొడుకునే పొట్టబెట్టుకున్నాడు. చివరకు ఎలాగైతేనే నన్ను పట్టుకొని సాధువుకు అప్పగించాడు. అక్కడ ఖైదులోనే గిరిజా కుమారుణ్ణి కూడా చూచాను.”

ఈ విధంగా దిలీప్‌షా తన జీవిత వృత్తాంతాన్ని ముగించాడు. నాటికి సభ చాలించిన తర్వాత సురేంద్రసింహమహారాజు తనవారితో కలసి ఆలోచించి తీర్పును సిద్ధంచేశాడు. ఆ తీర్పు ఇది.

1. దుర్మార్గుడైన సాధువును శిక్షించటానికి అతనిని గోపాలసింహ మహారాజుకు అప్పగించాలి. ఆ మహారాజు తన యిష్టంవచ్చినట్లుగా అతనిని శిక్షించవచ్చు.

2. సాధువు తమ్ముడైన శిఖండీ, మాయాప్రసాదుడూ జయపాలుడూ, హరనామసింహుడు, బీహారసింహుడు, హరినామసింహుని పుత్రిక లీలా, మనోరమ, నాగరీ, బేగమూ, నవరత్నమూ, జమాలో మొదలైనవాళ్ళందరూకూడా గోపాలసింహుని అధీనంలోనే ఉంటారు.

3. బేగం ఇంటిలో ఉన్న డబ్బంతా బలభద్రసింహునికి యివ్వాలి.

4. గౌహర్, గిల్లన్‌లను షేర్ఆలీఖాన్ వద్దకు పంపించాలి.

5. కిశోరీ సమ్మతిస్తే భీమసేనుణ్ణి విడిచిపెట్టి అతనిని శివదత్తగఢానికి రాజును చెయ్యాలి.

6. కమలినికి తటాకమధ్యంలో గల ఇంటిలో బందీలై యిక్కడకు వచ్చిన కుబేరసింహుడూ, బాకరాలీ, అజయసింహుడూ, ఖుదాబక్ష్, యార్ ఆలీ, ధర్మసింహుడూ, గోవిందసింహుడు, భగవానీ, లలిత, ధన్నూసింహుడూ మొదలైన

వారిని యావజ్జీవిత కారాగారవాసానికి పంపాలి. నానకును కూడా ఖైదులో వెయ్యాలి.

7. దిలీప్‌షా, అర్జునసింహుడూ, హరదీనుడూ, భరత సింహుడు, గిరిజాకుమారుడూ గోపాలసింహుని అనురాగానికి పాత్రులై అతనిరాజ్యంలో ఉంటారు.

# 4

నవ్వుతూ విచిత్రగృహం గోడమీదనుండి లోపలకు పడిపోకుండా ఇంతవరకూ ఎవరూ దిగిరాలేకపోయారు. అందరూ బహుమానంకోరకు ఆశపడి విఫలులయ్యారు.

ఒకనాడు సురేంద్రసింహ మహారాజు స్వయంగా కూర్చుండి యీపోటీని నిర్వహించాడు. ఆ పోటీలో పన్నాలాల్ మొదలైన ఐంద్రజాలికులందరూ కూడా పాల్గొని అపజయం పొందారు.

చివరకు భూతనాథుడు గోడమీదకు ఎక్కి ఇతరులలాగా నవ్వుతూ పడిపోకుండా నిగ్రహించుకొని విజయుడై క్రిందికి దిగివచ్చాడు. అతని శక్తిసామర్థ్యాలకు సురేంద్రసింహ మహారాజు సంతసించి రెండులక్షల రూపాయలు బహుమానంగా ఇచ్చాడు.

అసలక్కడ ఏమిజరిగిందీ చెప్పవలసిందని భూతనాథుని అనుయాయులు పట్టుబట్టగా అతడీవిధంగా చెప్పాడు—

"లోపలికి తొంగిచూడగానే మనుష్యులు నవ్వుతూ అవశులై పడిపోవటానికి కారణం దానిలోపలనుంచి ఒకవిధమైన ధూమం రావటమే కారణమైవుంటుందని నేను ముందుగానే గ్రహించాను. అయితే ఆగోడకుకూడా విద్యుత్ప్రభావం ఉండిఉంటుందని భావించి నేను విద్యుత్ప్రభావం నా శరీరానికి తగలకుండా కొయ్యచెప్పులు ధరించాను. గోడయెక్కిన తరువాత నేననుకొన్నట్టుగానే లోపలనుండి ఒకవిధమైన ఆవిరి వచ్చింది. దానిని పీల్చకుండా లోపలకు తొంగిచూచినప్పుడు ఊపిరి బిగబట్టాను. అందుచేత ఇతరుల మోస్తరుగా నాకు నవ్వురాలేదు. అంతేగాకుండా కాళ్ళకు కొయ్యచెప్పులున్న కారణంవల్ల నాశరీరంలో ఏవిధమైన బలహీనత రాలేదు. అందుచేత నేను వచ్చినదారినే సునాయాసంగా తిరిగి రాగల్గాను."

అతడు చేసినపనికి అభినందిస్తూ మహారాజు ఆ నవ్వుల యింటిని గురించి ఈవిధంగా చెప్పాడు.

"ఇంద్రజీతసింహునికి ఇంద్రజాలంలో ఒకరాత్రి శునకం దొరికింది. ఆ శునకాన్ని నీళ్ళల్లో ముంచితే ఒకవిధమైన ఆవిరి వచ్చి అది పీల్చినవాళ్ళు వళందప్పి కడుపు చెక్కలయ్యేటట్టు నవ్వుతారు. అంతేగాక దానిగుండా విద్యుత్ప్రసారంకూడా ప్రారంభమవుతుంది. ఆ విద్యుత్తును గోడలకు ప్రసరింపచెయ్యటంవల్ల దానిమీదకు ఎక్కినవారు శక్తిహీనులై ఆ వంగినవైపుకు పడిపోతారు. ఇంద్రజాలంలో దొరికిన ఈ విశిష్ట గృహాన్ని మనమెక్కడైనా నిర్మించవచ్చు. ఇటువంటి గృహంలోనే లోగడ మనవాళ్ళు మోసపోయారు."

ఆ తర్వాత దర్బారు తీర్చి ఖైదీలనుగూర్చి తమతీర్పును మహారాజు వినిపించాడు. అందరూ ఆయన తీర్పును ఆమోదించారు. సాధువు మొదలైనవాళ్ళు గోపాలసింహుడు తమకు విధించబోయే శిక్షలను తలచుకొని గుండెలు బాదుకొని వేడ్చారు. ఖైదీలను తీసుకొని గోపాలసింహుడు భార్యాసమేతంగా జమానియా వెళ్ళాడు. మిగతావాళ్ళందరూ చునారగఢంలో ఆనందంగా తమ జీవితాలను గడవటం ప్రారంభించారు.

భూతనాథుడు తన జీవితచరిత్రను వ్రాయటం పూర్తి చేసి సురేంద్రసింహ మహారాజు కిచ్చాడు. ఆయన దానిని శ్రద్ధగా చదివి జాగ్రత్తగా తనవద్ద దాచిఉంచాడు.

---